# Achalatmaja Parinayam.

(SLESHA KAVYA.)



BY

Venkatacharyulu

EDITED WITH MEANING BY

RAJA M. BHUJANGA RAU,

BAHADUR, ZAMINDAR

ELLORE.

THE MANJUVANI PRESS, ELLORE.

 *Price* **12** *Annas.*

PRINTED & PUBLISHED BY N CHALAPATI RAU

శ్రీ

# అచలాత్మజాపరిణయము.

## ద్వ్యర్థ ప్రబంధము.

ఇది

సర్వతంత్రస్వతంత్ర, శ్లేషయమక చక్రవర్తి బిరుదాంక,
శ్రీమాన్ తిరుమల బుక్కపట్టణ

వేంకటాచార్య ప్రణీతము.

---

శ్రీ రాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దరు
జమీన్‌దార్ గారివలన
అర్థ తాత్పర్యములతోఁ గూర్పఁబడినది.

ఏలూరు

మంజువాణీ ముద్రాక్షరశాల.

1906

 వెల 12 అణాలు.

# అచలాత్మజాపరిణయము.

ఇదిపర్వతపుత్త్రికయగు పార్వతియొక్కయు, భూపుత్త్రికయగుసీతయొక్కయు పరిణయకథగలిగిన శ్లేషప్రబంధము. ఈద్వ్యర్థప్రబంధము సమగ్రముగా నెక్కడనులభించలేదు. మదరాసు ఓరియంటల్ లైబ్రరీయందును, కవివంశీయులకడనుగూడ నసంపూర్తిమాతృకయేదొరకినది. సంపూర్తిగ్రంథమెక్కడగాలించినను దొరకుటగాని, దొరకుమార్గములుగాని కానిపించనందున చిరకాలము ముద్రించకయుంచితిమి ప్రతిపద్యచమత్కారభూయిష్టమగు నీగ్రంథమందలి కొంతభాగమైనను లోకమునకువెల్లడిచేయుట యుత్కృష్టమైనపనియని పలువురు సరసులు నొక్కిచెప్పుటచేత నిట్లునేటికి ప్రచురించగలిగితిమి

ఈగ్రంథమును మొట్టమొదట టీకాతాత్పర్యములు లేకుండ మూలము మాత్రమేప్రచురింప నెంచితిమిగాని, ద్వ్యర్థియగుటచేత సుబోధముగా నుండుటకై శ్రమపడి ఎట్లో అర్థతాత్పర్యములు గూడవలయునంత విపులముగాజేర్చితిమి. కృత్యాదిపద్యములు లభించనందువలన నూతనముగావ్రాసితిమి. ఈమూడాశ్వాసములగునప్పటికికథ రామపక్షమున అహల్యాశాప విమోచనపర్యంతమును, శివపరమున కామదహనానంతరమున రతీదేవికి మాత్రముమన్మథుడు కానుపించునంతవరకు జరిగినది. ఇంకొకయాశ్వాసము మాత్రమేమిగిలియుండును.

ఈగ్రంథభాగమును, నేతత్కవికృతేతర గ్రంథములు సిరిపురము సంస్థానమున శిథిలములైనవని చెప్పుచున్నారు.

హరిశ్చంద్రనలోపాఖ్యానము, రాఘవపాండవీయాది గ్రంథములయంతప్రౌఢముగాక పోయినను నాధునికకవిత్వములకంటె మిక్కిలి ప్రౌఢముగాశ్రావ్యముగా నున్నదనుటకు సంశయములేదు.

ఇట్లు
సజ్జనవిధేయుడు
రాజాభుజంగరావు

# అచలాత్మజాపరిణయము

## ద్వ్యర్థిప్రబంధము

### ప్రథమాశ్వాసము

---

(ఉ. శ్రీరమణీమణీసతత-జృంభితమున్వరవైజయంతికా।
సారవిరాజితంబువిల-సత్స్రుచికౌస్తుభశోభితంబునా।
భూరితరోరమింపులను-బొల్పెసఁగంగనుభక్తకోటికా।
ధారముసౌఖ్యదాయియగు-దైవశిఖామణిశౌరిఁ గొల్చెదన్)

* * * * * * *

షష్ఠ్యంతములు.

క. ఏతాదృశసుగుణమణి।
వ్రాతాంబుధికింబ్రపన్న-వరసేవధికిం।
పీతామితగీతామృత।
జాతాఖిలసుజనముక్తి-సౌఖ్యావధికిన్॥ ౧॥

టీ. ఏతాదృశ=ఇట్టి, సుగుణమణి=యోగ్యగుణముల నెడు మాణిక్యములయొక్క, వ్రాత=సముదాయమునకు, అంబుధికిన్=సముద్రుఁడయి నట్టియు, ప్రపన్న=భక్తులకు, వర=శ్రేష్ఠమయిన, సేవధికిన్=నిధియైనట్టియు, పీత=పానము చేయఁబడిన, అమిత=హద్దులేని, గీతా=భగవద్గీతయనెడు, అమృత=అమృతబిందువులయొక్క, జాత=సమూహముగల, అఖిల=ఎల్లవారైన, సుజన=యోగ్యజనులయొక్క, ముక్తి=మోక్షము చేతనయిన, సౌఖ్య=సుఖమునకు, అవధికిన్=హద్దయినట్టియు-

క. శరణాగతభరణాయత।
కరుణారసలసదపాంగ-కమలదళాక్షా।

భరణాళివితరణాదృత।
వరుణాలయరాజదుహితృ-వరవక్షునకున్॥ ౨॥

టీ. శరణ=రక్షణమునుగూర్చి, ఆగత=వచ్చిన వారియొక్క, భరణ=పోషించుటచేతను, ఆయుత=విస్తారమైనట్టియు, కరుణారస, దయారసముచేతను, లసత్=ప్రకాశించుచున్న, అపాంగ=క్రేగంటిచూపుల నెడు, కమలదళ=తామరరేకులయొక్క, ఓఘ=సముదాయరూపమగు ఆభరణ=అలంకారములయొక్క, ఆళి=పఙ్క్తియొక్క. వితరణ=ఇచ్చుట చేతను, ఆదృత=ఆదరింపఁబడిన, వరుణాలయ దుహితృ=లక్ష్మిచేత, వర=శ్రేష్ఠమగు, వక్షునకున్=వక్షస్థలముగలిగినట్టి-

క. గర్హణరహితార్హణపర।
బర్హిణహయవరసరోజ-వనహంసునకున్।
బర్హాపరిబర్హధురీ।
ణార్హదరీణమకుటాంచ-దవతంసునకున్॥ ౩॥

టీ. గర్హణ=నిందతోడ, రహిత=శూన్యమైనట్టియు, అర్హణ=పూజ పర=ప్రధానముగల, బర్హిణ=నెమలియనెడు, వర=శ్రేష్ఠమయిన, హయ=గుఱ్ఱముగల కుమారస్వామియొక్క సరః=సరస్సువంటిదైన, (అనఁగా స్వామిపుష్కరిణియందయిన) అబ్జవన=పద్మవనమునకు, హంసునకున్=అంచయైనట్టియు. [అందు విహరించునను ట] బర్హా=నెమలిపురియనెడు, పరిబర్హ=రాజచిహ్నముయొక్క, ధురీణ=భారమునువహించినట్టియు, అర్హత్=తగిన, అరీణ=చెడిపోనట్టి, మకుట=కిరీటముచేతను, అంచత్=ఒప్పుచున్న, అవతంసునకున్=శిఖగలిగినట్టియు.

క. నందపతరునిందనకృద।
మందనవయశోవిశేష-మహిమజితవృష।

స్యందనచందనకుందన।
వేందునకునజాండపటల-హితతుందునకున్॥ ४॥

టీ. నందనతరు=కల్పవృక్షములయొక్క, నిందన=ఏవగింపును,కృత్=చేయునట్టి, అమంద=గొప్పదియగు, నవ=నూతనమైనదియౌనగు, యశోవిశేష=కీర్త్యతిశయముయొక్క. మహిమ=సామర్థ్యముచేతను, జిత=జయింపఁబడిన, వృషస్యందన=ఈశ్వరుఁడును, చందన=మంచిగంధమును, కుంద=మల్లెపూవులును, నవ=నూతనుఁడగు, ఇందునకున్=చంద్రుఁడుగలిగినట్టియు (నవేందుఁడనిచెప్పుటచేత కళంకములేదనియు, వృద్ధిఁబొందువాఁడనియుస్వారస్యము) అజాండ=బ్రహ్మాండములయొక్క, పటల=సమూహమునకు, హిత=అనుకూలమగు, [అనఁగా నుండఁదగిన] తుందునకున్=కడుపు గలిగినట్టియు

క. శబరీకబరీనిబిరీ।
సబరీభృతవంజులప్రసవరిరసయిషా।
శబలితనరహరివిగ్రహా।
కబళితకశ్యాణకశిపు-ఘనగరిమునకున్॥ ५॥

టీ. శబరీ=శబరస్త్రీవేషధారిణియగులక్ష్మియొక్క, కబరీ=కొప్పునందు, నిబిరీస=దట్టముగాను, బరీభృత=మిక్కిలిధరింపఁబడిన, వంజులప్రసవ=అశోకపుష్పములయొక్క, రిరసయిషా=ఆస్వాదించనిచ్ఛచేతను, శబలిత=చిత్రవర్ణముకలదియై చేయఁబడిన, నరహరివిగ్రహా=నృసింహాశరీరముచేతను, కబళిత=మ్రింగఁబడిన, కశ్యాణకశిపు=హిరణ్యకశిపునియొక్క, ఘన=గొప్పదియగు, గరిమునకున్=గౌరవముగలిగినట్టియు

క. వేలాతిగలీలాతిశ।
యాలాపకలాకలాప-హార్షితధరణీ।

లీలాతరుణీలాలిత।
ఖేలాపరిచరణచరణ-కిసలయధృతికిన్॥ ౬.

టీ. వేలాతిగ=హద్దుమీరిన, లీలా=విలాసములయొక్క, అతిశయ=గొప్పతనముగల, ఆలాప=పలుకులయొక్క, కలా=నేర్పులయొక్క, కలాప=సమూహము చేతను, హర్షిత=సంతోషింపఁజేయఁబడిన, ధరణీ=భూమియును' లీలాతరుణీ=విహారస్త్రీచేతను, లాలిత=ఆదరించఁబడిన, ఖేల=క్రీడయందైన' పరిచరణ=ఉపచారములుగల, చరణకిసలయ=చివుళ్ళవంటి పాదములయొక్క' ధృతికిన్=ధరించుటగలిగినట్టియు.

క. బంధురదరమాంధరతర।
సింధురవరచరణచరణ-శితముఖముకర।
స్కంధనవోద్గ్రంథనకృ।
ద్గంధనమత్పలితభరిత-తతచక్రునకున్॥ ౭.

టీ బంధుర=విస్తారమగు, దర=భయము చేతను, మంధరతర=మిక్కిలిమందమయిన, సింధుర=ఏనుఁగుయొక్క, వర=శ్రేష్ఠమగు, చరణ=పాదముయొక్క, చరణ=నములుటయందు, శిత=తీక్ష్ణమగు, ముఖ=మోముగల, ముకర=మొసలియొక్క, స్కంధ=మూపుయొక్క, నవ=క్రొత్తదియగు, ఉద్గ్రంథన=నరుకుటను, కృత్=చేసినట్టియు, గంధ=లేశముగాను, నమత్=వంగినట్టియు, పలిత=బురదచేత. భరిత=నిండిన. తత=విస్తారమగు, చక్రునకున్=సుదర్శనముగలిగినట్టియు

క. జల్పాకవికల్పాతిగ।
తల్పాకలితనుతనుజన-తాపింతకరణా।
కల్పాగమకల్పాంచద।
నల్పాభయముద్రికాంక-హస్తాబ్జునకున్॥ ౮॥

టీ. జల్పాక=ప్రేలరులయొక్క. వికల్ప=పలురీతులను, అతిగ=అతిక్రమించిన. [అనఁగా శబ్దశాస్త్రప్రకట్టులేక పలుమంది పలుదెఱఁగుల శబ్దము నుచ్చరించుచుండఁగా దానికి కట్టు నేర్పరిచినవాఁడనుట అనఁగా పతంజలి అతఁడే శేషుఁడు] శేషుఁడనైడు తల్ప=శయ్యయందు, ఆకలితునకున్=ఒప్పుచున్నట్టియు, సుజనతా=యోగ్యజన సమూహముయొక్క హిత=ఇష్టముయొక్క, కరణ=చేయుటయందు, కల్పాగముకల్ప=కల్పవృక్షముతో సమానమయినట్టియు, అంచత్=ఒప్పుచున్న. అనల్ప=విస్తారమగు, అభయముద్రిక=భయములేదని యర్థమును సూచనజేయునట్టి యభినయము, అంక=చిహ్నము గాఁగల, హస్తాబ్జునకున్=పద్మమువంటి హస్తము గలిగినట్టియు

క. విష్ణునకరిజిష్ణునకతి
ధృష్ణునకినజావనీచ-రిష్ణునకును వ
ర్ధిష్ణునకతితృష్ణునభూ
విష్ణునకును గృష్ణునకున-వితకృష్ణునకున్॥ ౯ ॥

టీ. విష్ణునకున్=వ్యాపకస్వభావుఁడైనట్టియు, అరిజిష్ణునకున్=శత్రువులను జయించునట్టియు, అతిధృష్ణునకున్=మిక్కిలి దురుసువాఁడయినట్టియు, ఇనజ=యమునానదియొక్క, అవనీ=భూమియందు, చరిష్ణునకున్=సంచరించువాఁడయినట్టియు, వర్ధిష్ణునకున్=వృద్ధిబొందు స్వభావముగలిగినట్టియు, అతితృష్ణునకున్=ఆశనతిక్రమించినట్టియు, [ఆశలేనివాఁడనుట] భూవిష్ణునకున్=కాఁగలవాఁడయినట్టియు, కృష్ణునకున్=కృష్ణావతారుఁడయినట్టియు, అవిత=రక్షింపఁబడిన. కృష్ణునకున్=ద్రౌపదీదేవిగలిగినట్టియు.

క వాచాతిగభీచాపల!
నీచాగ్రగమన్యనూజ-నితతాపహరా!

నూచానసుధాచారుద।
యాచాతురినలరు వేంకటాచలపతికిన్॥ ౧౦॥

టీ. వాచా=వాక్యములను, అతిగ=అతిక్రమించిన, [అనఁగాఁ జెప్ప శక్యముగాని] భీ=భయముయొక్క, చాపల=చాంచల్యముగల, నీచ=తక్కువవానిలో, అగ్రగ=ముందుగా నడచునట్టి, మత్=నాయొక్క, మనః=చిత్తమునందు, జనిత=పుట్టిన, తాప=తాపముయొక్క, హార=హరించుటయందు, అనూచాన=గురువులవద్ద సాంగాధ్యయనము జేసిన, [అనఁగా బాగుగ నెఱిఁగినదనుట] సుధా=అమృతమువలె, చారు=మనోహరమైయున్న, దయా=అక్కటికముయొక్క, చాతురిన్=నేర్పుచేతను, అలరు=ఒప్పుచున్న, వేంకటాచలపతికిన్=తిరుమలకుఁ బ్రభువగు శ్రీవేంకటేశ్వరునికి

వ. సమర్పితంబుగా నొనర్పంబూనిన యచలాత్మజాపరిణయంబను శ్లేషప్రబంధంబునకుఁ గథావిధానం బెవ్విధానంబునం బ్రవర్తిల్లెనన. ౧౧॥

టీ. సమర్పితంబుగా=ఈయఁబడినదిగా, ఒనర్పన్=చేయుటకు, పూనిన=ఆరంభించిన, అచలాత్మజా=పర్వతపుత్త్రికయగు పార్వతియొక్క, భూపుత్త్రికయగు సీతయొక్క, పరిణయంబు=వివాహము, [అనఁగా వారి వివాహకథ ప్రధానముగాఁ గలది] అను=అని చెప్పఁబడునట్టి, శ్లేషప్రబంధమునకున్=రెండర్థములు గల కావ్యమునకు, కథావిధానంబు=కథాపద్ధతి, ఎవ్విధానంబునన్=ఏతీరున, ప్రవర్తిల్లెనన=జరిగెనంటే.

కథాప్రారంభము.

ఉ. వందనకృత్పురందరభ-వప్రముఖామరబృందమిందిరా।
నందముకుందకీర్తికథ-నగ్రథనప్రథనొప్పుబాసవాల్।
సుందరులందనర్చివర-లున్నవినైమిశమట్టిసజ్జనా।
నందనమైవిలాసజిత-నందనమైనతపోవనంబునన్॥ ౧౨

టీ. వందన=నమస్కారమును, కృత్=చేయుచున్న, పురందర=దేవేంద్రుఁడును, భవ=శివుఁడును, ప్రముఖ=మొదలుగాఁగల, అమర=దేవతలయొక్క, బృందము=సమూహముగల, నైమిశము=నైమిశమను పేరుగల, వని=అరణ్యము, ఇందిరా=లక్ష్మియొక్కయు, నంద=నందునియొక్కయు, ముకుంద=కృష్ణునియొక్కయు, కీర్తి=కీర్తులయొక్క, కథన=కథలయొక్క, గ్రథన=కూర్చుటయందు, ప్రథన్=ప్రసిద్ధిచేత, ఒప్పు=తగియున్న, తాపసవాల్=మునులయొక్క, సుందరులన్=స్త్రీలచేత. తనర్చి=ఒప్పినదై, వరలున్=ప్రకాశించును. అట్టి=అప్రకారమైన, సజ్జన=యోగ్యజనులకు, ఆనందనము=ఆనందింపఁజేయునది, ఐ=అయి, విలాస=శోభచేతను, జిత=జయింపఁబడిన, నందనమైన=స్వర్గోద్యానముకలదియైనట్టి, తపోవనంబునన్=తపస్సునకనుకూలమగువనమందు, ముందుపద్యముతోనన్వయము.

చ. సరసిజపత్రనేత్రవర-సామజవల్లభశృంఖలాయుత!
స్వరచితభక్తిమానితుఁడు-శౌనకమానిమనోవినోదకృ!
త్సరళకథాభిధాసదవ-ధానవిధాతనుసూతజున్మనో!
హరమచలాత్మజాపరిణ-యంబునయంబునఁ దెల్పవేయనన్॥

తా. సరసిజపత్రనేత్ర=విష్ణువనెడు, వర=శ్రేష్ఠమయిన, సామజవల్లభ=గజరాజునకు, శృంఖలాయుత=సంకెలవలెనాచరించుచున్న, స్వ=తనచేత రచిత=చేయఁబడిన, భక్తి=భక్తిచేతను, మానితుఁడు=పూజించఁబడిన, శౌనకమాని=శౌనకుఁడనుఋషి. మనోవినోద=మనస్సంతోషమును, కృత్=చేయునట్టి, సరళ=మృదువులగు. కథా=కథలయొక్క, అభిధా=చెప్పుటయందు సత్=యోగ్యమయిన, అవధాన=జాగరూకతకు, విధాతను=చేయునట్టి, లేదా జాగరూకతయందుబ్రహ్మయగునట్టి, సూతజున్=సూతపుత్త్రుని మనోహరము=మదినానందింపఁజేయునట్టి, అచలాత్మజాపరిణయంబున్=అచలాత్మజావివాహమును, నయంబునన్=నీతిచేత, తెల్పవే=చెప్పుమా, అనన్=అనఁగా, ఏయుపద్యముతోనన్వయము.

ఉ. సంతసమంతకొంతమది-సంధిలసూతసుతుండుబల్కెనో।
శాంతినిశాంతసద్వచన-చాతురిచేనచలాత్మజామహో।
దంతముదెల్పుమంటివది-యంబికపెండ్లియొసీతపెండ్లియో।
వింతగరెండునొక్కపరి-వెల్వడఁజెప్పెదనంచుహృష్టుఁడై॥

టీ. అంత=అంతలో, కొంతసంతసము=కొంచెముసంతోషము. మదిన్=మనస్సునందు, సంధిలన్=కూడుకొనఁగా, సూతసుతుండు=రోమహర్షణునికొడుకు, ఉగ్రశ్రవుఁడు ఓశాంతినిశాంతి=శాంతికిగృహమైనయోశౌనకుఁడా! సత్=యోగ్యమగు, వచన=వాక్యములయొక్క, చాతురిచేన్=నేర్పుచేతను, అచలాత్మజా = అచలాత్మజయొక్క మహత్=గొప్పదియగు, లేక మహా, ఉత్సవముయొక్క, ఉదంతమున్=వార్తను, తెల్పుమంటివి=చెప్పుమంటివి, అది=నీవుచెప్పుమన్నది, అంబికపెండ్లియొ=పార్వతివివాహమో? సీతపెండ్లియో=జానకీవివాహమో? వింతగా=ఆశ్చర్యముగా, రెండున్=రెండుకథలును ఒక్కపరి=ఒక్కపర్యాయము, వెల్వడన్=బయలుదేరునట్లుగా, చెప్పెదన్=చెప్పెదను, అంచు=అనుచు, హృష్టుఁడై=సంతోషించినవాఁడై, పల్కెన్=చెప్పెను

క. అనుగతసదర్థపరమహి।
మనగరిసకలభవనాగ్ర-మహితగజౌఘం।
బునఁదనరుసదాగతికృత।
ఘనసంగతిమిథిలయనఁగ-గరిమాస్పదమై॥ ౧౫॥

పార్వతీపరము— అనుగతసదర్థపరమ- అనుగత=అనుసరించిన, సత్=యోగ్యమగు. అర్థ=వస్తువులచేతను, పరమ=ఉత్కృష్టమయినదియగు, హిమనగరి=హిమవత్పురము, సకలభవనాగ్రమహితగజౌఘంబునన్- సకలభ=ఏనుఁగుపిల్లలతోఁగూడిన, వనాగ్ర=వనాగ్రములయందు, మహిత=పూజ్యములైన, గజ=ఏనుఁగులయొక్క, ఓఘంబునన్=సమూహముచేతను, సదా

గతి...మిథిల. సదాగతి = వాయువుచేతను, కృత = చేయఁబడిన, ఘన = మేఘములయొక్క, సంగతి = కలయికయొక్క, మిధి = మథనమును, ల = పొందినది, అనఁగన్ = అనవల్లుగా (అనఁగా ఏనుఁగులుండఁగా నీమేఘములేలయని గాలి మేఘముల నెగరఁగొట్టినదనుట) గరిమ = గొప్పతనమునకు, [అనఁగా నౌన్నత్యమునకు] ఆస్పదమై = స్థానమై, తనరున్ = ఒప్పును.

సీతాపరము — అనుగత...మహిమ అనుగతసదర్థ=అనుసరించిన మంచివస్తువులచే, పర=ఉత్కృష్టమయిన, మహిమ=సామర్థ్యముగల, సదాగతి ..సంగతి సత్=యోగ్యులయొక్క, ఆగతి=వచ్చుటచేతను, కృత=చేయబడిన, ఘన=గొప్పవారియొక్క, సంగతి=కలయికగల, మిథిలయనఁగన్=మిథిలయను పేరుగల, నగరి=పట్టణము, గరిమ=గౌరవమునకు, ఆస్పదమై=స్థానమై, సకల ..ఓఘంబునన్. సకల=సమస్తము లయిన, భవన=గృహములయొక్క, అగ్ర=ఎదుటను, మహిత=పూజ్యములయిన, గజ=ఏనుఁగులయొక్క ఓఘంబునన్=సమూహముచేత, తనరున్ = ఒప్పును.

సీ. పంకిలగ్నతలేని-పద్మినుల్ప్రియులైన,
ఠాంగీకృతినిఁ జేయ-నట్టిసతులు।
మధుపానమత్తరూ-పధృతినందనికొమ్మ,
లమలినత్వమువని-పగుసురమలు।
లకృతపల్లవరాగ-లగులతకూనలు,
ద్విస్వభావతలేక-వెలయుకన్య।
లినునితేజముగ్రుంగ-నీయనియనసూయ,
లేకళంకినిగూడ-కెనయుచామ।
గీ. లెంచవిటపాలిసంగతి-యించుకయిన।
లేనికలకంఠులుసురాగ-మానుషక్తి।

భావమున లేని భామల-ప్పట్టణమున।
శీలవతులుందురుగుణాను-కూలమతులు॥ ౧౬॥

టీ. అప్పట్టణమునన్ = ఆపురమునందు, శీలవతులు = యోగ్యస్వభావము గలిగినట్టియు, గుణానుకూలమతులు = గుణమునకు ననుకూలమగు బుద్ధికలవారును, అగు, ఇది యిందువచ్చు పద్మినుల్ మొదలగు నన్నిశబ్దములకు విశేషణము- పంకలగ్నత లేని = పాపముయొక్క తగులుట లేని, పద్మినుల్ = పద్మినీజాతిస్త్రీలు, పద్మినుల్ = పద్మలతలైతే, పంకలగ్నత = బురదయొక్క తగులుటకలవి, ప్రియునిన్ = పెనిమిటిని, అర్ధాంగీకృతునిన్ = సగమంగీకరించఁబడ్డవానినిగా, చేయునట్టి = చేయుని, సతులు = పతివ్రతలు- సతి = సతీదేవియొక్క యవతారాంతరమగు పార్వతి-ప్రియుని, అర్ధాంగీకృతునిన్ = సగముశరీరము గలవానినిఁగాఁ జేయఁబడ్డవానినిఁ జేసెను- మధుపానధృతిన్ = మధుపాన = మద్యపానముచేతను, మత్త = మదించిన, రూప = స్వరూపముయొక్క, ధృతిన్ = ధరించుటను, అందని = పొందనట్టి, కొమ్మలు = స్త్రీలు. కొమ్మలు = వృక్షశాఖలయితే, మధుపానధృతిన్-మధుప = తుమ్మెదలచేతను- ఆనమత్ = వంగుచున్న, తరు = వృక్షములచేతనయిన, ఉపధృతిన్ = ధరించుటనుబొందినవి- అమలినత్వమునన్ = మాలిన్యములేకపోవుటచేత, ఇంపగు = ఆహ్లాదకరులగు, సు = యోగ్యలయిన, రమణులు = స్త్రీలు, సురమణులు = ఇంద్రనీలములయితే, మలినత్వము = నలుపును పొందినవి- అకృత = చేయఁబడని, పల్లవ = విటులయందలి, రాగలు = అనురక్తికలవారు. అగు = అయిన, లతకూనలు = స్త్రీలు, లతకూనలు = చిన్నతీవలయితే, కృతపల్లవరాగలు = చేయఁబడిన చివుళ్లయొక్క యెఱుపుగలవి, ద్విస్వభావత = యోగ్యాయోగ్యస్వభావముగలుగుట, లేక వెలయు = లేకయొప్పుచున్న, కన్యలు = స్త్రీలు, కన్య = కన్యారాసియైతే, ద్విస్వభావతన్ = చరస్థిరస్వభావముగలుగుటచేత నొప్పును, ఇనుని తేజమున్ = పెనిమిటియొక్క తేజస్సును, గ్రసింగనీయని = తగ్గనీయనట్టి, అనసూయలు = కోపములేనివారలు, అనసూయ = అత్రిమహాముని భార్యయైతే, ఇనునిన్ = సూర్యునియొక్క, తేజము = కాంతిని, గ్రసింగఁ జేసినది = సూర్యోదయము

కాకుండఁ జేసినదనుట, ఏకలంకినిన్=ఎట్టిమాలిన్యముగలవానిని, కూడక=
కలియక, ఎనయు=ప్రసిద్ధిబొందిన. చామలు=స్త్రీలు, చామ=ఇదిశ్యామాశ
బ్దతద్భవము. శ్యామాశబ్దమువలెనే, రాత్రియర్థముకలది. రాత్రియైతే, కళం
కిని=కళంకముగలచంద్రునిఁగూడినది. ఎంచన్=విచారించఁగా. విట=విటు
లయొక్క, పాళిపఙ్క్తియొక్క, సంగతి=కలయిక, యించుకయునన్=కొం
చెమయినను, లేని=లేనట్టి, కలకంఠులు=అవ్యక్తమధురధ్వనిగలకంఠముగల
స్త్రీలు, కలకంఠులు=ఆడుకోయిలలయితే, విటపాళిసంగతి, విటప=చెట్టు
కొమ్మలయొక్క, ఆళి=పఙ్క్తియొక్క, సంగతి=స్నేహముకలపి, సురాగమా
నుషక్తి సురా=మద్యముయొక్క, అగమ=రప్పించుటయొక్క, అను
షక్తి=సంబంధము, భావమునన్=మనస్సునందు, లేని=లేనట్టి, భామలు=స్త్రీ
లు, భామ=సత్యభామయైతే, సురాగమానుషక్తి సురాగము=పారిజాతవృ
క్షమందు, అనుషక్తి=ఆసక్తికలది, ఇట్టివారు, ఉందురు=ఉంచున్నారు

శా. భవ్యార్థాగమమంత్రతంత్రవిధులన్-భావంబుదీపింపఁగా|
స్తవ్యశ్రీకరహోమయాగమహితచ్ఛందస్స్ఫురద్వృత్తితోన్|
నవ్యాజోన్నతతై సదధ్వరహిత-వ్యాపారముల్మీఱవా|
స్తవ్యాళ్వారసతుల్పురింబొలుతురెం-చన్ యజ్ఞపత్నుల్బలెన్

టీ. భవ్యా..విధులన్ భవ్య=మంగళములైన, అర్థ=అర్థములుగల,
ఆగమ=శాస్త్రములయందలి, మంత్ర=మంత్రములయొక్కయు, తంత్ర=
క్రియలయొక్కయు, విధులన్=చేయుడములచేత- అనిపత్నీపరము, భవ్య=
కాఁబోవునట్టి, అర్థ=ధనముయొక్క. ఆగమ=రావడముయొక్క, మంత్ర=
ఆలోచనలయొక్కయు, తంత్ర=పనులయొక్కయు, విధులన్=చేయుడము
లచేత- అనివేశ్యాపరము, భావంబు=అభిప్రాయము- పత్నీ-శృంగారభా
వము- వేశ్య, దీపింపఁగా=ప్రకాశింపఁగా, స్తవ్య...వృత్తితోన్, స్తవ్య=
స్తోత్రము చేయఁదగిన, శ్రీకర=ఐశ్వర్యమునుజేయునట్టి, హోమ=హోమములు
గల, యాగ=యజ్ఞములయందు, మహిత=పూజితములను, ఛందః=వేదముల

యొక్క, స్ఫురత్=ప్రకాశించుచున్న, వృత్తితోన్=ప్రవర్తనముతో-పత్నీ
పరము, స్తవ్య=స్తోత్రము-చేయఁదగిన, శ్రీక=శోభగల, రహోమయ=రహ
స్యప్రచురమయిన, ఆగమ=శాస్త్రములకు- మన్మథశాస్త్రములకనియర్థము,
హిత=ఇష్టమగు, ఛంద=అభిప్రాయముచేత, స్ఫురత్=ప్రకాశించుచున్న,
వృత్తితోన్=వ్యాపారముతో-వేశ్యాపరము, అవ్యాజోన్నతలై, అవి=గొ
ఱ్ఱెలచేతను, అజ=మేకలసమూహముచేతను, ఉన్నతలు=ఔన్నత్యముకల
వారు-వపాహోమమునకై గొఱ్ఱెలను మేకలను యజ్ఞముచేయువారికి నుండ
వలెను- పత్నీపరము, అవ్యాజ=కపటములేనివారై, ఉన్నతలు=గౌరవము
కలవారు-వేశ్యాపరము, అయి=అయి-సదధ్వ...వ్యాపారముల్. సత్=
యోగ్యమయిన. అధ్వర=యజ్ఞములకు, హిత=ఇష్టములగు, వ్యాపారముల్=
పనులు-పత్నీ. సత్=యోగ్యమగు, అధ్వ=మార్గముతోడ, రహిత=శూన్య
ములగు, వ్యాపారముల్=పనులు-వేశ్యా, మీఱన్=అతిశయించఁగా, ఎం
చన్=ఆలోచింపఁగా, యజ్ఞపత్నుల్ బలెన్=యజ్ఞములుచేయుసోమిదేవుల
వలె, వాస్తవ్యల్=నివసించియున్న, వారసతుల్=వేశ్యాస్త్రీలు, పురిన్=
పట్టణమందు, పొలుతురు=ఒప్పుదురు

సీ. జడజారికలతోడఁ-గడువేడుకలనుండు,
ప్రమథవల్లభునివై-రాగ్యమెంత।
వెలిద్విజులెక్కు-రిం-తలుసల్పఁదగునట్టి,
జలజసంభవునియా-చారమెంత।
తలవాంచికొనినాలు-కలుతోట్రుపడనిల్చు,
సురగధూర్వహునివా-క్ప్రౌఢియెంత।
పగలెపుష్పిణియైన-పద్మినిఁగలసిభా,
సిలుహేళికర్మసా-క్షిత్వమెంత।

గీ. దక్షిణాశయొకప్పుడు-దరుగనట్టి|
కుంభసంభవుగాంభీర్య-గుణమ దెంత|
యనుచుఁదమయోగ్యగుణములె-జనులుబొగడఁ|
బాలుతురపట్టణంబున-భూమిసురులు|| ౧౫||

టీ. జడజారికలతోడన్—జడ=మందబుద్ధిగల. జారికలతోడన్=జారస్త్రీలతోడ అనియర్థము జడజారి లడలకభేదమువలన, జలజారి=చంద్రునియొక్క, కలతోడన్=పదియాఱవభాగముతోడనని యర్థాంతరము, కడువేడుకలన్=మిక్కిలి యానందములచేత, ఉండు=ఉండునట్టి ప్రమథవల్లభుని=శివునియొక్క, వైరాగ్యము=విరాగత్వము. ఎంత=ఎంతటిది, వెలిద్విజులు=వెలిబెట్టఁబడిన బ్రాహ్మణులు, ఎక్కిరింతలు=ఆక్షేపణములు, అనియర్థము. వెలిద్విజులు=తెల్లపిట్టలు, హంసలనియర్థము ఈయర్థమున ద్విజులని శ్లేషగావునఁ బ్రయోగించెంగాని యైనను సమ్మతముగాదు ద్విజములనియుండనొప్పు ఎక్కిరింతలు=వాహనములు, సల్పన్=చేయఁగానని యర్థాంతరము. తగునట్టి = తగినవాఁడయినట్టి, జలజసంభవుని=బ్రహ్మయొక్క, ఆచారము=మంచినడవడి, ఎంత=ఎంతటిది, తలవాంచు=తలవంచికొని, వాలుకలుతోట్రుపడన్=జిహ్వలుకొణుగుబోగా, అనియర్థము. పడగయెత్తునపుడు తలవంచికొనుటయు, రెండునాలుకలగుటచే వాలుకలు తొట్రుపడుటయు పాములకు స్వభావమని యర్థాంతరము. నిల్చు=ఉండునట్టి, ఉరగధూర్వహుని=శేషునియొక్క, వాక్ప్రౌఢి=మాటలనేర్పు, ఎంత=ఎంతటిది, పుష్పిణియైన=ఋతుమతియైన, పద్మినిన్=పద్మినీజాతిస్త్రీని, పగలె=పగటియందే, కలసి=సంయోగముచేసి, అనియర్థము పగలె=పగటియందే. పుష్పిణి=పువ్వులుగలది, ఐన=అయినట్టి. పద్మినిన్=పద్మలతను, కలసి=కూడుకొని, భాసిలు=ప్రకాశించునట్టి, హేళి=సూర్యునియొక్క, కర్మసాక్షిత్వము=యజ్ఞములయందలి యుపద్రష్టృత్వము అని యర్థము, పనులనుజూచుటయని యర్థాంతరము. ఎంత=ఎంతటిది, దక్షిణాశ— దక్షిణ=యజమా

నుండి స్వచ్ఛద్రవ్యమందు, ఆశ=కోరిక, అనియరము. దక్షిణదిక్కునియొరాంతరము ఒకప్పుడున్=ఒకసమయమందును, తగవట్టి=తగ్గనట్టి, కుంభసంభవు=అగస్త్యునియొక్క, అగస్త్యుఁడు దక్షిణదిక్కుననుండునని ప్రసిద్ధి గాంభీర్యగుణము=లోతుగుండెకలుగుటయనుగుణము, అదెంత=అదెంతటిది, అనుచు. తమయోగ్యగుణములెంతయుమంచిగుణములె. జనులు=మనుష్యులు, పొగడన్=స్తోత్రముచేయఁగా, భూమిసురులు=బ్రాహ్మణులు, ఆపట్టణంబునన్=ఆవీటియందు, పొలుతురు=ఒప్పుదురు.

శా. పారావారతరంగరంగనటన-ప్రారంభసంభావిత।
స్ఫారోదారసుధారసగ్రసనసం-పజ్జన్యచైతన్యసం।
భారోద్బంధురమంధరక్షితిధర-ప్రత్యగ్రడింభంబులో।
నా రాజిల్లుగజంబులప్పురములో-నశ్యచ్ఛశాంకచ్ఛవిన్ ॥ ౧౯ ॥

టీ. పారావార=సముద్రముయొక్క, తరంగ=తరంగములనెడు. రంగ=రంగస్థలమందు, నటన=నాట్యముయొక్క, తిరగడముయొక్క యనియర్థము, ప్రారంభ=ఆరంభమందు, సంభావిత=పుట్టుచున్న, స్ఫార=అతిశయించిన, ఉదార=విస్తారమగు, సుధారస=అమృతరసముయొక్క, గ్రసన=తినుటయొక్క, సంపత్=విస్తారముచేతను, జన్య=పుట్టిన, చైతన్య=ప్రాణముయొక్క, సంభార=భరించుటచేతను, ఉద్బంధుర=అతిశయములగు, మంధరక్షితిధర=కవ్వపుగొండయొక్క, ప్రత్యగ్ర=నూతనములైన, డింభంబులోనాన్=పిల్లలైపోయినట్లుగా, గజంబులు=ఏనుఁగులు, నశ్యత్=క్షీణించుచున్న, శశాంక=చంద్రునియొక్క, ఛవిన్=కాంతిచేతను, ఆప్పురములోన్=ఆపట్టణములో, రాజిల్లును=ప్రకాశించును. క్షీణచంద్రుఁడు నిష్కళంకుఁడుగావున స్వచ్ఛుఁడుగానుండునని మున్నచెప్పఁబడినది. ఆపట్టణములోనివి తెల్లయేనుఁగులని తాత్పర్యము.

సీ. జాబిల్లిచిన్నంపు-జాబాహుమారంపు,
సరదారునియుదార-తరజఠంబు।

శశకోటిధరుపీటి-కతిధాటిజనిసుధా,
ఘుమ్ముఁదెచ్చినమేటి-ఘనజవంబు।
వలిజక్క-వలకించు-విలుకానియనిసంచు,
దెలుపువేల్పుతురంగ-ములజవంబుఁ।
బవరంబుభువివింటిఁ-దవిలించివిడువనం,
టియరాతిఁద్రుంచుక-ట్టియజవంబు।
గీ. నెంచకనెసంచరించుచు-నింద్రహయము।
పుట్టినట్టితలంబెల్ల-భూరిధూళిఁ।
దార్చనోనాఖురమ్ముల-ధరణిఁద్రవ్వి।
కొనుచువిలసిల్లునప్పరీ-ఘోటకములు॥ ౨౦॥

టీ. జాబిల్లి=చంద్రునియొక్క, చిన్నంపు=చిహ్నమయిన లేడియవెడి, బాబా=గుఱ్ఱమును, హుమారంపు=సవారగునట్టి, సరదారుని=రౌతుయొక్క, వాయువుయొక్కయనియర్థము, ఉదారతర=మిక్కిలిగొప్పదియగు, జవంబు=వేగమును, వలి=సంద్రడనయిన, జక్కవలకున్=చక్రవాకపక్షులకు, ఇంచువిలుకాని=మన్మథునియొక్క, అని=యుద్ధముయొక్క, సంచు=అందమును, తెలుపు=తెలియఁజేయునట్టి, వేల్పు=దేవతయొక్క, సూర్యునియొక్కయనియర్థము. తురంగముల=గుఱ్ఱములయొక్క. జవంబున్=వేగమును, బవరంపుభువిన్=యుద్ధభూమియందు, వింటిన్=ధనస్సును, తవిలించి=సంధానముచేసి, విడువన్=వడలగా, అంటి=తగులుకొని- ఆరాతిన్=శత్రువును-త్రుంచు=చంపునట్టి- కట్టియ=బాణముయొక్క, జవంబున్=వేగమును. ఎంచకనె=లక్ష్యపెట్టకుండఁగనె- సంచరించుచున్=తిరుగుచు, ఇంద్రహయము=ఉచ్చైశ్శ్రవము- పుట్టినట్టి=జన్మించినట్టి, తలంబెల్లన్=సలమంతయు, సముద్రమునియర్థము భూరి=విస్తారమగు, ధూళిన్=దుమ్ముచేత, తార్చనోనాన్=సంధానముచేయుటకేమో యనునట్లుగా కప్పుటకేమోయని యర్థము. ఖుర

మ్ములన్ = గొరిజలచేత - ధరణిన్ = భూమిని - తవ్వికొనుచున్ = బ్రద్దలంగొట్టుచు,
ఆప్పురీఘోటకములు = ఆపట్టణములోని గుఱ్ఱములు - విలసిల్లున్ = ప్రకా
శించును

చ. సరసపదక్రమమ్ములుబొ-సంగెడిసాంగతురంగపుంగవో
త్కరములుపద్మరాగములు-దారకళందగుపుష్యరాగముల్
బరగునవక్రచక్రములు-పాటిలియున్నపురీరథాళికిం
గురథముతున్కలై నవతఁ-గ్రుంకినసాటియనంగఁజెల్లునే॥

టీ. శివుఁడు త్రిపురసంహారము సేయునప్పుడు భూమి రథము వేదము
లు గుఱ్ఱములు, సూర్యచంద్రులు చక్రములునైనవి. ఆయర్థమునే యీపద్య
మందు వివరించుచున్నాఁడు. సరసపదక్రమమ్ములు, సరస=సారస్యముగల,
పదక్రమమ్ములు=పాదవిన్యాసములు, అనియర్థము. సరస=రసముతోఁగూడి
న, పద=పదచ్ఛేదములును, క్రమమ్ములు=క్రమపాఠములును, అనియర్థాంతర
ము. పొసంగెడి= ఒప్పునట్టి, సాంగ=సంపూర్ణావయవములుగల, తురంగ
పుంగవ = అశ్వశ్రేష్ఠములయొక్క, ఉత్కరములు = సమూహములు, అని
యర్థము సాంగ = శిక్షాదిషడంగములతోఁగూడిన, తురంగపుంగవోత్కర
ములు = ముందుభూరథమును జెప్పఁబోవుచున్నాఁడుగావున నిచట వేదము
లనియర్థము. పద్మరాగములు = పద్మరాగమాణిక్యములు, ఉదార = విస్తార
మయిన, కళన్ = శోభచేతను, తగు= ఒప్పుచున్నది. పుష్యరాగముల్ = పు
ష్యరాగమాణిక్యములును, పరగు= ఒప్పునట్టి, అవక్ర= వంకరలేని. చక్రములు=
రథాంగములని యర్థము, పద్మరాగము = పద్మములయందను రాగములు,
దారకళన్=భార్యావిలాసముచేతను, తగు=ఒప్పునట్టి, పుష్య=పుష్య
మీనక్షత్రమందయిన, రాగముల్=అనురాగములు, పరగు=ఒప్పునట్టి, ఈ
రెండు విశేషణములును సూర్యచంద్రులను దెలుపుచున్నవి. అట్టి, అవక్ర
చక్రములని అర్థాంతరము, పాటిలి=అనుకూలించియున్నట్టి, పురీ=పట్టణ
మందలి, రథ=రథములయొక్క, ఆళికిన్=పఙ్క్తికి, కురథము=భూమియనెడి

రథము. అనియుద్ధము. కుత్సితమగురథమనియర్థాంతరము ఇచట "రథపద యోశ్చ" అనుసూత్రముచేత, కదాదేశము రావలసియున్నను, శ్లేషసలముగా వున వదలెనుగాని యనుచితముగాదు కుపక్కైలైన=ముక్కైలైనవతఁలతో మ్మి దియగుటచేత. కుంగినఁ=అణఁగిపోతే, అనఁగాభూమి నవఖండములైన ముద్రముననమునిఁగిపోవుచున్నదని తాత్పర్యము పాటియగంగఁ=సమాన మనుటకు చెల్లునేఁతగునా.

ఉ. భల్లవిజేల్లనంబుకర-పల్లవపాళినిమల్లివల్లరీ।
వేల్లనతుల్యమైయనులఁ బెల్లుగనెల్లెడనుల్లసిల్లుచున్।
క్షుల్లకభూమివల్లభుల కోటులకున్శతకోటికోటులై।
యుల్లసిలన్సమీకపటు-లొప్పునరప్పురినుద్భటుల్ భటుల్॥

టీక భల్లవిజేల్లనంబు=బల్లెముయొక్క త్రిప్పుటము, కరపల్లవ=చిగురువంటి హస్తముయొక్క పాళిన్=ప్రదేశమందు, మల్లివల్లరీ=మల్లిపూవుల గుత్తియొక్క, వేల్లన=త్రిప్పుటతోడ, తుల్యమై=సమానమై, బల్లెమును పువ్వువలె, తేలికగాద్రిప్పుచుండిరని తాత్పర్యము, అనులన్=యుద్ధములయందు, పెల్లుగన్=విస్తారముగా, ఎల్లెడన్=అన్నిచోటుల, ఉల్లసిల్లుచున్=ప్రకాశించుచు, క్షుల్లక=అల్పులయిన, భూమివల్లభుల=రాజులయొక్క, కోటులకున్=కోట్లకు, శతకోటి=వజ్రాయుధములయొక్క, కోటులై=కోటిసంఖ్యలై, ఉల్లసిలన్=ప్రకాశించఁగా, వీరుత్రిప్పుబల్లెము రాజులకు కోటివజ్రాయుధములవలెఁ గాన్పించుచున్నదనితాత్పర్యము. సమీక=యుద్ధములయందు, పటులు=సమర్థులగు, ఉద్భటుల్=గర్విష్ఠులగు, భటుల్=యోధులు, అప్పురిన్=అపట్టణమందు, ఒప్పుచురు ప్రకాశింతురు.

సీ. పాదలపైఁబొదలుతు మ్మెదలసమ్మదలన
న్మదులశానములసం పదలనలరి।

గిరులపై వరలుపెం-దరులనిర్ఝరులతుం,
పురులచల్వలపరం-పరలనరసి।
యతులపుష్పితలస-ల్లతలసంతతులసం,
గతులనుబ్బుసుగంధ-తతులనెనసి।
తావలకై దువులనన్నువలమేల్చవులకై,
రవులకొల్పఁగమన్మ-థువలపించి।

గీ. చటులపాటీరకోటర-నటనఘటన।
కనదహీవధూటికాపీటి-కానికాయ।
సౌరభాసారములమీఱు మారుతములు।
దనరుసతతంబునారాజ-ధానియందు॥ ౨౩॥

టీ. పొదలపైన్=పూఁదుప్పలపైని, పొదలు=వృద్ధిఁబొందునట్టి, తుమ్మెదల=తేఁటులయొక్క, సమ్మద=సంతోషముచేతను, లసత్=ప్రకాశించుచున్న, మృదుల=మృదువులగు, గానముల=పాటలయొక్క, సంపదలన్=విశేషములచేతను, అలరి=సంతోషించి, గిరులపైన్=పర్వతములమీఁద, వరలు=ప్రకాశించుచున్న, పెందరుల=పెద్దగుహలయందలి, నిర్ఝరుల=ప్రవాహములయొక్క, తుంపురుల=బిందువులయొక్క, చల్వల=శైత్యములయొక్క, పరంపరలన్=పఙ్క్తులను, అరసి=చూచి, అతుల=సామ్యములేనట్టియు, పుష్పిత=పూచినట్టియు, లసత్=ప్రకాశించుచున్న, లతల=తీవలయొక్క, సంతతుల=సమూహములయొక్క, సంగతులన్=కలయికలచేతను, ఉబ్బు=అతిశయించుచున్న, సుగంధ=మంచివాసనలయొక్క, తతులన్=సమూహములను, ఎనసి=పొంది, తావల=కలువలనెడు, కైదువులన్=శస్త్రములను, అన్నువల=చిన్నచిన్నవియగు, మేల్=మంచివియగు, చవులకై=రుచులకై, రవులుకొల్పఁగన్=ప్రజ్వలింపఁజేయుటకు, మన్మథున్=మరుని, వలపించి=ప్రీతిగలవానిఁగాఁజేసి, చటుల=చంచలములగు, పాటీర=మంచిగంధపుచెట్లయొక్క, కోటర=తొ

ములయందు, నటన=నాట్యముయొక్క, ఘటన=కలయికచేతను. కనత్=ప్రకాశించుచున్న, అహివధూటికా=నాగకన్యకలయొక్క, వీటికా=తాంబూలములయొక్క, నికాయ=సమూహముయొక్క, సౌరభ=పరిమళములయొక్క, ఆసారములన్=ధారావర్షములచేతను, విస్తారములచేతననియర్థము నాగకన్యకలు వాయువును తినువరంబటచే వానినోళ్ళయందలి తాంబూలపు పరిమళము వాయువునకంటినదని తాత్పర్యము. మీఱు=అతిశయించునట్టి, మారుతములు=వాయువులు, ఆరాజధానియందున్=ఆపట్టణమందు, సంతతంబున్=ఎల్లప్పుడును, తనరు=ఒప్పును.

లయగ్రాహి.

బంగరుల రంగలరు-ముంగిటి యరుంగులకు,
రంగటనభంగురప-తంగమణిమాలా।
సంగతినభంగమయి-పొంగుచు వెలుంగుమడు,
లంగళ నెసంగునవ-లుంగలవలీనా।
రంగముల శృంగముల-నంగులు కురంగముల,
కుంగోలనిచెంగలువ-లంగలసుగంధా।
సంగమున తుంగిరిగొ-ముంగొమరు భృంగములు,
మంగళమృదంగముల-భంగిఁబురినొప్పున్॥

టీ. బంగరుల=బంగారములయొక్క, రంగు=కాంతి, అలరు=ఒప్పునట్టి ముంగిటి=ప్రాంగణమందలి, అరుంగుల=అరుగులయొక్క, కురంగటన్=సమీపమందు, అభంగుర=విరిగిపోనట్టి, పతంగమణి=సూర్యకాంతమాణిక్యములయొక్క, మాలా=పంక్తులయొక్క, సంగతిన్=కలయికచేత, అభంగమయి=చెడిపోనిదై, పొంగుచున్=అతిశయించుచు, వెలుంగు=ప్రకాశించునట్టి, మడులన్=పాదులయందు, కళన్=శోభచేత, ఎసంగు=ఒప్పునట్టి, నవ=క్రొత్తవియగు, లుంగ=పుల్లమాదీఫలపు చెట్లయొక్కయు, లవలీ=ల

శాఖివిశేషములయొక్కయు, నారంగముల=నారింజచెట్లయొక్కయు. శృంగములకున్=శిఖరములనువ్యాప్తిగ, కులుకు=శోభించుచున్న, రంగములకున్=ప్రదేశములకును, కొలఁకుల=సరస్సులయొక్క, చెంగలువలన్=ఎఱ్ఱకలువలయందు, కల=కల్గినట్టి, సుగంధ=మంచిపరిమళముయొక్క, ఆసంగమునకున్=సంబంధమునకు, గిరికొను=మిట్టువాఱుకొనుచున్న, కొనుదు=లేఁతనగు భృంగములనఁగ=తుమ్మెదలు, మంగళ=శుభనిమిత్తములగు, మృదంగములభంగిన్=మద్దెళ్లవలె, పురిన్=పట్టణమందు, ఒప్పున్=ప్రకాశించును.

క. ప్రతినియతిగుప్తిమదనవ।
రతసమరహితాధికామ-రమణీవరణో।
ద్యతసిద్ధకేతనములన్।
క్షితినప్పురియొప్పుఁగలశ-శిఖరద్యుతులన్॥

పా॥ ప్రతి......నములన్, ప్రతినియతి=ప్రత్యేకనియమము చేతను, గుప్తి=రహస్యమందు, మద=మదము చేతను, నవ=నూతనములగు, రత=సంభోగములయందు, సమరహిత=సామ్యములేని, అధికామ=పొందఁబడిన కామముగల, రమణీ=స్త్రీలయొక్క, వరణ=వరించుటయందు, ఉద్యత=ప్రయత్నించుచున్న, సిద్ధ=దేవయోనివిశేషులయొక్క, కేతనములన్=గృహముల చేతను, కలశశిఖరద్యుతులన్, కల=ఉన్నట్టి అనఁగా వ్యాపించునట్టి [ఇది తెలుఁగుశబ్దముగావున మిశ్రసమాసము] శశి=చంద్రుని చేతనున్న, ఖరద్యుతులన్=సూర్యుని చేతనున్ను, క్షితిన్=భూమియందు, అప్పురి=ఆయోషధిప్రస్థపురము, ఒప్పున్=ప్రకాశించును.

సి. ప్రతి...నములన్, ప్రతినియత=ప్రత్యేకపు యేర్పాటులుఁగల, గుప్తిమత్=కావలిగల, అనవరత=ఎల్లప్పుడు, సమర=యుద్ధమునకు, హిత=అనుకూలమైనట్టియు, అధిక=పొడవయినట్టియు, అమరమణీ=ఇంద్రనీలమాణిక్యములతోఁ గూడిన, వరణ=ప్రాకారమందు, ఉద్యత=మీఁదుగా యెత్తఁబడినవై, సిద్ధ=సిద్ధములైయుండు, కేతనములన్=జెండాలచేతను. కల

శిఖరద్యుతులన్, కలశ = గోపురములయందుంచెడు కుంభములతోఁ గూడిన.
శిఖర = శిఖరములయొక్క, ద్యుతులన్ = కాంతులచేత తిరస్కరించుచున్నది.

సీ. కొనగోరెదనునాటి-కుసుమమియ్యవె బోటి,
యౌవనంబునను-గోరంట లేదు।
కొమ్మ పల్లవపాళి-నమ్మ వేలనె కాంచ,
నమ్ములో సంగతి-నమ్మరాదు।
సుదతి యిచ్చెదు గుత్తు-లౌదవు మిానీవి నీ
కిచ్చెద నెపుడైన-నిపుడు నిలువు,
బాలనీవలనరసాల సత్త్వము గంటి,
మావి హారములందు-మనసుగలదె।
గీ. యనుచుఁ దమతమతముఁ దెల్పి కొనుచువచ్చు।
విటులనిటులలితోక్తి సం-ఘటనపటిమ।
నాదరింపుచుఁ గులుకు-టొయ్యారములను।
బాలుతులమ్ముగారఁగ ళ్ళుఁబువ్వులచట॥

టీ. ఈపద్యమునందు శ్లేషభంగిచే పువ్వులమ్ము స్త్రీలకును విటగాండ్రకును నుక్తిప్రత్యుక్తులు. పురుషుడు బోటీ = ఓచిన్నదానా, కొనగోరెదను = కొనటకు వేడుకగలవాఁడనైయుంటిని, నాఁటికసుమము = ఆరోజుఁ జూచిన పువ్వు, ఇయ్య వే = ఇమ్ము అనియర్థము, కొనగోరు = గోరుచివర, ఎదను = హృదయమందు, నాటి = గ్రుచ్చి అనియర్థాంతరము, స్త్రీ యౌవన = బాగుగనున్నది, వనంబునన్ - పువ్వులతోటయందు, గోరంట = గోరంటచెట్టు, లేదు = లేదు, అనియర్థము, యౌవనంబునన్ = జవ్వనముచేత, గోరు = నఖము అంటలేదు = గ్రుచ్చుకోలేదు అనియర్థాంతరము, పు. కొమ్మ = ఓచిన్నదానా లేత కొమ్మ = శాఖయొక్క, పల్లవ = చిగుళ్ళ యొక్క, పాళిన్ = వరుసను, అమ్మ

వెలవే=ఎందుకుచేత విక్రయించవే అనియర్థము. కొమ్మ=చిన్నదానా, పల్లవ=
విటులయొక్క, పాళిన్=పజ్త్రిని, నమ్మవెలదే=ఎందులకువిశ్వసింపవేయని యు
ర్థాంతరము స్త్రీ- కాంచనమ్ములు=సంపగిపువ్వులు, ఒసంగక=ఇయ్యక. అమ్మ
రాదు=విక్రయించగూడదు, అనియర్థము కాంచనమ్ములు=బంగారములు,
ఒసంగక=ఇయ్యక, నమ్మరాదు=విశ్వసించగూడదు, పు సుదతి=మంచిప
లువరుసగలయో చిన్నదానా, ఇచ్చను=కోరికచేత. గుత్తులు=పువ్వుగుచ్ఛ
ములు, ఒకపుమీఁ=ఉపయోగించుమనీ అనియర్థము, ఇచ్చనుగుత్తులు=ఈ స్త
నగుచ్ఛములు అనియర్థాంతరము, స్త్రీ- నీవి=నీసంబంధమైనవి, ఎప్పుడైనన్=
ఏకాలమందైనను, నీకిచ్చెదన్=నీకొసఁగెదను, ఇపుడు=ఈవేళ, నిలువు=
అగు, అనియర్థము, నీవి=కోకముడి, నీకిచ్చెదన్ అనియర్థాంతరము, పు,
బాల=ఓచిన్నదానా, నీవలన్=నీవల్ల, రసాల=తియ్యమామిడిపండ్లయొక్క
సత్త్వమున్=స్వభావమును, కంటిన్ చూచితిని అనియర్థము, రసాలసత్త్వమున్,
రస=శృంగారరసముచేతనైన, అలసత్వమున్=మాంద్యమును, అనియర్థాంతరము
స్త్రీ, మావి=మామిడిపండ్లయొక్క, హారములందున్=భోజనములయందు, మనసు
కలదా=ఇచ్ఛయున్నదా! అనియర్థము మావిహారములందున్=మాక్రీడలయం
దు అనియర్థాంతరము, అనుచున్=ఇట్లుపలుకుచు, తమతమతమిన్=తమ
యొక్క కామమును, తెల్పికొనుచున్=ప్రకటనచేయుచు, వచ్చు=చేరునట్టి
విటులన్=విటగాండ్రను, ఇటు=ఈప్రకారము, లలితోక్తి...పటిమన్
లలిత=విలాసములుగల, ఉక్తి=పలుకులయొక్క, ఘటన=కూర్పుటయం
దు, పటిమన్=సామర్థ్యముచేత, ఆదరింపుచున్=గారవించుచు, కులు
కుటోయ్యారములను, కులుకు=శృంగారముగల, ఒయ్యారములను=విలా
సములచేత, పొలతులు=స్త్రీలు, అచటన్=ఆపట్టణమున, అంగళ్లన్=
దుకాణములయందు, పువ్వులు=పుష్పములు, అమ్ముదురు=విక్రయింతురు.

సీ. గుప్పుగుప్పునఁగప్పు-లప్పళించెడుజడల్,
నల్లమబ్బులఘాటి-నుల్లసిల్ల!

నబ్బురంబుగనుబ్బు-గబ్బిగుబ్బలగుబ్బు,
పలుహారములుధార-లలవినలర।
ముందుముందుగచిందు-లందుచందురుకావి,
పావడల్మణిచాప-భంగినమర।
ప్రత్నరత్నవిచిత్ర-బహుళమేఖలాఝులా,
త్కా-రంబులురుముల-గరిమనొప్ప।

గీ. పెల్లుగలహంసకంబులు-దల్లడిల్ల।
చంచలలుగాకధరణిపై సంచరించు।
మించులనజంచలాత్ములు-మేటిసౌధ।
కోటినొప్పుచునుందుర-వ్వీటనెపుడు॥

టీ. గుప్పగుప్పన్=తరుచుతరుచుగా, కప్పులు=వలుపులు, ఆవరించెడి=క్రమ్ముచున్నట్టి, జడల్=జటలు, మబ్బులభాతిన్=మేఘములవలె, ఉల్లసిల్లన్=ప్రకాశింపగా, అబ్బురంబుగా=ఆశ్చర్యముగా, ఉబ్బు=పొంగుచున్నట్టి, గబ్బి=పెద్దవియగు, గుబ్బల=స్తనములయందు, గుబ్బు=కదలుచుండెడు, పలు=విస్తారములగు, హారములు=ముత్తెపుసరులు, ధారలలవిన్=వర్షధారలవలె, అలరన్=ఒప్పగా, ముందుముందుగన్=యెట్టయెదురుగా, చిందులు=తూలదుములను, అందు=పొందుచున్నట్టి, చందురుకావి=తెలుపురంగుగల, పావడల్=గాగరాలు, మణిచాపభంగిన్=ఇంద్రధనుస్సువలె, అమరన్=ఒప్పగా. ప్రత్న=ప్రశస్తములయిన, రత్న=మణులచేత, విచిత్ర=చిత్రములగు, బహుళ=విస్తారములగు, మేఖలా=మొలనూళ్లయొక్క, ఝులాత్కారంబులు=ఝుల్లుమను ధ్వనులు, ఉరుములగరిమన్=గర్జితములయొక్క అతిశయముచేత, ఒప్పన్=ప్రకాశించుచుండగా పెల్లుగల=అతిశయముగల, హంసకంబులు=కాలికడియములనెడు, అంచలు- తల్లడిల్లన్=తొట్రుపడగా, చంచలలుగాక= కదలునవిగాకుండ, ధరణిపైన్=భూమిపయిని, సంచరించుచుండునట్టి, మించులనన్=మె

రుపులనునట్టుగా- చంచలాక్షులు= స్త్రీలు- అవ్వీటన్=ఆపట్టణమునందు, ఎ
ప్పుడున్=నిత్యమును- మేటి= శ్రేష్ఠమగు సౌధకోటిన్= చాలామేడలయం
దు లేక మేడచివరయందు ఒప్పుచుందురు= ప్రకాశించుచుందురు.

క. మహీభృత్పతి యేలుఁబురిన్।
మహిమోన్నతిజనకుఁడాగ-మస్థగితాంచ।
ద్బహులహరిభక్తియోగా।
వహితమహాప్రౌఢిమహిమ·వంతుఁడనంగన్॥

పా— మహిమోన్నతి జనకుఁడు- మహిమ=సామర్థ్యముయొక్క- ఉ
న్నతి = ఔన్నత్యమునకు- జనకుఁడు = పుట్టించునట్టి, హిమవంతుఁడనం
గన్ = హిమవంతుఁడనునట్టి, మహీభృత్పతి=పర్వతరాజు - అగమ... ..
ప్రౌఢిమన్- అగమ=వృక్షసమూహముచేత- సగిత=కప్పబడి, అంచత్=
ప్రకాశించుచున్న- బహుల=విస్తారములగు- లహరి= ప్రవాహములయొక్క-
భక్తి = రచనలయొక్క- యోగ = సంబంధమందు - అవహిత = జాగరూ
కమయిన-మహాత్ = గొప్పదైన- ప్రౌఢిన్ = వహించుటచేత- పురిన్ =
పట్టణమును- ఏలున్ = పరిపాలించును

పీత. మహిమోన్నతి-మహిమ=సామర్థ్యముయొక్క, ఉన్నతి=ఔన్న
త్యముగల, జనకుడు=జనకుడనే పేరుగల, మహీభృత్పతి=రాజశ్రేష్ఠుడు
అగమ...వంతుడు, అగమ=శాస్త్రములచేత, సగిత=వ్యాప్తమయి, అం
చత్=ఒప్పుచున్న. బహుల=విస్తారముగు, హరిభక్తి=విష్ణుసేవయందును, యో
గ=అష్టాంగయోగములయందును, అవహిత=జాగరూకమయిన. మహత్
గొప్పదియగు, ప్రౌఢి= నేర్పుయొక్క, మహిమవంతుడు=మహాత్మ్యముగల
వాడు, అనఁగన్=అనునట్టుగా పురినేలున్.

ఉ. చల్లనివాఁడుపాదముల-చాయలఁజేరినవెల్లవారికిన్।
గొల్లబంగాఁగనూర్మికలు-గొబ్బునహంసకకంకణంబులున్।

జల్లెడు వాఁడు వాహినుల-సంఘటనం బ్రతికూలవర్తన
క్షుల్లకభూమిభృత్కులము-గ్రుంగఁగఁ జేయునతండు మేదినిన్॥

పా॥ అతండు=ఆహిమవంతుఁడు, మేదినిన్=భూమియందు, చల్లనివాఁడు=మంచుకొండయగుటచే శైత్యముగలవాఁడు, పాదములచాయలన్-పాదముల=దగ్గఱనుండు చిన్నగుట్టలయొక్క, చాయలన్=నీడలయందు, చేరినవారికిన్=వచ్చినవారికి, కొల్లలుగాఁగన్=సమృద్ధిగా, ఊర్మికలు=నీటియలలు, హంసకకంకణంబులున్ – హంసక=చిన్నహంసలును, కంకణంబులున్=ఉదకబిందువులును, గొబ్బునన్=త్వరగా, చల్లెడువాఁడు=చిమ్మువాఁడు, వాహినులసంఘటనన్, వాహినుల=నదులయొక్క, సంఘటనన్=కూర్పుచేత, ప్రతి...కులమున్, ప్రతికూల=నీటికెదురుగా, వర్తన=ఉనికిగల, క్షుల్లక=చిన్నవియగు, భూమిభృత్=పర్వతములయొక్క, కులమున్ = సమూహమును, గ్రుంగఁగఁ జేయున్=కూలిపోవునట్లుగాఁ జేయును.

సీత. అతండు=ఆజనకుఁడు, చల్లనివాఁడు=సరసమైన యంతఃకరణముగలవాఁడు, పాదములచాయలన్=కాళ్ళసమీపములయందు. చేరినన్=సమీపించఁగా, ఎల్లవారికిన్=అందఱికి, కొల్లలుగాఁగన్=సమృద్ధిగా, ఊర్మికలు=ఉంగరములు, హంసకకంకణంబులున్, హంసక=కాలికడియములు, కంకణంబులున్=చేతికడియములును, చల్లెడివాఁడు=విస్తారముగానిచ్చువాఁడు. వాహినులసంఘటనన్, వాహినుల=సేనలయొక్క, సంఘటనన్=కూర్పుచేత, ప్రతికులమున్, ప్రతికూల=ఎదిరించెడి, వర్తన=సంచారముగల, క్షుల్లకభూమిభృత్కులమునన్=కొద్దిరాజులగుంపును, గ్రుంగఁగఁ జేయున్.

సీ. కుందమ్ములసితార-విందమ్ములమృణాళ,
బృందమ్ములనుపయ-స్స్యందములను।

రంగమ్ములసుధాత-రంగమ్ములనభస్తు-
రంగమ్ములసురసా-రంగములను।
హారమ్ములశరద్వి-హారమ్ములనుగాంగ-
పూరమ్ములఘనక-ర్పూరములను।
సూనమ్ములఁగళావి-తానమ్ములనుదుగ్ధ-
తానమ్ములసురసం-తానములను॥

గీ. సొగసుమగరాలనిగరాల-నిగనిగలను।
మిగులనలరారునెలరాల-తగువగలను।
దెగడిపొగడొందునెల్లెడ-జగతినతని।
పరమహిమహృద్యశోభాప్ర-భావగతులు॥

టీ॥ అతని=ఆహిమవంతునియొక్క, పరమ...గతులు, పరమ=ఉత్కృష్టమైన, హిమ=మంచుచేత, హృద్య=మనోహరమగు, శోభ=సొగసుయొక్క, ప్రభావ=అతిశయముయొక్క, గతులు=రీతులు, కుందమ్ములన్=మల్లెపువ్వులను, సితారవిందమ్ములన్=తెల్లతామరలను, మృణాళ=తామరతూండ్లయొక్క, బృందమ్ములన్=సమూహములను, పయస్స్యందములను, పయః=పాలయొక్క, స్యందములను=ప్రవాహములను, రంగమ్ములన్=తరగములను, సుధాతరంగమ్ములన్=అమృతపుకెరటములను, నభస్తురంగమ్ములన్=ఉచ్చైశ్శ్రవములను, సురసారంగములను=ఐరావతములను, ఇచట ఉచ్చైశ్శ్రవమును నైరావతమును నొక్కటొక్కటియైనను బహువచనములు చెప్పుటయొక్కొక్కదాని నేగాక యిట్టివియు నేకములయినను వానినిఁ హరసించఁగలదనియతిశయోక్తియనియెఱుంగవలయును హారమ్ములన్=ముత్యాలసరులను, శరద్విహారమ్ములను, శరత్=శరదృతువుయొక్క, విహారమ్ములను=విలాసములను, గాంగపూరమ్ములను, గాంగ=గంగాసంబంధులగు, పూరమ్ములను=ప్రవాహములను. ఘనకర్పూరములను, గొప్పకప్పురములను, సూనమ్ము

లన్ = మల్లి మొదలగుపూవులను, కళావితానమ్ములన్ = చంద్రకళల సమూహములను, ఉడుప్రతానమ్ములన్ = నక్షత్రసమూహములను, సురసంతానములను, సుర = దేవతలయొక్క, సంతానములను = కల్పవృక్షములను, సొగసు .నిగలను, సొగసు = చక్కనైన, మగరాలనిగరాల = శ్రేష్ఠవజ్రములయొక్క, నిగనిగలను = కాంతులను, మిగుల...వగలను, మిగులన్ = విస్తారముగా, అలరారు = ప్రకాశించుచున్న, నెలరాల = చంద్రకాంత మాణిక్యములయొక్క తగు = అనుకూలమగు, వగలను = విలాసములను, తెగడి = తిరస్కరించి, జగన్ = భూమియందు, ఎల్లెడన్ = అంతటను, పొగడొందున్ = స్తోత్రము చేయఁబడును,

సీత॥ అతని = అజనృపునియొక్క పర...గతులు, పర = శత్రువుల యొక్క, మహిమ = సామర్థ్యమును, హృత్ = హరించుచున్న, యశః = కీర్తుల యొక్క, భా = కాంతులయొక్క, ప్రభావ = సామర్థ్యముయొక్క, గతులు = రీతులు, శేషము సమానము.

క. ధరణీభృత్పతికటకం।
బరుదై తగుసంగరాజి-తాశ్వాసపదా।
తిరుచిరమై గజసంతతి।
సరసతరులకప్రమేయ-సౌఖ్యావహమై॥

టీ॥ ధరణీభృత్పతికటకంబు, ధరణీభృత్పతి = పర్వతరాజైన హిమవంతుని యొక్క, కటకంబు = తటంబు ప్రదేశము, సంగ...రుచిరమై, సంగ = సంభోగము చేతను, రాజిత = ప్రకాశించుచున్న హరియొక్క, అశ్వాసః = అలయిక తీర్పుటకయిన, పద = స్థానముల చేత, అతిరుచిరమై = మిక్కిలి మనోహరమైనదయి, గజసంతతిన్, గజ = ఏనుగులయొక్క, సంతతిన్ = సమూహము చేత, సరసతరులకున్, సరస = బలములతో కూడి, తరులకన్ = చెట్లకు, అప్రమేయ సౌఖ్యావహమై, అప్రమేయము = ఎన్నశక్యము కాని, సౌఖ్య = సుఖమునకు

ఆవహమై=కలుగఁజేయునదియై, ఏనుఁగులు చెట్లను విరచి వేయుట లేదనుట. అరుదైతగున్=ఆశ్చర్యమయి యొప్పును,

సీ॥ ధరణీభృత్పతికటకంబు, ధరణీభృత్పతి=రాజశ్రేష్ఠుఁడయిన జనకునియొక్క, కటకంబు=పట్టణంబు, సంగ...రుచిరమై, సంగర=యుద్ధమందు, అజిత=జయింపఁబడని, అశ్వ=గుఱ్ఱములచేతను, అస=రథములచేతను అసఉపవేశనే అనుధాతువుపయి నధికరణార్థమునందు ఘఞ్చేసి దీనియందు కూర్చుందురు అనియర్థము చేయఁగా రథమనియర్థము చెప్పవచ్చును పదాతి=కాల్బలము చేత. రుచిరమై=మనోహరమైనదై, గజసంతతి=ఏనుఁగులయొక్క సమూహము చేత, సరసతరులకున్=మిక్కిలి రసవంతులకు ఐశ్వర్యముకలవారికియని యర్థము. శేషము సమానము.

చ॥ ధవళతనూర్ధ్వపుండ్రములు-దారమహాదరచక్రముద్రసా
ర్జవభుజగాహితప్రథిమ-సత్తులసీవనమాలికల్ సదా
ప్రవిలసితంబుగాఁబృథుల-పన్నగరామలకీరముల్ స్వవై
భవములనింపుఁదెల్పునతి-భాగ్యములందగునాతఁడెప్పుడున్॥

పా॥ ధవళతన్=తెలుపుచేత, ఊర్ధ్వపుండ్రములు=పైనుండు తెల్లతామరలు, తారన్=కదిసియుండఁగా, మహాదరచక్రము, మహత్=గొప్పదియగు, దర=గుహలయొక్క, చక్రము=సమూహము, ఉద్రసా...ప్రథిమ, ఉద్రసా=ఉన్నతభూములయొక్క, ఆర్జవ=తిన్నఁదనముగల, భుజగ=పాములచేత, ఆహిత=తీసుకొనిరాఁబడిన, ప్రథిమ=అతిశయము, అనఁగా అక్కొండయందున్నతభూములయందుఁ బాములు సాగిపోవుచున్నవని తాత్పర్యము. సత్తులసీవనమాలికల్, సత్=మంచివగు, తులసీ=తులసిచెట్లయొక్క, వన=తోఁటలయొక్క, మాలికల్=పఙ్క్తులు, సదా=ఎల్లప్పుడు, ప్రవిలసితంబుగాన్=ప్రకాశించుచుండఁగా, పృథు...రామలకున్, పృథుల=విస్తారములైన, పన్నగ=పాములయొక్క, రామలకున్=స్త్రీలకు, నాగకన్యకలకనుట, ఈ

రముల్=పొంద, స్వవైభవములన్=తమయైశ్వర్యములచేత, ఇంపుఁదె ల్పన్=సంతోషము కలిగించఁగా, అతఁడు=ఆహిమవంతుఁడు, అతిభాగ్య ములన్=గొప్పయదృష్టములచేత, తగున్=ఒప్పును.

సీ. ధవళ...ప్రములు, ధవళ=తెల్లనైనట్టి, ఇదియూర్ధ్వపుండ్రముల కువిశేషణము. తను=శరీరమందలి, ఊర్ధ్వపుండ్రములు=నిలువుబొట్లును. ఉదా. ముద్ర, ఉదార=విస్తారముగా, మహత్=ప్రశస్తమగు, దర=శం ఖముయొక్కయు, చక్ర=సుదర్శనచక్రముయొక్కయు ముద్ర=ముద్రిక సార్జవ...ప్రథిమ. సార్జవ=తిన్నఁదనములోఁగూడిన, భుజ=బాహువుల యందు, గాహిత=ప్రవేశింపఁజేయఁబడిన,ప్రథిమ=అతిశయము,సత్తు..లికల్, సత్తులసి=మంచితులసిదళములలోఁగూడిన.వనమాలికల్=ఆకులునుంబువ్వు లుంజేర్చినదండలు, సదాప్రవిలసితంబుగాన్=యెల్లపుడుఁబ్రకాశించునట్లు గా, పృథు కీరముల్, పృథు=విస్తారముగా, లపత్=పలుకుచున్న, నగి ర=పట్టణమందలి, కీరముల్=చిలుకలు, స్వవైభవములన్=తమగొప్పతన ములచేత, ఇంపుఁదెల్పన్=శోభనియ్యఁగా అతఁడు=ఆజనకుఁడు ఎప్పు డున్=ఎల్లపుడు, సతిభాగ్యములన్, సతి=నమస్కారములను, భాక్= పొందునట్టి, యతులన్=మునులనుగూర్చి, తగున్=అనుకూలించును.

క. అతఁడుసుమేరుజసోమ!
ద్యుతిమేననుగొప్పనన్ఘనోన్నతిఁగములో!
న్నతిమొగమునఁదగుమగువను!
గృతినైవరియించెసత్య-ధృతినామహితన్॥

టీ. అతఁడు=ఆహిమవంతుఁడు, సుమేరుజన్=మేరుపర్వతపుత్రిక యైనట్టియు, హేమద్యుతిన్=బంగారమువంటి కాంతిగలిగినట్టియు, గొప్ప నన్=కురుమునందు, ఘనోన్నతి, ఘన=మేఘములయొక్క, ఉన్నతి=ఔ న్నత్యమును, మొగమునన్=ముఖమునందు, కమలోన్నతి=పద్మముయొక్క-

ఒక్కొదారిఁ = ఒకవైపున, వెలుఁగఁ = ప్రకాశింపఁగా, పగడంబులు = ప్రవాళములు, కడుఁ = మిక్కిలి, పొసఁగు = ఒప్పారెడి, డంబరము = విజృంభణము ఉరంగఁ = తగునట్లుగా, యువతిశాలల = స్త్రీవిహారగృహములే, ఒకయోరమీరఁ = ఒకవైపునతిశయించఁగా, వెలిముత్తెముల = తెల్లనిముత్యముల యొక్క, మొత్తముల = సమూహములయొక్క, పొత్తు = స్నేహము. తెలుకొత్తు = కాంతిప్రవాహముచున్న, గాంధర్వశాలలు, గాంధర్వ = గంధర్వులసంబంధులగు శాలలు = శాలలు, ఒక్కొటఁ = ఒకవైపున, వెలుంగఁ = ప్రకాశింపఁగా, మహా = మిన్నయైన, కెంపుగల = ఎఱుపుగల, కెంపులన = పద్మరాగములచేత, వినాయ = ఒప్పుచున్న, విద్యా... గారము — విద్యాధర = దేవయోనివిశేషులయొక్క, ఆగార = గృహములయొక్క, వారము = సమూహము, ఒక్కవంకఁ = ఒకభూమియందు, నిలువఁ = ఉండగా. ఇప్పగిదిన్ ఈరీతిగా, సర్వసంపదలు = అన్నియైశ్వర్యములును, ఇంపుఁ = ఆనందమును, నింపఁ = పండించఁగా, అతని = ఆహిమవంతునియొక్క, నగము చిరస్ఫూర్తి — నగ = పర్వతముయొక్క, శేషాహ్వయులయొక్క, రుచిర = మనోహరమును, స్ఫూర్తిఁ = అతిశయమును, అభినుతింపన్ = స్తోత్రముఁ జేయుటకు, ఈధరణిమోయుచిలువకైనఁ = శేషునకైన. నలువకైనన్ = బ్రహ్మకైనను, పలుకులచెలువకైనఁ = సరస్వతికైనను. అలవిగాదు = శక్యముగాదు.

సీస. ధనదసౌధములు = ధనముఇచ్చువాని మేడలు, పగడములు, డంబుఁ = కాంతిని, అగ్గము = మిక్కిలి, పొసగుఁ = పొందును, రంగయువతిశాలలు = నాట్యముఁ జేయు స్త్రీలయొక్క యిండ్లు, గాంధర్వశాలలు = సంగీతశాలలు, విద్యాధరాగారములు = విద్యావంతులయిండ్లు, అతని = ఆహిమవంతుని యొక్క, నగరు = పట్టణము, చిరస్ఫూర్తిఁ = చిరకాలాతిశయముచేత, శేషము సమానము.

క. ఘనమైనాకపదంబునఁ|
దనరెడుమేల్కొమ్మకుఁగన్న-తనసతియుతిపా|

వనమౌనిభృతోటజసే।
వనమునఁదనకింపునింప-బాటిలునతఁడుఁ॥

టీ. అతఁడుఁ=ఆహిమవంతుడును, ఘనమైనాకపదంబునఁ=ఘనమైన మైనాకుడనుపేరుచేత, తనరెడు=ఒప్పుచున్న, మేలుకుమరుఁ=మంచికుమారుని, కన్న=కాంచినట్టి, తనపతి=తనభార్యయగుమేనక, అతిపావనమౌని=మిక్కిలిపవిత్రమగు, నిభృత=నిశ్చలమగు, ఉటజ=పర్ణశాలయొక్క సేవనమునఁ=సేవించుటచేత, ఈమెయోగినియౌటచేతఁ బర్ణశాలలయందుండుననుట అట్లుకుమారసంభవము ప్రథమసర్గలో 'మేనాంమునీనామపి మాననీయాం' అని కాళిదాసుచెప్పియున్నాడు వ్యాఖ్యాతయుదీనిని వివరించెను. తనకు=తనకు, ఇంపునఁ=సంతోషముగ లిగించఁగా, పాటిలుఁ=ఉండును,

సీత॥ అతఁడుఁ=ఆజనకుఁడును, ఘనమై=గొప్పదియై, నాకపదంబునఁ=స్వర్గమునందు, తనరెడు=ఒప్పునట్టి, మేల్=మంచిదియగు, కొమరుఁ=మనోహరత్వమును, కన్న=పొందిన, తనపతి=తనభార్యయగు సత్యధృతి అతిపావన=మిక్కిలిపవిత్రులగు, మౌని=మునీశ్వరులచేతను, భృత=నిండిన, ఉటజ=గృహముయొక్క, సేవనమునఁ=సేవచేత, తనకుఁ=తనకు, ఇంపునింపవాటిలుఁ=అనఁగా జనకుఁడు వేదాంతిగావున యాజ్ఞవల్క్యాదిమునులు వీరియిల్లునిండియుండఁగా జనకునిభార్య వారలకుపచారము సేయుచుండుననుట.

చ. అశిథిలగంధసారసవ-నానలసారినమట్పదోన్నతుల్।
కుశలవనప్రచారములు-గోమలసామజశబ్దవారిముల్।
భృశముదలిర్పదర్పితహ-రిప్రముఖాఖిలసత్త్వుఁడై మహా।
విశదిమనుంకునాతఁడుప-విత్రసదాత్మజపాకుసూతుఁడై॥

టీ॥ అతఁడు=ఆహిమవంతుఁడు, అశిథిల ..న్నతుల్ — అశిథిల=విడిపోని, గంధ=పరిమళముగల, సారస=పద్మములయొక్క, వన=పొదలయందు,

అనలస= మందములు కాని, ఆరవ=ధ్వనులుగల, షట్పద=తుమ్మెదలయొక్క, ఉన్నతుల్=ఔన్నత్యములును, కుశలవప్రచారములు — కుశల=క్షేమము గల, వ =వనములయందైన, ప్రచారములు=మార్గములును, కోమల...వారముల్ — కోమల=నూతనములగు, సామజ=ఏనుఁగులయొక్క, శబ్ద=ధ్వనులయొక్క, వారముల్=సమూహములును, భృశము=అత్యంతమును, తలిర్పక్=ఒప్పఁగా, దర్పిత...సత్త్వుఁడై—దర్పిత=మదించిన, హరిప్రముఖ=సింహములు మొదలుగాఁగల, అఖిల=సమస్తములయిన, సత్త్వుఁడై=జంతువులుగలవాఁడై పవి...సూత్రుఁడై—పవి=వజ్రాయుధము వలన, త్రిసత్=జడియుచున్న, ఆత్మజ=కుమారునియొక్క, పాతుసూత్రుఁడై=సూత్రములవంటి రెక్కలసంపుగలవాఁడై. విశదముక్=తెల్పుచేతను, ఉండుక్=ఉండును.

సీ॥ అతఁడు=అజనకుఁడు, అశిధి...న్నతుల్ —అశిధిల=విడిపోని, గంధసార=మంచిగంధముగల, సవ=యజ్ఞములయందైన, అనల=అగ్నిహోత్రములయొక్క, సారః=సిరములకు, వషట్పద=వషట్కారములయొక్క, ఉన్నతుల్=ఔన్నత్యములును. కుశలవప్రచారములు—కుశ=దర్భలయొక్క, లవన=కొయ్యడము యొక్క, ప్రచారములు=ప్రసక్తులును, కోమల...వారముల్ —కోమల=ఇంపయిన. సామ=సామములయందు, జ=పుట్టిన, శబ్ద=శబ్దములయొక్క, వారముల్=సమూహములును, భృశము=మిక్కిలి, తలిర్పక్ = ఒప్పఁగా, తర్పిత...సత్త్వుఁడై--తర్పిత=తృప్తిపొందించఁబడిన, హరిప్రముఖ=ఇంద్రుఁడు మొదలుగాఁగల, అఖిల=సమస్తదేవతలయొక్క, సత్త్వుఁడై=స్వభావముగలవాఁడై, పవిత్ర ... సూత్రుఁడై — పవిత్ర=పవిత్రమయిన, సత్ = యోగ్యమయిన, ఆత్మ= శరీరమందలి, జప = జపముయొక్క, పాతుసూత్రుఁడై = జపమాలికలుగలవాఁడయి, విశదముక్ = నిర్మలవృత్తిచేతను, ఉండుక్ = ఉండును.

వ. సర్వసర్వంసహాసర్వస్వనిర్వహణ ధూర్వహుండగు నయ్యు
ర్వీధర తిలకుండొక్కనాఁడు గంధమండలీసౌగంధ్య నిష్పం

దపుష్పంధయ స్తనంధయజాలంబులు నీలంబులగు కపోల
మూలచమరవాలంబుల నీలత్వంబునాలంబింప నెంతొరుల
మండలీకృత శుండాదండంబులం బట్టికొనుచు నట్టకేలకు ను
ట్టిపడుచు నుద్దండంబగు వేదండషండంబులొక దండఁదాం
డవింప నఖండపుండరీకమండల పరిహిండనంబులు తండోప
తండంబులుగా మొండారనిండాడుచు నిలచు రాజహంస స
మాజింబుల వ్యాజతేజంబున నొక జగతిఁ దేజరిల్లఁ బదపద
మున ముదముదయముగొనరుచిరమందను రాపరాగాభోగం
బు మీఁటసుఖలీనభావంబుగాన నిభృతంబగు గంధర్వబృం
దంబు కుకెక్కుపెక్కుటెక్కుల నొక్కచక్కిపిక్కటిల్ల నా
గమాంతసంతత సుమనోవికాస సమానాదితవాసనోల్లాసం
బున భాసిల్లుచు హరితత్వక్తానపత్త్రపాతంబున నిరంతరా
భ్యస్యమాన విష్ణుపదమార్గంబగు ద్విజవర్గంబు రసాలసాల
పనసహింతాళప్రచారంబునం బినాళించు దళితఫలంబులొసఁగు
చు నొక్కతట్టునెట్టుకొనఁగ నగరు వెడలి చనుసమయంబున.

పా. సర్వ...ధూర్వహుండు. సర్వ=సమస్తమైన, సర్వంసహా=భూమి
యొక్క, సర్వస్వ=సమస్తధనముయొక్కయు, నిర్వహణ=నిర్వహించుట
యందు, ధూర్వహుండు=భారమునువహించినవాఁడు, అగు=అయినట్టి, ఇచ
ట భూభారమునువహించువాఁడనునర్థము చెప్పుటకయి శబ్దాడంబరముగాంగ
లాలసుండగు కవియింతశబ్దాడంబరమును జేసెను. ఆయుర్వీధరతిలకుం
డు=ఆపర్వతశ్రేష్ఠుండు, ఒక్కనాఁడు=ఒకదినమున, గండ...జాలంబులు
గండమండలీ=గండస్థలములయందైన, సౌగంధ్య=పరిమళముయందు, నిష్పం

దూ=కదలన్ శ్రీ, పృషద్ధయా=తూమైదలయొక్క, స్తనంధయా=పిల్లలయొక్క
జాలంబులు=సమూహంబులు, నీలంబులకు=నల్లనైన, కపోలమూల=గండ
స్థలముల యొక్క మొదళ్ళయందైన, చమరవాలంబులన్=వింజామరలయందు
నీలత్వంబున్=నీలమణులతోటను, ఆలంబింపన్=పొందఁగా, ఒండోరులన్=
అన్యోన్యగ్రమునను, మఱి . గండంబులన్, మండలీకృత=గుండ్రముగాఁ
జేయఁబడిన, శుండాదండంబులన్=కఱ్ఱలవంటితొండములచేత, పట్టుకొను
చున్=స్వీకరించుచు, ఎట్టకేలకున్=అతిప్రయాసమున, ఊటిపడుచున్=అ
తిశయించుచు, ఉద్దండంబగు=ఆదించిన, వేదండ=ఏనుఁగులయొక్క, షం
డంబులు=సమూహములు, ఒకదండన్=ఒకవైపున, తాండవింపన్=నటిం
చఁగా, అఖండ . హిండనంబులు, అఖండ=ఎడతెగని. పుండరీక=పులు
లయొక్క, మండల=సమూహములయొక్క, పరిహిండనంబులు=అంతటసం
చారంబులు, తండోపతండంబులుగన్=విస్తారములుగ, మెండారన్=అ
తిశయించఁగా, నిండారుచున్=నిండుచు, నిలుచున్నట్టి, రాజహంస స
మాజంబులు, రాజహంస=ఎఱ్ఱనికాళ్ళు ముక్కులుగలయంచలయొక్క, స
మాజంబులు=సమూహంబులు, అవ్యాజతేజంబునన్=నిష్కపటకాంతిచేత,
ఒకజగతిన్=ఒకభూమియందు, తేజరిల్లన్=ప్రకాశించఁగా, పదపదము
నన్=ప్రతిశబ్దమునందు, ముదము=సంతోషము, ఉదయముగొనన్=పుట్ట
గా, రుచిరమన్=కాంతిసమృద్ధిచేత, దురాపరాగాభోగంబు, దురాప=
పొందశక్యముగాని, రాగ=కస్తూర్యాదిరాగములయొక్క, ఆభోగంబు=అ
తిశయము [పరిపూర్ణత్వము,] మీరన్=అతిశయించఁగా, సుఖలీనభావం
బు, సుఖ=సుఖమందు, లీన=అడఁగిన. భావంబు=అభిప్రాయము గలది
యయి, గాననిభృతంబు, గాన=సంగీతమందు. నిభృతంబు=నిశ్చలమయినదియు
అగు=అయినట్టి, గంధర్వబృందంబు, గంధర్వ=దేవయోనివిశేషులయొక్క బృం
దంబు=సమూహము, ఈడు మిక్కుటము=అతిశయించునట్టి, పెక్కు=విస్తారము
యిన. మిక్కుటలన్=ఉద్రేకముచేత, ఒక్కచక్కిన్=ఒకవయిపున, పిక్క
టిల్లన్=నిండియుండఁగా, అగమాం . ంగాసంబున, అగమ=వృక్షములయొక్క ధ

స్తంద్ర=మరుస్తైన, అనంద=సంతోషముగల, మిళింద=తుమ్మెదలయొక్క బృంద=సమూహముయొక్క, లలనా=స్త్రీలయొక్క, సంగీత=సంగీతముయొక్క, భంగీ=రచనతోడ, పాళిత్=కూడుకొనుచున్న. మంద్రాది=మంద్రము మొదలుగాఁగల, స్వర=స్వరములకు, జఁఘప=చట్టములయిన, అనఁగా మందాదిస్వరములతోఁగూడిన ధ్వనులనాలీసుకొని వచ్చుచున్నవనుట; గంధవహడింభంబుల్=పిల్లగాలులు, మెయిన్=శరీరమందు, భాసిలన్=ప్రకాశించఁగా.

క. అదిశుభవిభవకరంబని।
మదినెంచుచునివలనవల-మహీభృత్కులముల్।
పదపదమునగఘానశుకీ।
ద్రుమలవచోరచనములను-మేల్కొలితి సేయున్॥

పా. మహీభృత్కులముల్=పర్వతసమూహములు, శేషము సులభము.
సీత. మహీభృత్కులముల్=రాజసమూహములు.

చ. అటఁజనికాంచెనంబరస-ధంబుధిశంబరజాలబింబితో।
త్కటసవరత్నగోపురము-ఖప్రతిలంభకభర్మకుంభికా।
పటలవిలోకనాకలిత-భర్మసరోజకులభ్రమభ్రమ।
త్కటిలసవిభ్రమభ్రమర-కూటమునిందిరదివ్యవాటమున్॥

టీ. వెనుకటివచనమునందలి యూర్ధ్వభర్తిలకుండను పదముపద్యమందలి కారకమునకు అమక్రియకు కర్తగాఁబున వదిమొదలునించుకొనికే కాన్వయము. అటన్=అచటికి, చని=వెళ్ళి, అంబర..కూటము, అంబర=ఆకాశమునందు, సత్=ఉన్నట్టి, అంబుధి=నదియొక్క, శంబర=ఉదకములయొక్క, జాల=సమూహమునందు, బింబిత=ప్రతిబింబించిన, ఉత్కట=అతిశయముగల, నవరత్న=నవరత్నములయొక్క, గోపుర=పెద్దమేడలయొక్క, ముఖ=ద్వారములను, ప్రతిలంభక=పొందిన, భర్మ=బంగారముయొక్క, కుంభికా=కలశ

లయొక్క, విలోకన=చూచుటచేతను, ఆకలిత=పొందఁబడిన భక్తసరోజ= ఖంగారపుష్పములయొక్క, కుల=సమూహమునట్టి, భ్రమ=భ్రాంతిచేత ను, భ్రమాత్=తిరుగుచున్న, కుటిల=వంకరలగు, సవిభ్రమ=విలాసముల తోఁగూడిన, భ్రమర=తుమ్మెదలయొక్క, కూటము=సమూహముగల, ఇం దిరదివ్యవాటియుఁ, ఇందిర=లక్ష్మియొక్క, దివ్య=ప్రశస్తమైన, వాటియుఁ దోటను, గాంచెఁ=చూచెను, ఇచట తెలుఁగుసమాసముగావున విభక్తివి కారముచే ఇందిరాశబ్దమునకు హ్రస్వముకలిగినది.

వ. కనుంగొని యంతరంగంబునందరంగితంబగు భక్తిరసప్ర సంగంబునం బ్రదక్షిణంబు లాచరించి సముచితపరిచారవారపరి వృతుండయి ముందుపురందర పురస్సరబృందారక బృందంబుల కునమంద మహానందంబు సుధాస్వాదలబనందనరింపోటసంఘటి ల్లున గణ్యపుణ్యానై పుణ్యాంబున సకలభువనశరణ్యయగు జలధి రాజన్యకన్యయరుణ చరణపల్లవమ్ముల శరణాపన్నారంబుగావించిత దపారకృపార సలసదపాంగ సంగంబున నయుతోన్నపనలచి రత్న రత్నరుచిరరుచి ధురంధరంబై విలసిల్లు మంథరధరాధరంబుడంబు విడంబించు ప్రత్నరత్న రాజరాజితంబగు గోపుర రాజంబుగల మహాద్వారంబుసొచ్చి॥

టీక. హా కనుంగొని, చూచి, అంతరంగంబునఁ=మనస్సునందు, త రంగితంబగు=తరంగములువేయుచున్న, భక్తిరసప్రసంగంబునన్, భక్తిరస= భక్తిరసముయొక్క, ప్రసంగంబునన్=ప్రసక్తిచేతను, ప్రదక్షిణంబులు=ద క్షిణముగా తిరుగుటలను, ఆచరించి=చేసి, సముచి...తుండై, సముచిత= తగిన, పరిచార=ఉపచారకులయొక్క, వార=సమూహముచేత, పరివృతుం డై=చుట్టుకొనఁబడినవాఁడై, ముందు=ఎదుటను, పురందర...దమ్ములకుఁ,

పురందరపురస్సర=దేవేంద్రుఁడు మొదలుగాఁగల, బృందారక=దేవతలయొ క్క, బృందమ్ములకున్=సమూహములకు, అమందమహానందంబు=తక్కువ కానిగొప్పదియగు నానందము, సుధా...నంబునన్, సుధా=అమృతముయొ క్క, స్యంద=ప్రవాహముయొక్క, సందానంబునన్=కూర్పు అనునట్లుగా, తివరించుటన్=చేయుటచేత, సంఘటిల్లు=సిద్ధమయిన, అగణ్య...ణ్యంబు నన్. అగణ్య=లెక్కింపశక్యముకాని, పుణ్య=సుకృతముయొక్క, నైపు ణ్యంబునన్=నేర్పుచేతను, సకలభువనశరణ్య, సకలభువన=సమస్తలోకము లకు, శరణ్య=రక్షకురాలు, అగు=అయిన, జలధిరాజకన్యక=లక్ష్మీదేవి యొక్క, అరుణ=ఎఱ్ఱనైన, చరణపల్లవంబులన్=చిగుళ్ళవంటిపాదములను, శరణవరణంబున్=రక్షణయొక్క కోరడమును. కావించి=చేసి, తదపా... గంబునన్, తత్=ఆలక్ష్మియొక్క, అపార=హద్దులేని, కృపా=దయయనుగాఢ, రస=రసముచేతను, లసత్=ప్రకాశించుచున్న, అపాంగ=క్రేగంటిచూపుల యొక్క, సంగంబునన్=కలయికచేత, అయత్న...ధురంధరంబై, అయత్న=య త్నములేకుండునట్లుగ, ఉపాత్త=సంప్రాప్తములయిన, చిరత్న=ప్రాచీనము లగు, రత్న=మణులయొక్క, రుచిర=సుందరములగు, రుచి=కాంతియొక్క, ధురంధరంబై=భారమును వహించినదియై, విలసిల్లు=ప్రకాశించుచున్న, మం దరధరాధరంబు=మందరపర్వతముయొక్క, డంబున్=శోభను, విడంబించు= అనుకరించుచున్న, ప్రశస్తరత్నరాజిరాజితంబగు, ప్రశస్త=ప్రశస్తములైన రత్న=మణులయొక్క. రాజి=పఙ్క్తిచేత, రాజితంబగు=ప్రకాశింపఁజే యఁబడిన, గోపురరాజంబు=పెద్దగోపురము, కల=కలిగిన, మహాద్వారం బున్=గొప్పదేవిడీని, చొచ్చి=ప్రవేశించి.

శా. ఝల్లీవల్లిమతల్లిఫల్లఘలలో-మల్లోపమల్లోపమో।
ద్వల్లీలోల్లుఠనంబునం బెనఁగుచున్-హల్లోహలోల్లోలమై।
యల్లింబెల్లి గనుల్లసిల్లెడియళుల్-హల్లీసకోల్లాసకృ।
ద్ఝల్లీభల్లకరీతిఁ గ్రాలెననుతుల్-బెల్లీనువప్పట్టునన్॥

శాలిచ్ఛాయచిరత్నరత్నరచిత-స్వచ్ఛందపిచ్ఛందక।
వ్యాలీఢంబగుభర్మమంటపిఁగనెన్-హర్షప్రకర్షంబునన్॥

టీక. సాళీ... వ్యాలీఢంబు, సాళీక=పద్మములయొక్క, అళిపఙ్క్తియందు౯ైన, మధూళికా=పుష్పాదియొక్క, పరిమళ=వాసనచేత, ఆనందత్=సంతోషించుచున్న, మిళిందాంగనా=ఆడతుమ్మెదలయొక్క, పాళీ=పఙ్క్తియొక్క, కేళి=క్రీడయందైన, వరాళికా, వః=శ్రేష్ఠమైన, అళికా=పఙ్క్తిచేత, ముఖరిత=చప్పుడు చేయఁబడిన. ప్రత్న=ప్రశస్తములైన, దుర్యరత్న=చింతామణులయొక్క, ఉపమా=సామ్యముతోడ, శాలి=ఒప్పుచున్న, ఛాయ=కాంతిగల, చిరత్న=ప్రాచీనములను, రత్న=మణులచేత, రచిత=చేయఁబడిన స్వచ్ఛంద=స్వేచ్ఛగల, పిచ్ఛందక=రాజగృహరచవలచేత, వ్యాలీఢంబగు=వ్యాప్తమైన, భర్మమంటపికన్=బంగారుమంటపమును, హర్షప్రకర్షంబునన్=సంతోషాతిశయముచేతను, కనెన్=చూచెను.

వ. అంత.

చ. ప్రవలుచుమించుమించుమగ-రానిగరాలగరాళితంబగున్।
ధవళసరోజరాజమున-దప్తసువర్ణసవర్ణకర్ణికం।
దవిలినకెంపుగుంపులను-దాల్చినపీఠమునందుఁబొందుగాఁ।
గవెలయునిందిరంగనియె-గాంచినమంచితభక్తియుక్తిచేన్॥

టీ. ప్రవలుచున్=వృద్ధిబొందుచు, మించు=అతిశయించినట్టి, మించు=కాంతిగల, మగరానిగరాలన్=శ్రేష్ఠవజ్రములచేతను, కరాళితంబు=వర్ణాంతరమును పొందించబడినది, అగు=అయినట్టి, ధవళసరోజరాజమునన్=తెల్లనిపద్మశ్రేష్ఠమందు, తప్త కర్ణికన్, తప్త=పుటము వేయఁబడిన, సువర్ణ=బంగారముతోడ, సవర్ణ=సమానమయిన కాంతిగల, కర్ణికన్=ముద్దె (దిమ్మ) యందు, తవిలిన=కూర్పఁబడిన, కెంపుగుంపులను=రత్నసమూహములను, తాల్చిన=ధరించిన,

పీఠమునందున్ = పీఠమందు, పొందుగాన్ = అనుకూలముగా, వెలయున్ = ఒప్పుచున్న, ఇందిరన్ = లక్ష్మిని కనియెన్ = చూచెను. కాంచి = చూచి, సముంచిత = ఒప్పుచున్న, భక్తి = భక్తియొక్క, యుక్తిచేన్ = కూడుకొనుటచేత, ముందుపద్యముతో నన్వయము.

చ. ప్రణిపతనైకపాకయుత-పాకవిరోధిమహావరూథినీ।
మణిమయమౌళిపాళినవ-మాల్యమరందఝరీచరీకృతా।
ర్హణచరణుండుమాధవుఁడు-దారనుదారనుగావరింపనౌ।
గుణగణధన్యకన్యతన-కున్ గరుణింపవె వేగ మ్రొక్కెదన్॥

టీ. పా—ప్రణి.. ణుండు; ప్రణిపతన=నమస్కారమునందు, ఏక=ముఖ్యమయిన, పాక=పరిపాకముతోడ, యుత=కూడుకొనిన, పాకవిరోధి=దేవేంద్రునియొక్క, మహత్=గొప్పదియగు, వరూథినీ=సేనయొక్క, (అనఁగా దేవతలయొక్క) మణిమయ=మాణిక్యవికారములగు, మౌళి=కిరీటములయొక్క, పాళి=పఙ్క్తియొక్క, నవ=నూతనములగు, మాల్య=పువ్వుదండలయందలి, మరంద=పూఁదేనెలయొక్క, ఝరీ=ప్రవాహములచేత, చరీకృత=మిక్కిలితడియఁజేయఁబడిన, అర్హణ=పూజగల, చరణుండు=పాదములుకలవాఁడగు, ఉమాధవుఁడు=శివుఁడు, ఉదారను=గొప్పదియగు, దారనుగాన్=భార్యనుగా, వరింపనౌ=కోరఁదగిన, గుణగణధన్యన్, గుణసమూహముచేత నుధన్యురాలగు, కన్యన్ = కొమార్తెను, తనకున్ = నాకు, కరుణింపవే=అనుగ్రహించుమా, దేవీ = లక్ష్మీదేవి, మ్రొక్కెదన్ = నమస్కరించెదను.

సీ. మాధవుఁడు=విష్ణువు, శేషము సమానము.

చ. పలుకుపడంతి వేలుపుల-బల్లిదునింతి మొగంబుగాదగున్।
గలుకులకబ్బవబ్బురము-గాఁదగునీయుపచారముల్ వెసన్।
దెలియుము నీకుఁ దత్పతులు-దీటను వాఁడలపారిజాతప।
క్షుల్లతులనంబునింబమున-కున్ వివరించునకోజవాసినీ॥

టీ. సరోజవాసినీ=పద్మమునందు నివసించెడునోలక్ష్మీ! పలుకుపడఁతి=సరస్వతియును, వేలుపుఁబల్లిదునింతి=దేవతాశ్రేష్ఠుఁడగు నింద్రుని భార్యయగు శచీదేవి, మొదలుగాఁగల, కలకులకుఁ=స్త్రీలకు, తగు=అనుకూలములగు, నీయుపచారముల్=నీసేవలు, వెసన్=శీఘ్రముగా, అబ్బురముగాన్=ఆశ్చర్యముగా, అబ్బవు=దొరకవు, తెలియమిన్=ఎఱిఁగియున్నవాఁడగుచు, నీకున్=నీకు, తత్సతులు=ఆస్త్రీలు, దీటనువాఁడు=సమానమని చెప్పువాడు, నింబమునకున్=వేపపువ్వునకు, అల...తులవంబున్ అల=ప్రసిద్ధమగు, పారిజాత=పారిజాతపుష్పములయొక్క, పజ్జాళి=వరుసలయొక్క, తులవంబున్=సామ్యమును, వివరించుఁ=చెప్పును.

## మహాలక్ష్మీదండకము.

జయజయజనుతు, శేషశైలాధిపానందలీలా మహానందవేలాతిగాంభీర్యదోలా యమానోర్మిజాలా మితోల్లాసదాలాపమాలా, సుధాలాలసీయోరుబాలామృతాంశూపమాలాస్యసంసక్తహాలా, మహోల్లాసమాద్యద్ఘటాలాభదాపాంగజాలాభిరామా ప్రవాళాయితాంఘ్రి, ర్విపీలాలకా, క్షోణిసీలాఘపత్నీ, ప్రవాళాధరా, సద్రసాలావళీకుంజశాలా చరద్గోపబాలావలంబా, మదంబా, త్రిలోకైకల్పతాం అపిచ, సతతసురేంద్రపాళీ స్ఫురద్రత్నమాళీ భవద్బాలహేళీ ర్యమానాంశుకేళీ ప్రఫుల్లాంఘ్రినాళీకవత్త్యై, జితాళీకసంబంధ కాళీ శచీజానివాళీ కభూసన్నుతాళీవవృత్త్యై, మదాళీఘరక్షఃకరాళీకృతక్షోణిశైలీసరోజాతనాళీ సమంచన్మృణాళీ భవద్దైవ్యభవాళిందవత్త్యై సమాచీ నమోచారసాచా మనాచాతువాచా ప్రచారోన్నతాయై, నమద్దాసదాసానుదాసాధితా నల్ప సంకల్ప సంకల్ప కల్పద్రుమమా కల్పాత్మనామ్నే

శ్రియైతేనమః నమ ఇనమజహత్కృపారాజితాపాంగ ధారాళవిస్ఫూర్తిధారా ప్రక్ష్మప్తాత్యుదారారవిందోత్పలారామ వాటీవిహారాఢ్య భృంగీకిశోరాయితస్వాంత నారాయణాంకస్థలీ రాజ్యసింహాసనారాధితాయై, సుధారాశి మధ్యస్థలీ రాజమాన స్వరారామవాస్యప్సరోరాజభి ర్నిత్యనీరాజితాయై, తుషారాంశుతేజః పటీరామరాహారహారాళిసిహారహీరాహి హారాహి సారాత్త కీర్త్యై, సువర్ణాత్తమూర్త్యై, సువర్ణశ్రియై. నిస్సహాయైనమః జయజయజగదంబ దాసోస్మిహం తేరమావాసకాంతే త్వమేవాఖిలస్యప్రపంచస్యమాతేతి వాణ్యాపురాణ్యామహాత్యాపి సత్యాపితంసోహమేవంభవత్యాః కిశోరోస్మిభృత్యోస్మి దాసోస్మితస్మాత్కృపాంగై రపాంగైః ప్రపన్నంశిశుంమాంచశించాద్యకించాంబహృద్యానవద్యాత్త విద్యాభిరుద్యోత్యసే, త్వంసహస్రీనివాసేనతత్త్వం పరంజ్యోతిరిత్యంబ మహ్యందయేథాభక్తిముత్పాదయేథాసుధారాశికన్యేరమే పద్మహస్తే ప్రసీదప్రసీదప్రసీదాంబమే.

టీక — శేషశైలా...దాలాపమాలా శేషశైలాధిప=వెంకటేశ్వరుని యొక్క, అమంద=విస్తారమగు, లీలా=విలాసములయందు, మహత్=గొప్పదియగు, ఆనంద=ఆనందమనియెడు, వేలాతిగ=ఒడ్డునుదాటిన, అంభోధి=సముద్రమందు, డోలాయమాన=ఉయ్యాలలైయాచరించుచున్న, ఊర్మిజాల, ఊర్మి=తరంగముల యొక్క, జాల=సముదాయము వందు, అమిత=విస్తారమగు, ఉల్లాసద=ఉల్లాసము నిచ్చునట్టి, ఆలాప=మాటలయొక్క, మాలా=వరుసలు గలిగి యున్నట్టియు, సుధా...ఫాలా. సుధా=అమృతము వలె, లాలసీయ=గారవించఁదగిన,

ఉరు=గొప్ప వాఁడగు, బాలామృత=లేఁతచంద్రునియొక్క, అంశు=కిరణ ములయొక్క, ఉపమ=సామ్యముయొక్క, లాస్య=నాట్యమందు, సంసక్త=తగులుకొనిన, ఫాలా= నొసలు కలిగినట్టియు, మదోద్య...బాల. మద=మదము చేత, ఉద్యత్=ఉదయించుచున్న,మరాళాంగన=ఆఁడుహంసలువంటి, చారు=సుందరమైన, హేల=విలాసముయొక్క, ప్రచాలా= ప్రచారముగలిగినట్టియు, [ఇచట రలలకభేదము] మహా...రామా, మహత్= గొప్పవియగు, అలాన=కట్టుకట్లయందు, మాద్యత్ = మదించుచున్న. ఘటా=ఏనుఁగుగుంపులయొక్క, లాభద=లాభమునిచ్చు,అపాంగ=క్రేగంటి చూపులయొక్క, జాల=సమూహము చేత, అభిరామా=మనోహరయగునట్టియు, ప్రవాళాయితాంఘ్రిః, ప్రవాళాయిత=చిగురువలె నాచరించుచున్న, అంఘ్రిః=పాదములుకలిగినట్టియు, వినీలాలకా, వినీల=నల్లనైన, అలకా= ముంగురులుకలిగినట్టియు, క్షోణినీలాసపత్నీ=క్షోణి=భూమికిని, నీలా=నీలాదేవికిని, సపత్నీ=సవతియగులక్ష్మి, జయతుజయతు=మిక్కిలిసర్వోత్కృష్టురాలైయుండుగాక, ప్రవాళాధరా=ప్రవాళ=చిగురువంటి, అధర=అధరోష్ఠముకలిగినట్టియు, సద్రసా . లంబా,సత్=యోగ్యములగు, రసాల=తియ్యమామిళ్ళయొక్క,ఆవళీ=పఙ్క్తులయొక్క,కుంజ=పొదలనియెడు, శాల=శాలలయందు,చరత్=తిరుగుచున్న,గోపబాల=గోపాలకృష్ణునకు, అవలంబా=ఆధారమయినట్టి, మదంబా, మత్=నాయొక్క, అంబా=తల్లియగులక్ష్మి, శ్రియై = ఐశ్వర్యముకొరకు. కల్పతాం=సమర్థురాలగుగాక, అపిచ=ఇంతియకాదు, నత . వృత్త్యై, నత=నమస్కరించుచున్న, సురేంద్ర=దేవతాశ్రేష్ఠులయొక్క, పాళి=సమూహముయొక్క, స్ఫురత్=ప్రకాశించుచున్న. రత్న=రత్నవికారములగు, మౌళీభవత్=కిరీటమైయాచరించుచున్న, బాల=లేఁతనగు, హేళీ=సూర్యునియొక్క, ఈర్ష్యమాన=వ్యాపించుచున్న, అంశు=కిరణములయొక్క, కేళీ=క్రీడచేతను, ప్రఫుల్ల=వికసించిన, అంఘ్రినాళీకవృత్త్యై=పద్మమువంటిపాదముకలిగినట్టియు, జితాళీ...వృత్త్యై. జిత=జయింపఁబడిన, అళీక=అసత్యముయొక్క. సంబంధ=సంపర్కముగల,

కాళీశచీజాని=హరపురందరులచేతను, నాళీకభూః=బ్రహ్మచేతను, సన్ను
త=స్తోత్రము చేయఁబడిన, అలీ=ఉన్నతమగు, వృత్త్యా=వ్యాపారముకలిగి
నట్టియు, సమీచీన ...........న్నతాయై, సమీచీన = మంచిది
యగు, మోచామ్ల=అరటిపండ్లయొక్క, రస=రుచియొక్క, ఆచామనా=
ఆచమింపఁజేయుటచేత, చారు=సుందరమగు, వాచా=వాక్యములయొక్క
ప్రచార=గమనికచేతను, ఉన్నతాయై=ఉన్నతురాలైనట్టియు, నమద్దాస...
నామ్నైశ్రీ, నమత్=నమస్కరించుచున్న, దాస=భక్తులయొక్క, అనుదా
స=అనుసరించినభక్తులచేతను, ఆధిత=పొందఁబడిన, అనల్ప=విస్తారమగు,
సంకల్ప=ఉద్దేశములకు, కల్పద్రుమ=కల్పవృక్షరూపమయిన. అకల్పకల్పా=
అలంకారముతో సమానమగు ఆత్మా=తనయొక్క, నామ్నైశ్రీ=పేరుగల, శ్రి
యై=లక్ష్మియగు. తే=నీకు, నమః=నమస్కారము, అజహాత్కృపా...రాధి
తాయై. అజహాత్=విడిచిపెట్టని, కృపా=దయచేతను, రాజిత=ప్రకాశిం
పఁజేయఁబడిన. అపాంగ=కడగంటిచూపులయొక్క, ధారాళ=పఙ్క్తిగల, వి
స్ఫూర్తి=స్ఫురణయొక్క, ధార=అవిచ్ఛిన్నప్రవాహముచే, ప్రక్షిప్త=ర
చించఁబడిన, అత్యుదార=మిక్కిలిగొప్పదియగు, అరవింద=పద్మములయొక్క
యు, ఉత్పల=కలువలయొక్కయు, ఆరామ=తోటయొక్క, వాటీ=ప్రదేశ
మునందు, విహార=విహరించుటతోడ, ఆఢ్య=కూడిన, భృంగీకిశోరాయిత=
తుమ్మెదపిల్లయైయాచరించుచున్న, స్వాంత=చిత్తముగల, నారాయణ=విష్ణు
వుయొక్క, అంకస్థలీ=తొడయనెడు, రాజ్యసింహాసన=రాజ్యపీఠమునందు. ఆ
రాధితాయై=ఆరాధించఁబడినలక్ష్మికొరకు, ఇదం నమః=ఈనమస్కారము,
సుధా...రాజితాయై, సుధారాశి=పాలసముద్రముయొక్క, మధ్యస్థలీ=మధ్య
భాగమునందు, రాజమాన=ప్రకాశించుచున్న, స్వర్=స్వర్గమునందలి, ఆ
రామ=పువ్వులతోటయందు, వాసి=నివసించిన, అప్సరః=అప్సరస్త్రీల
యొక్క, రాజిభిః=పఙ్క్తులచేతను. నిత్య=యెల్లప్పుడు, నీరాజితాయై=నివా
ళించఁబడినట్టియు. తుషారాంశు...కీర్త్యై. తుషారాంశు=చంద్రునియొక్క
తేజః=తేజస్సుయొక్కయు, పటీర=మంచిగంధముయొక్కయు, అమరా

హార=అమృతముయొక్కయు, హారాళీ=ముత్యాల పేటలయొక్కయు, నీహార=మంచుయొక్కయు, హీర=వజ్రము యొక్కయు, అహింహార=శివుని యొక్కయు, అహిసార=సర్పశ్రేష్ఠుఁడగు, శేషుని యొక్కయు, ఆత్మ=స్వరూపమువంటి స్వరూపముగల, కీర్త్యై=కీర్తిఁగలిగినట్టియు, సువర్ణాత్మమూర్త్యై, సువర్ణ=బంగారమే, ఆత్మ=తనయొక్క, మూర్త్యై=స్వరూపముగలిగినట్టియు. సువర్ణశ్రియై, సువర్ణ=బంగారమువంటి, శ్రియై=శోభగలిగినట్టియు, నిస్సమాయై=సమానములేని లక్ష్మికొఱకు. నమః=నమస్కారము, జగదంబ=జగత్తులకుతల్లివగు నోలక్ష్మీ, జయజయ=మిక్కిలి నుత్కృష్టురాలవైయుండుము అహం=నేను. తే=నీకు, దాసః=భక్తుఁడను, అస్మి=అగుచున్నాను. హేరమావాసకాంతే=విష్ణువునకు భార్యవగు నోలక్ష్మీ, త్వమేవ=నీవే. అఖిలస్య=సమస్తమయిన, ప్రపంచస్య=ప్రపంచమునకు, మాతేతి=తల్లివని, పురాణాః=పూర్వికులును, మహాత్మాపి=గొప్పదియు నగు, వాణ్యా=సరస్వతిచేత, సత్యాపితం=సత్యము చేయఁబడినది. సోహం=ఆ నేను, ఏవం=ఈప్రకారముగా, భవత్యాః=నీకు, కిశోరః=పిల్లఁడను, అస్మి=అగుచున్నాను భృత్యః=భృత్యుఁడను, అస్మి=అగుచున్నాను, దాసః=నౌకరును, అస్మి=అగుచున్నాను తస్మాత్=ఆహేతువువలన, కృపాంగైః=దయామయావయవములగు అపాంగైః=క్రేగంటిచూపులచేతను, ప్రపన్నం=భక్తుఁడనైనట్టియు, శిశుం=చిన్నవాఁడనైనట్టియు, మాంచ=నన్నయితే, అద్య=ఇప్పుడు, సించ=తడుపుమా, కిం చ=ఇంతేగాదు. అంబ=ఓతల్లీ, త్వం=నీవు, హృద్యైః ..విద్యాభిః, హృద్య=మనోహరములయినట్టియు, అనవద్య=దోషములేనట్టియు, ఆత్మవిద్యాభిః=పరమాత్మవిద్యలచేతను, శ్రీనివాసేనసహ=విష్ణుమూర్తితోఁ గూడ, తత్త్వం=పరమతత్త్వమనియు, పరం=ఉత్కృష్టమగు, జ్యోతిరితి=తేజస్సనియు, ఉద్ద్యోత్యసే=ప్రకాశింపఁజేయబడుచున్నావు. అంబ=తల్లీ, మహ్యం=నాకొఱకు, దయేథాః=అనుగ్రహించుమా, భక్తిం=భక్తిని, ఉత్పాదయేథాః=పుట్టించుమా సుధారాశికన్యే=సముద్రుని కూతురవైనట్టియు, పద్మహస్తే=పద్మముహస్తమునందుఁ గలిగినట్టి

యము, మే=నాయొక్క, అంబ=తల్లివగు, రమే = ఓలక్ష్మీ, ప్రసీదప్రసీదప్రసీద = అనుగ్రహింపుము మనుగ్రహింపుము మనుగ్రహింపుము.

చ. అగణితభక్తి నిట్లునుతు-లాతఁడొనర్పఁగృపావిపాకముల్।
దగజగదంబపాణికమ-లంబునఁగ్రమ్మినపువ్వురాల్పనా।
సుగుణపయోధిసాధితసు-శోభనలాభనవప్రహర్షముల్।
మొగమునఁనుల్లసిల్లఁగొని-లోనగరోచితవాటికింజనెన్॥

టీ॥ అతఁడు=ఆహిమవంతుఁడు, అగణితభక్తిన్, అగణిత=లెక్కపెట్టఁబడని,భక్తిన్=భక్తిచేతను,ఇట్లు = ఈప్రకారము, నతులు=స్తోత్రములు, ఒనర్పన్=చేయఁగా, కృపావిపాకముల్=దయాపరిపాకములు, తగన్=ఒప్పునట్లుగా, జగదంబ=జగత్తునకుతల్లియగులక్ష్మి, పాణికమలంబునన్=హస్తపద్మమునందు లేక హస్తమనెడుపద్మమునందు క్రమ్మి=వ్యాపించిన, పూవున్=పువ్వును, రాల్పన్=దులపఁగా, ఆసుగుణపయోధి=యోగ్యగుణములకు సముద్రుఁడగు నాహిమవంతుఁడు, సాధి. హర్షముల్, సాధిత=సాధింపఁబడిన, సు=యోగ్యమగు, శోభ =శుభముయొక్క, లాభ=పొందుట చేతనైన, నవ=క్రొత్తవియగు, ప్రహర్షముల్=సంతోషములు, మొగమునన్=మోమునందు, ఉల్లసిల్లన్=ప్రకాశించఁగా, కొని=పుచ్చుకొని, లోన్=లోపల, నగర=పట్టణమునకు, ఉచిత=తగిన, వాటికిన్=ప్రదేశమునకు, చనెన్=వెళ్ళెను.

సీ॥ అతఁడు=ఆజనకుఁడు, పయోధి=సముద్రుఁడగు జనకుఁడు.

సీ. రతివల్లభసముల్ల-సితభల్లపరిపుల్ల,
తతపల్లవలసల్ల-తాశతంబు।
వరహల్లకసరిల్ల-హారివేల్లదలిమల్ల,
కృతసల్లలితవల్ల-కీరవంబు।

విజహల్లలనపల్ల-వికతల్లజవిపల్ల,
సనకృల్లలితసల్ల-పనపికంబు।
ప్రసరల్లఘుమరుల్ల-వసముల్లసితఫుల్ల,
దురువల్లరికమల్లి-కోత్కరంబు।
గీ. హస్తిహస్తనిరస్తని-ప్రస్తశస్త।
గోస్తనీస్తబకస్తోమ-నిస్తులంబు।
నైనయుద్యానమునసమ్మ-హానుభావుఁ।
డొంటిగనముఁగులఁబొసంగి-యుండునపుడు॥

టీక॥ రతి ..శతంబు. రతివల్లభ=మన్మథునియొక్క, సముల్లసిత=ప్రకాశించుచున్న, భల్ల=బల్లెములగుపువ్వులచేతను, పరిఫుల్ల=వికసించిన, తత=విస్తారములగు, పల్లవ=చిగుళ్ళచేతను, లసత్=ప్రకాశించుచున్న, లత=తీగలయొక్క, శతంబు=నందలుకలదియు, వర...రమంబు, వర=శ్రేష్ఠములగు, హల్లక=ఎఱ్ఱగలువలుగల, సరిత్=నదులయొక్క, లహరి=ప్రవాహములయందు, వేల్లత్=మిట్టుకొనుచున్న, అలిమల్ల=గొప్పతుమ్మెదలచేతను, కృత=చేయఁబడిన సత్=యోగ్యమగు, లలిత=సుందరమయిన, వల్లకీరవంబు, వల్లకీ=వీణలయొక్క, రవంబు=ధ్వనులుకలదియు, విజహా...పికంబు, విజహత్=విడిచిపెట్టిన (అనఁగాదూరమందున్న) లలనా=స్త్రీలుగల, పల్లవికతల్లజ=విటశ్రేష్ఠులయొక్క, విపత్=ఆపదలయొక్క, లసనా=ఉద్రేకమును, కృత్=చేయుచున్న, లలిత=సుందరమగు సత్=యోగ్యమగు, లపన=వాక్యములుగల, పికంబు=కోయిలలుగలదియు, ప్రసరల్ల...త్కరంబు, ప్రసరత్=ప్రసరించుచున్న, లఘు=తేలికయగు, మరుల్లవ=చిన్నగాలులచేతను, సముల్లసిత=ప్రకాశింపఁజేయఁబడిన, ఫుల్లత్=వికసించుచున్న, ఉరు=గొప్పవియగు, వల్లరిక=గుత్తులుగల, మల్లిక=మల్లిపువ్వులయొక్క, ఉత్కరంబు=సమూహముగలదియు, హస్తి...నిస్తులంబు, హస్తి=ఏనుఁగులయొక్క, హస్త=తొండములచేత, నిరస్త=

త్రోసివేయఁబడినవిగనుకనే, నిగ్రసస్కారిన, శస్త్రప్రశస్తములగు గోస్త
నీదార్తిత పండ్లయొక్క, స్తబక=గుత్తులయొక్క, స్తోమ=సమూహముచేత,
నిస్తులంబు సామ్యములేనట్టిదియు, ఐన=అయినట్టి, ఉద్యానమునన్=ఉద్యా
నవనమందు, ఆమ్మహానుభావుఁడు=గొప్పసామర్థ్యముగలయాతఁడు, ఒంటి
గన్=ఒక్కఁడుగా, అనుంగులన్=ఇష్టులను, పాసంగి=కూడి, ఉండునప్పుడు=
ఉన్నసమయమున.

క. కన్నులకింపైయమృతపు।
వన్నెలపెంపైపొసంగు-పాల్కడలినెరా।
చెన్నులనింపై యొక్కస।
మున్నతతేజంబుగగన-మునఁగనుపట్టెన్॥

టీ॥ కన్నులకున్=నేత్రములకు, ఇంపై=మనోహరమై, అమృతపు=అమృతముయొక్క, వన్నెల=రంగుల, పెంపై=అతిశయమై, పొసంగు=ఒప్పుచున్న. పాల్కడలిన్=పాలసముద్రముయొక్క, నెరా=అతిశయించిన, చెన్నులన్=సొగసులచేతను, ఇంపై=మనోహరమై, ఒక్క=ఒక్కటియగు, సమున్నత=అతిశయమయిన, తేజంబు=తేజస్సు, గగనమునన్=ఆకాశమునను, కనుపట్టెన్=కాంచెను.

ఆ. పట్టితేజముట్టి-పడినట్టుఁగనుపట్ట।
చిత్తమద్భుతైక-వృత్తినిలువ।
సందియంబుఁజెందు-సవయస్యజనులతో।
నట్టిదిట్టియిట్టు-లనియెనపుడు॥

టీ॥ పట్టి=ఇదికనుపట్టియను వెనుకటిపద్యాంతమునకనుకరణము, తేజము=తేజస్సు, ఉట్టిపడినట్టున్=ఊడిపడినట్లుగా, కనుపట్టన్=కాన్పించగా, చిత్తము, మనస్సు, అద్భుతైకవృత్తిన్=ఆశ్చర్యప్రధానవ్యాపారమున, నిలువన్=నిలువఁగా, సందియంబున్=సంశయంబును, చెందు=పొందుచున్న,

సవయస్క = సమానవయస్సుగల, [అనఁగా స్నేహితులగు]జనులతోన్ = మనుష్యులతో, అట్టిదిట్ట = దిట్టరియగునతఁడు, అపుడు = అప్పుడు, ఇట్టులని యెన్ = ఈప్రకారముగా జెప్పెను.

ఉ॥ తేజమొకంటిఁగంటిమిది-దివ్యతరంగిణినింగిఁబొంగుమేల్।
తేజముశారదాభ్రముల-తేజముపెక్కునుదుటెక్కురిక్కఱా।
తేజముయాజనార్దనుని-తేజమువెల్వడుకల్పభూజపుం।
తేజముచూడజూడఁగజనించుముదంబుహృదంబుజంబునన్

టీ॥ తేజము = తేజస్సును, ఒకంటన్ = ఒకదానిని, కంటిమి = చూచితిమి. ఇది = ఇది దివ్యతరంగిణి = ఆకాశగంగ, నింగిన్ = ఆకాశమునందు, పొంగు = పొంగునట్టి, మేల్ = శ్రేష్ఠమగు, తేజము = తేజస్సో, శారద = శరత్కాలమందలి, అభ్రముల = మేఘములయొక్క, తేజము = తేజస్సో. పెక్కు = విస్తారముగా, ఉదుటెక్కు = అతిశయించునట్టి. రిక్కఱా = చంద్రునియొక్క, తేజము = తేజస్సో, ఆజనార్దనుని = ఆ విష్ణుమూర్తియొక్క, తేజము = తేజస్సో, (ఇచటవిష్ణుతేజమునల్లనిది కావునఁ దెల్లనిదియగు నారదుని తేజముతో నెట్లుసమమగునని శంకించవలవదు విష్ణువుయొక్క వర్ణము యుగభేదముచేత మారుచుండుంగావున తెల్లనివర్ణమునుకలదని యెఱుంగవలయును) వెల్వడు = బయలుదేరునట్టి, కల్పభూజపుం తేజము = కల్పవృక్షముల తేజస్సో, చూడఁజూడఁగన్ = చూడఁగాఁజూడఁగా, హృదంబుజంబునన్ = హృదయపద్మమునందు, ముదంబు = సంతోషము, జనించున్ = పుట్టును.

శా॥ ఔరా కన్నులపండుగై వెలయునీ-యవ్యాజదివ్యప్రభా।
సొంబొక్కుటెకాఱుసంతతజను-స్సంతాపచింతాపరీ।
హాకోదారముకుందసద్గుణసుధా-స్యందంబమందంబుగా।
నారూఢిందగుగానతానములునిం-పైవీనులందోఁచెడిన్॥

టీ॥ జూరా = ఆశ్చర్యము, కన్నులపండువై = నేత్రములకానందకరమై వెలయు = ఒప్పునట్టి. ఈ...సారంబు. ఈ = ఇట్టి, అవ్యాజ = కపటము లేని, దివ్య = శ్రేష్ఠమగు, ప్రభా = కాంతియొక్క, సారంబు = సారము, ఒక్కటె = ఒక్కటియె, కాదు = కాదు, సంతత...స్యందంబు, సంతత = ఎడతెగని, జనుః = జన్మనుయొక్క, సంతాప, తాపముచేతనైన, చింత = విచారముయొక్క, పరీహార = పోఁగొట్టుటయందు, ఉదార = గొప్పదియగు ముకుంద = విష్ణుమూర్తియొక్క, సద్గుణ = యోగ్యగుణములనెడు, సుధా = అమృతముయొక్క, స్యందంబు = ప్రవాహము, అమందంబుగన్ = విస్తారముగా, ఆరూఢిన్ = ప్రసిద్ధిగ, తగు = ఒప్పునట్టి, గానతానములు = సంగీతముయొక్కతానములును, ఇంపైమనోహరమై, తోఁచెడిన్ = తోఁచును.

క. మానమ్ములువీనులకస
మానమ్ములునిగమభాస-మానమ్ములుసో
పానమ్ములుముక్తికిహరి
గానమ్ములువినుఁడిదిటము-గానమ్ముఁడొగిన్॥

టీ॥ వీనులకున్ = చెవులకు, మానమ్ములు = గౌరవములయినట్టియు, అసమానమ్ములు = సమానములేనట్టివియు, నిగమభాసమానమ్ములు, నిగమ = వేదములయందు, భాసమానమ్ములు = ప్రకాశించుచున్నట్టియు, ముక్తికిన్ = మోక్షమునకు, సోపానములు = మెట్లయినట్టియు, హరిగానమ్ములు = విష్ణువుయొక్కగానములు, దిటముగా = బాగుగా, వినుఁడు = ఆలకింపుఁడు, ఒగిన్ = క్రమముగా, నమ్ముఁడు = విశ్వసింపుఁడు.

చ. బటువుగమీఁదమేరుప్రణ-వంబుగదక్కినయక్కరంబులొ
క్కటిపదియున్నరంగుపటి-కమ్ములుప్రేలుజపాకుసుమాలవి
స్ఫుటతరవాసుదేవమను-చొప్పననొప్పులనుప్పతిల్లను
త్కటగుణశాలినారదుఁడు-గన్పడెనద్భుతదివ్యతేజుఁడై॥

టీక — బటువుగన్ = గుండ్రఁగ. మీఱు = అతిశయించుచున్న, మేరు_మేరువపూస, ప్రణవంబుగన్ = ఓంకారంబుగా, తక్కినయక్కరంబులు = మిగిలినయక్షరములు, ఒక్కటిపదియున్ గన్_పదునొకండుగా, రంగుపటికమ్ములు_కాంతిగలపటికపూసలు, వ్రేలు = వ్రేలఁబడుచున్న. జపాక్షమాల = జపమాలిక, విస్ఫుటతర...చొప్పున, విస్ఫుటతర = మిక్కిలి [illegible]టమగు, వాసుదేవ = విష్ణువుయొక్క, మనుచొప్పునన్ = మంత్రము...వల [illegible] గా ఓం [illegible] భగవతే వాసుదేవాయ అనుమంత్రమువలె) ఒప్పలన్ = శోభించేలను, ఉప్పతిల్లన్ = అతిశయించఁగా, ఉత్కటగుణశాలి = గొప్పగుణములతోఁ గూడిన, నారదుఁడు = నారదముని, అద్భుతదివ్యతేజుఁడై = ఆశ్చర్యకరము ప్రశస్తమయిన తేజస్సుగలవాఁడై, కన్పడెన్_కనుపించెను.

వ. ఇట్లునిర్ణయించుసమయంబున.

సీ. సొగసుగాఁదనరుప-న్నగశాయిగీతంబు,
నగశాయిగీతంబు-నగుపగుపఁ|
గరవిపంచీతంత్రి-కలరవోల్లాసంబు,
కలరవోల్లాసంబు-గారవించ|
బసుగనెమ్మెయిఁగ్రమ్ము-బసుమంపురుచికదం,
బసుమంపురుచికదం-బములఁబెనఁగఁ|
బదపదంబుననొప్పు-మృదుపరాగమ్ములు,
మృదుపరాగమ్ముల-మొలఁగివెలుఁగ|

గీ. ఫాలముననూర్ధ్వపుండ్రంబు-బరిఢవిల్లఁ|
జిత్తమునమురారిచింతనా-యత్తముగను|
నిల్వగాంధర్వసర్వస్వ-నిధిశళావి|
శారదమండచ్ఛటికివచ్చె-నారదుండు||

టీక — సొగసుగాన్ = అందముగా, తనరు = ఒప్పుచున్న పన్నగశాయి = విష్ణువుయొక్క, గీతంబు = గానము, నగశాయి = పర్వతమునందుండెడు గంధర్వాదులయొక్క, గీతంబున్ = గానమును, అగడుపరుపన్ = నిందయొనర్చుగా, కర...ల్లాసంబు, కర = హస్తమందలి, విపంచీ = వీణయొక్క, తంత్రికల = తీగెలయొక్క, రవ = ధ్వనియొక్క, ఉల్లాసంబు = ప్రకాశము, కలరవోల్లాసంబుల్, కలరవ = పావురములయొక్క, ఉల్లాసంబున్ = ప్రకాశమును, గారవించన్ = గౌరవము సేయఁగా, బడుగునెమ్మెయిన్, బడుగు = చిక్కిన, నెమ్మెయిన్ = శరీరమునందు, క్రమ్ము = వ్యాపించిన, బసుమంపు = విభూతియొక్క, రుచి = కాంతి, కదంబసునుంపు = కడిమి పువ్వులయొక్క, రుచి = కాంతియొక్క, కదంబములన్ = సమూహములను, పెనఁగన్ = పెనఁగులాడఁగా, పదపదంబునన్ = ప్రతిపదమందు, ఒప్పు = ఒప్పుచున్న, మృత్ = మట్టియొక్క, ఉపరాగమ్ములు = ఆవరణలు. మృదుపరాగమ్ముల్, మృదు = మృదువులగు. పరాగమ్ములల్ = ధూళులను, మెలగి = కలిసి, వెలుఁగన్ = ప్రకాశించఁగా, ఫాలమునన్ = నొసటియందు, ఊర్ధ్వపుండ్రము = నిలువుబొట్టు, పరిఢవిల్లన్ = అతిశయించఁగా, చిత్తము = మనస్సు, మురారిచింతన = విష్ణుచింతను, ఆయత్తముగను = అధీనముగునట్లుగా, నిల్వ = నిలువఁగా, గాంధర్వ...నిధి, గాంధర్వ = గానవిద్యయందు, సర్వస్వ = సర్వధనమునకు, నిధి = స్థానమగు, కళావిశారదుండు, కళా = శాస్త్రములయందు, విశారదుండు = నేర్పరియగు, నారదుండు = నారదుఁడు, అచ్చటికిన్ = ఆస్థలమునకు, వచ్చెన్ = వచ్చెను.

క. అచ్ఛపు తెలివిందగుమహి|
భృచ్చూడామణియతండు-ఋషివల్లభునిం|
దచ్చననెదుర్కొనివడిం|
దచ్చరణాబ్జములకెరఁగి-దత్తాదరుఁడై ||

టీ|| అచ్ఛపుతెలివిన్ = నిర్మలమగుజ్ఞానముచేత, తగు = ఒప్పుచున్న, ఆతండు = ఆ, మహిభృచ్చూడామణి = పర్వతశ్రేష్ఠుఁడగుహిమవంతుఁడు, ము

నివల్లభునికిన్=మునిశ్రేష్ఠుఁడగు నారదుని తచ్చనన్=శీఘ్రముగా, ఎదురొక్కని=ఎదురైనవాఁడై, వడిన్=త్వరగా. తచ్చరణాబ్జములకున్=ఆనారదుని పాదపద్మములకు, ఎఱఁగి=నమస్కరించి, దత్తాదరుఁడై=ఇయ్యఁబడినయాదరముగలవాఁడై.

సీ॥ మహీభృచ్చూడామణి=రాజశ్రేష్ఠుఁడగు జనకుఁడు.

క. ధరణీభృత్పతిసుజనా।
చరణీయస్ఫూర్తిఁబాద్య-జలమొసఁగెనుద।
చ్చరణములకుఁబావనసం।
చరణములకుసురకృతోప-చరణమ్ములకున్॥

పా॥ ధరణీభృత్పతి=పర్వతశ్రేష్ఠుఁడగు హిమవంతుఁడు, పావనసంచరణములకున్, పావన=పవిత్రమగు, సంచరణములకున్= సంచారముకలిగినట్టియు. సుర...లకున్, సుర=దేవతలచేతను, కృత=చేయఁబడిన, ఉపచరణమ్ములకున్=ఉపచారముగల, తచ్చరణములకున్, తత్=ఆనారదుని యొక్క, చరణములకున్=పాదములకు, సుజనా...స్ఫూర్తిన్, సుజన=యోగ్యజనులకు, ఆచరణీయ=చేయఁదగిన, స్ఫూర్తిన్=స్ఫురణముచేత, పాద్యజలము=కాళ్ళకొఱకైనయుదకము, ఒసంగెను=ఇచ్చెను.

సీ॥ధరణీభృత్పతి=జనకుఁడు.

క. అర్ఘ్యనకతనికిసుమనో।
దీర్ఘ్యంబులతోనతండు-దృఢవినయమనో।
దైర్ఘ్యంబునవిధివిహితం।
బర్ఘ్యంబునుపార్ఘ్యమిచ్చి-యర్చయొనర్చెన్॥

టీక—అతండు=అతఁడు, అర్ఘ్యనకున్=పూజించఁదగిన, అతనికిన్=ఆనారదునకు, సుమనో...లతోన్, సుమనోదీర్ఘ్య=గంగయందలి, అంబులతోన్=ఉదకములతోను. దృఢ...బునన్, దృఢ=దృఢమగు, వినయ=విన

యాముగల, మనః=మనస్సుయొక్క, స్థైర్యంబునన్=పాదవుచేత, విధివిహితంబు=శాస్త్రముచేత చేయఁబడినదియగు, అర్ఘ్యంబునన్=పూజావిధానమును, ఉపార్ఘ్యము=పయిపూజయు, ఇచ్చి, అర్చయొనర్చెన్=పూజించెను.

క. నానావిధసూనాదుల।
తోనాతఁడొనర్చె నర్చ-తుష్టిఘటింపం।
గానాతతమానాన్వితుఁ।
డానారదుఁడనియెనచట-నాసీనుండై ॥

టీక — నానా...లతోన్, నానావిధ=అనేకవిధములగు, సూనాదులతోన్=పువ్వులు మొదలగువానితో, ఆతఁడు=అతఁడు, ఒనర్చెన్=చేయఁబట్టె, అర్చ=పూజ, తుష్టిన్=సంతోషమును, ఘటింపఁగాన్=కూర్పఁగా, ఆతతమానాన్వితుఁడు, ఆతత=విస్తారమగు, మాన=గౌరవముతో, అన్వితుఁడు=కూడుకొనినవాఁడగు, ఆనారదుఁడు=ఆనారదముని, అచటన్=అక్కడ, ఆసీనుండై=కూర్చుండినవాఁడయి, అనియెన్=చెప్పెను.

సీ. ఎరపట్టుతెరబట్టు-నొరపట్టుచిరుచట్టు,
పలజక్కిదొరనెక్కి-ప్రబలువాఁడు।
అలకుందములబృంద-ములయందములనంద,
నరుకొ్రొవ్వగలనవ్వ-బరగువాఁడు।
పెనుమచ్చికనుహెచ్చి-తనుమెచ్చికొనులచ్చి,
కొరవుచ్చిమొదమించు-గురుతువాఁడు।
అలనీలములజాల-ములలీలలనిరాళ।
మైరంగలరునంగ-మమరువాఁడు।
గీ. సకలచిదచిచ్ఛరీరుండు-సర్వగతుఁడు।
జగములన్సృజింపఁబాలింప-సంహరింపఁ।

దగుపటిమగల్గుజాళువా-జగమునేలు।
మేలుదొరనిన్నుఁగరుణతో-నేలుఁగాత॥

టీక॥ ఎరపట్టు=ఎరపట్టుయొక్క, తెర=జవనికయొక్క, బిట్టుఁ=అతిశయమును, ఒరపట్టు=ఆక్రమించునట్టి, చిరు=చిన్నవియగు, చట్టుపల=రెక్కలుగల, జక్కిదొరన్=మేలిగుఱ్ఱమును, ఎక్కి=అధిష్ఠించి, ప్రబలువాఁడు=అతిశయించునట్టివాఁడు, అలకుందముల=ప్రసిద్ధములయిన మల్లెపువ్వులయొక్క, బృందముల=సమూహములయొక్క, అందములన్=శోభలోయనునట్టుల, తనరు=ఒప్పుచున్న, క్రొవ్వగల=క్రొత్తవిలాసములుగల, నవ్వు=హాసము, ఎరగువాఁడు=ఒప్పునట్టివాఁడు, మెనుముచ్చికన=మిక్కిలి స్నేహముచేతను, హెచ్చి=అతిశయించి, తనన్=తన్ను, మెచ్చుకొను=స్తోత్రముఁజేయునట్టి, లచ్చి=లక్ష్మి, కొర=లోటును, త్రుచ్చి=పోఁగొట్టి, ఎదన్=హృదయమందు, మించు=అతిశయించునట్టి, గురుతువాఁడు=చిహ్నమువాఁడు, అలనీలముల=ప్రసిద్ధములగునీలములయొక్క, జాలముల=సమూహములయొక్క, లీలలన్=విలాసములచేత, నిరాళమై=నిశ్శంకమై, రంగలరు=ప్రకాశించుచున్న, అంగము=శరీరము, అమరువాఁడు=ఒప్పుచున్నవాఁడు, సకల...రీరుండు, సకల=సమస్తములగు, చిత్=జ్ఞానము గల జంతువులయొక్కయు, అచిత్=జ్ఞానములేని జంతువులయొక్కయు, శరీరుండు=శరీరముకలవాఁడు, సర్వగతుఁడు=సమస్తమును బొందినవాఁడు, జగములన్=లోకములను, సృజింపన్=నిర్మించుటకును, పాలింపన్=ఏలుటకును, సంహరింపన్=మాపుటకును, తగు=తగిన, పటిమ=సామర్థ్యము, కలుగు=కలుగునట్టి, జాళువా జగమున్=బంగారపుభూమిని, (అనఁగా వైకుంఠమును] ఏలు=పరిపాలించునట్టి, మేలుదొర=గొప్పయధికారి, నిన్నున్=నిన్ను, కరుణతోన్=దయతో, ఏలుగాత=రక్షించుఁగాక.

శా. భూమీభృత్కులచంద్రిసారసవనా-భోగంబులన్నద్విజ।
స్తోమంబెల్లెడనుల్లసిల్లఁదగునీ-శుద్ధాశయప్రాభవం।

బామోదించునెమించునేవిభవముల్ - హర్షోన్నతింగాంచునే।
సామస్త్యంబునసామజంబులుహరు-ల్సౌఖ్యావహో
ద్యానముల్॥

పా॥ భూమీభృత్కులచంద్ర, హిమవంతుఁడా, సారసవనాభోగంబులన్, సారస=పద్మములయొక్క, వన=వనములయొక్క, ఆభోగంబులన్=అతిశయములయందు, సద్విజస్తోమంబు, సత్=యోగ్యములగు, ద్విజ=హంసాదిపక్షులయొక్క, స్తోమంబు=సమూహము, ఎల్లెడన్=అన్నిచోటుల, ఉల్లసిల్లన్=ప్రకాశించఁగా, తగు=ఒప్పుచున్న=నీ=నీసంబంధమైన, శుద్ధా...వంబు, శుద్ధ=పరిశుద్ధములగు. ఆశయ=స్థానములయొక్క, ప్రాభవంబు=అతిశయము, ఆమోదించునె=పరిమళించుచున్నదా, విభవముల్, వి=పక్షులయొక్క, భవముల్=పుట్టుకలు, మించునే=అతిశయించునా, సామజంబులు=ఏనుఁగులును, హరుల్=సింహములును, సౌఖ్యావహోద్యానముల్. సౌఖ్య=సౌఖ్యమును, ఆవహ=కలిగించెడు, ఉద్యానముల్=ఉద్యానవనములును, సామస్త్యంబునన్=సమస్తత్వముచేత, హర్షోన్నతిన్=సంతోషాతిశయమును, కాంచునే=పొందునా.

సీ॥ భూమీభృత్కులచంద్ర=రాజశ్రేష్ఠుఁడైన జనకుఁడా, సార సవనాభోగంబులన్, సార=శ్రేష్ఠములగు, సవన=యజ్ఞములయొక్క, ఆభోగంబులన్=అతిశయములచేత, సద్విజస్తోమంబు=శ్రేష్ఠులయిన బ్రాహ్మణులయొక్క సముదాయము, ఎల్లెడన్, ఉల్లసిల్లన్, తగు, నీ...వంబు, నీ=నీయొక్క, శుద్ధ=పరిశుద్ధమగు, ఆశయ=అభిప్రాయముయొక్క, ప్రాభవము=అతిశయము, ఆమోదించునె=సంతోషించునా, విభవముల్=ఐశ్వర్యములు, సామజంబులున్=ఏనుఁగులును, హరుల్=గుఱ్ఱములును, సౌఖ్యా...నముల్ సౌఖ్యావహ=సౌఖ్యావహములగు, ఉత్=ఉన్నతములగు, యానముల్=వాహనములు, శేషముసమము.

చ. సరసతరుల్భవద్రచిత-సంతతజీవనలబ్ధవృద్ధులై।
పరగుచుఁబావనానుగతి-బర్విన యాత్మరజంబుదీరిపోఁ।
నిరుపమపర్వసత్వగతి-నిర్మలవృత్తివహింపనొప్పసీ।
ధరనుపపన్నగోరుసమ-దావలయానలసత్వమొప్పనే॥

పా॥ సరసతరుల్=దట్టములగు వృక్షములు, భవ...వృద్ధులై, భవత్=నీచేత, రచిత=చేయఁబడిన, సంతత=ఎడతెగని, జీవన=ఉదకముచేత, లబ్ధ=పొందఁబడిన, వృద్ధులై=వృద్ధికలదియయి, పరగుచున్=ఒప్పుచును. పావనానుగతిన్, పావన=వాయుసంబంధమగు, అనుగతిన్=సంపర్కముచేత, పర్విన=వ్యాపించిన, ఆత్మ=తమసంబంధమగు, రజంబు=పరాగము, తీరిపోన్=నిశ్శేషముగా పోవఁగా, నిరు...గతిన్, నిరుపమ=సామ్యములేని, పర్వ=కనుపులయొక్క, సత్వ=బలముయొక్క, గతిన్=పొందికచేతను, నిర్మలవృత్తిన్=నిర్మలమగు వ్యాపారమును, వహింపన్=పూనఁగా, ఒప్పు=ఒప్పునట్టి, నీధరన్=నీభూమియందు. ఉప...సత్వము, ఉపపన్నగ=పాములయొక్క సమీపమందలి, ఉరు=గొప్పదియగు, సమ=సమానమగు, దావ=అడవియందలి, లయ=లీనతగల, అనల=అగ్నులయొక్క, సత్వము=ఉనికి, * (అనఁగా లక్షణాచే పాములతోఁగూడిన యరణ్యమందు నగ్నులబాధ యణఁగిపోవుటయ మనర్థము క్లిష్టముగా సంపాదింపవలయును] ఒప్పునే=తగియుండునా?

సీత—సరసతరుల్=మిక్కిలిసరసులగువారు, భవ...వృద్ధులై, భవత్=నీచేత, రచిత=చేయఁబడిన, సంతత=ఎడతెగని, జీవన=వృత్తులచేతను, లబ్ధ=పొందఁబడినవృద్ధులై=వృద్ధిగలవారై, పావనానుగతిన్, పావన=పవిత్రులగువారియొక్క. అనుగతిన్=అనుసరించుటచేత, ఆత్మరజంబు=అంతఃకరణయందలి రజోగుణము, నిరు...గతిన్, నిరుపమ=ఉపమానములేని, పర్వ=పండువులయొక్క, సత్వ=ఉనికియొక్క, గతిన్=రీతిచేత, ఉపపన్న...సత్వము, ఉపపత్=ఉపపత్తితోఁగూడిన, నగ=చెట్లయొక్కయు (ఇదిమధ్యమపదలోపి

* ఈపాఠము బుస్తకాంతరములయందు విమర్శింపవలయును.

సమాసము] ఉరు=గొప్పదియగు, సమదావల=ఏనుఁగులతోఁగూడిన, యాన=వాహనములయొక్క, లసత్వము=ప్రకాశించుట, ఒప్పునే=తగియుండునా! అనగా తోటలు, ఏనుఁగులు, వాహనములుబాగుగనున్నవిగదా అనియర్థము, ఇది లక్కిన రాజ్యాంగాదుల క్షేమమునకుపలక్షణము.

క. అనవినివినయమునయముం
బెనగొననిటులనియెభూమి-భృత్పతికమలా
సనలలనాకరనళినాం
కనకనకశుకానులాప-ఘనతరఫణితిన్॥

టీక. అనన్=అనఁగా, భూమిభృత్పతి=భూధరశ్రేష్ఠుఁడు. విని=విని, వినయమున్=నమ్రతయు, నయమున్=నీతియు, పెనగొనన్=పెనివేసికోగా, కమలా...ఫణితిన్, కమలాసన=బ్రహ్మయొక్క, లలనా=స్త్రీయగుసరస్వతియొక్క, కరనళిన=హస్తపద్మమునను, అంకన=అలంకారమగు, కనక=బంగారువికారమగు, శుక=చిలుకయొక్క, అనులాప=వాక్యములయొక్క, ఘనతర=మిక్కిలిగొప్పదియగు, ఫణితిన్=రీతిచేతను, ఇటులు=ఈప్రకారము, అనియెన్=చెప్పెను.

శా. స్వామీమీరలపారచారుకరుణా-సారంబునన్ మామకా।
రామక్షోణిఁబదాబ్జముద్రికలొనర్పన్ నేఁడుగాసంపదల్।
సామస్త్యంబునమాకుఁజేకురునుదో-షంబుల్ కథాశేషముల్।
గామాస్కెన్ వెలసెన్ మహాసరసులన్-గాంభీర్యసంభారముల్।

టీ స్వామీ=ఓదేవరా, మీరలు=మీరు, అపా..బునన్, అపార=హద్దులేని, చారు=సుందరమగు, కరుణా=దయయొక్క, సారంబునన్=సారముచేత, మామ...క్షోణిన్, మామక=నాసంబంధమగు, ఆరామ=ఉద్యానవనముయొక్క, క్షోణిన్=భూమియందు, పదాబ్జముద్రికలు, పదాబ్జ=పాదపద్మములయొక్క, ముద్రికలు=ముద్రణలు, ఒనర్పన్=చేయఁగా, నేడుగా=ఈరోజునఁగదా, సంపదల్=ఐశ్వర్యములు, సామస్త్యంబునన్=

సమస్తత్వము చేత, నూకుక్ = మాకు, చేకురునః = లభించును, దోషంబుల్ = పాపముల్, కథాశేషముల్ గాక్ = కథలేమిగులుకలుగునట్లుగా, మాసెక్ = నశించెను, మహాసరసుక్ = గొప్పసరసులయందు, గాంభీర్యసంభారముల్ గాంభీర్యాతిశయములు, వెలసెక్ = ఒప్పెను.

క. సుమనస్సముదయమెల్లను।
భ్రమరహితమహాసవానుభవవిభవముచే।
నమరుచుఫలమీఁదొడఁగెను।
గములా ప్తసమానసీను-గరుణాపాసంగక్॥

టీ॥ కమలాప్తసమాన, సూర్యునితోసమానుఁడవగునో నారదుఁడా నీదు = నీసంబంధమగు, కరుణ = దయ, పాసంగక్ = అనుకూలించుటచేత సుమనస్సముదయమెల్లను, సుమనః = పుష్పములయొక్క, సముదయమెల్లను = సముదాయమంతయు, భ్రమ . విభవముచేక్, భ్రమర = తుమ్మెదలకు. హిత = ఇష్టమగు, మహత్ = గొప్పదియగు, ఆసవ = మకరందముయొక్క, అనుభవ = పొందుటయొక్క, విభవము చేక్ = విభవము చేత, అమరుచుక్ = ఒప్పుచు, ఫలము = పండ్లజాతిని, ఈఁదొడఁగెను = ఇయ్యనారంభించెను.

సీత॥ సుమనస్సముదయమెల్లను = దేవతా సముదాయమంతయు, భ్రమ విభవము చేక్, భ్రమ = భ్రాంతితోటి, రహిత = శూన్యమగు, మహత్ = గొప్పదియగు, సవ = యజ్ఞములయొక్క, అనుభవ = అనుభవించుటయొక్క, విభవము చేక్ = వైభవము చేత అమరుచు ఒప్పుచు, ఫలము = కోరికను, శేషము సమానము.

చ. సలలితతేజమీకొసఁగు-సత్కృతిసత్కృతిమీఁకుఁబొద్యమై।
చెలఁగినజీవనంబదియ-జీవనమాదరమోదరమ్యశ్రీ।
తలభవదీయదృష్ట్యమృతధారలయోగమెయోగమెన్నిటక్।
దలఁపయిమీపదాబ్జముల-ధారణాధారణసూరికోటికిక్॥

టీ॥ ఈపద్యమునందుసత్కృతిసత్కృతి, జీవనము జీవనము, యోగము యో

గము, ధారణధారణయని శబ్దార్థములకుఁ బౌనరుక్త్యమును దాత్పర్యమునకు భేదమును లక్షణముగలలాటానుప్రాసముండుటయే గాక రెండవశబ్దంబునకు వర్ణభేదముంగూడ స్ఫురించునట్లు కవిరచియించియున్నాఁడు ఎట్లనిన, సలలితతేజ, సలలిత=విలాసముతోఁగూడి, తేజ=తేజముగల యోశారదా, సూరికోటికిన్=విద్వత్సముదాయమునకు, మీకొసఁగు=మీకిచ్చునట్టి సత్కృతి=సత్కారము, సత్కృతి=సత్=యోగ్యమగు, కృతి=కార్యము, మీకుఁబాద్యమై=మీకుఁబాద్యార్హమై, చెలఁగిన=ఒప్పిన, జీవనంబు=ఉదకము, అదియ=అదే, జీవనము=ప్రాణము, ఆదర...యోగము, ఆదర=ఆదరముచేతను, మోద=సంతోషముచేతను, రమ్య=సుందరమును, శీతల=చల్లనిదియునగు భవదీయ=నీసంబంధమగు, దృష్టి=చూపనెడు, అమృతధారల=అమృతవర్షములయొక్క, యోగము=సంబంధము, యోగము=ఉచ్చ్రియదశ, ఎప్పుడున్=ఎన్నివిధములచేతనైన, తలపయిన్=శిరస్సుమీద, మీపదాబ్జముల=మీపాదపద్మములయొక్క, ధారణ=ధరించుట ధారణ=అష్టాంగయోగములలో నొకటి.

క. భాగవతతిలకనిభాయను|
రాగము మావంటికర్త-రక్తాత్ములపై|
నేగతిఫలియించెనొకో|
భాగీరథిపిచ్చుగుంటె-పయిఁబడుపగిదిన్||

క. వాసిదిభాగ్యము యోగ్యత|
వానిదివానిదిసుజ-న్మ-వైభవమిలనె|
వ్వానికిలిగాపదపంకజ|
పానీయముగోరిలఁగల్గు-భావజ్ఞనిధీ|

క. ఎచ్చటికిఁబోవుచునుమీ|
రిచ్చటికేతెంచిపూర్వ-కృతసుకృతమ్ముల్||

తచ్చసఫలింపఁజేసితి।
రచ్చెరువుగఁదెల్పవేద-యోరసజలధీ॥

స్పష్టము.

చ. అనవుఁడుమౌనిబల్కె-వినుమాయనుమానములేకలోకరం।
జనజనకాపురందరుని-సన్నిధికింజనియుంటినచ్చటం।
గనదచిరత్నరత్నపరి-కల్పితనిర్మలితప్రభన్సభన్।
దనరుసుధాశనేంద్రులను-దట్టితిముప్పదిమూఁడుకోటులన్॥

టీ॥ అనవుఁడున్=అనఁగా, మౌని=నారదుఁడు, పల్కెన్=చెప్పె
ను, లోక...జనకా, లోకరంజన=ప్రజారంజనమును జనకా, పుట్టించెడు
నోహిమవంతుఁడా, అనుమానములేక=సంశయములేకుండ, వినుమా=ఆక
ర్ణించుమా, పురందరుసన్నిధికిన్=ఇంద్రునిదగ్గఱకు, చని=వెళ్ళి, ఉంటిన్=
ఉంటిని, అచ్చటన్=అక్కడ. కనద...ప్రభన్, కనత్=ప్రకాశించుచు
న్న, అచిరత్న=నూత్నములగు, రత్న=రత్నములచేతను, పరికల్పిత=అలం
కరించఁబడిన, నిర్మలిత=నిర్మలమైచేయఁబడిన, ప్రభన్=కాంతిగల, సభన్=
సభయందు, తనరు=ఒప్పుచున్న, ముప్పదిమూఁడుకోటులన్=ముప్పదిమూ
డుకోట్లసంఖ్యగల, సుధాశనేంద్రులను=దేవతాశ్రేష్ఠులను, తట్టితిన్=సమీ
పించితిని.
సీత॥ లోకరంజన=లోకమును రంజింపజేయువాఁడా, జనకా=జనకమ
హారాజా.

చ. వసుమతిలోనయజ్ఞకృతి-వర్తిలఁబూర్వముమీరలందఱా।
రసితనశేషతంగొనఁగ-రాజిలిరావణుఁడంతచక్షుదుం।
ప్రబసభమునీశపూజగరి-మందనరింపనిజప్రియార్హాణం।
బెసఁగమిసూనవృత్తియగు-నేసతిపీడ్యదెజీవనంబునన్॥
ఈపద్యము రెండర్థములయందు బృహస్పతిదేవతలకుఁ జెప్పువాక్యము.

పా॥ వసుమతిలోఁ పలన్ = భూమిలోపలను, పూర్వము = పూర్వమందు యజ్ఞకృతిన్ = యజ్ఞముయొక్క, చేయడమందు, వర్తిలన్ = ప్రవర్తించఁగా మీరలందఱు = మీరందఱును. అరసితన్ = అ = ఆయజ్ఞసంబంధమయిన, రసితన్ = రసముకలుగుటను, అశేషతన్ = శేషములేకపోవుటచేత, కాంగన్ = పుచ్చుకొనఁగా. [ఇచట విచారించఁగా రసశబ్దముపై ఇని ప్రత్యయమున కపవాదముగా “ రసాదిభ్యశ్చ ” అను సూత్రము చే మతుప్ విధింపఁబడినది, కావున ఇని ప్రత్యయము వచ్చుట న్యాయముకాదు అయినను శ్లేష సలమగుటచేఁ గవులు కల్పించి సంపాదించి యీశబ్దమునిట్లుఁ బ్రయోగించినట్లు దోఁచుచున్నది. మఱియు బుధిమంతులు విచారింతురుగాక!] రాజిలి = ప్రకాశించి, రావణుఁడు = గాంభీర్యముచే, పెద్దధ్వనితో మాట్లాడునట్టి. దక్షుఁడు = దక్షప్రజాపతి, అంత = అంతట, ప్రసభమున్ బలాత్కారముగా, ఈశపూజ = ఈశ = గొప్పవారియొక్క, పూజ = పూజ, గరిమన్ = గొప్పతనముచేత. తనరింపన్ = చేయఁగా నిజ...ణంబు, నిజ = తనసంబంధియగు, ప్రియ = ప్రియుఁడైనశివునియొక్క, అర్ఘ్యణంబు = పూజను, ఎసఁగమిన్ = చేయకపోవుటచేత, సూనవృత్తియగు, సూన = మిక్కిలితక్కువనయగు, వృత్తియగు = వ్యాపారముగల. వీసతి = వీసతీదేవి, జీవనంబునన్ = ప్రాణముతోడ, వీడ్వదె న్ = విడనో?

సీత॥ వయసుమతిలోన్ = భూమిలో, నయజ్ఞకృతిన్ నయజ్ఞ = నీతితెలిసినవారియొక్క, కృతిన్ = వ్యాపారముచేత, వర్తిలన్, పూర్వము, మీరలందఱు। అరసి = చూచి, తనశేషతన్ = తనభృత్యత్వమును, కాంగన్, రాజిలి, దక్షుఁడు = సమర్థుఁడగు, రావణుఁడు, రావణానుసుఁగు, దీనికి వీడ్వదెన్ అను క్రియతో సంబంధము, అంతన్ = అంతట, ప్రసభమునీశపూజ, ప్రసభ = బలాత్కారముగా, మునీశ = మునీశ్వరునియొక్క, పూజ = పూజ, గరిమన్, తనరింపక, నిజప్రియార్ఘ్యణంబు, నిజ = తనసంబంధమగు, ప్రియ = ఇష్టమగు, అర్ఘ్యణంబు = పూజను, ఎసఁగమిన్ = చేయకపోవుటచేత, [అనఁగా వేదవతి రావణుని మునియగు నూహచేఁబూజించి యాతనికిష్టమగు మనోరథము దీర్చకుండుటచేతనని యర్థము] సూనవృత్తియగు, ఎధ వ్యాపారము

గల, [అనఁగాఁ దన్నుఁ జంపుటకయి జనించిన] ఏసతిన్ = ఏపతివ్రతను. జీవనంబునన్ = ఉదకమందును. వీడ్వడేన్ = వదిలెనో, హైపద్యముతోన న్వయము.

క. భాసిలునీసర్వంసహా।
  నాసతియామేనగర్భ-మందనిగురుఁడు।
  ల్లాసవికాసంబుననా।
  వాసవునకుఁదెలుపవింటి-వరసుగుణనిధీ॥

టీక. అర్థము — పాఠ్య — ఆసతి = అసతీదేవి, యీసర్వంసహన్, యీభూమియందు, ఆమేనగర్భమందు = ఆమేనకాదేవియొక్క గర్భమునందు (ఇది తెలుగుషష్ఠీసమాసము) భాసిలున్ = ప్రకాశించును, అని = అని, గురుఁడు = బృహస్పతి, ఉల్లాస,వికాసంబునన్ = ఉత్సాహముచేతనైన, ముఖప్రసన్నతచేత, ఆవాసవునకున్ = ఆయింద్రునకు, తెలుపన్ = చెప్పఁగా, వరసుగుణనిధీ = శ్రేష్ఠములగునుంచిసుగుణములకు స్థానమైన ఓహిమవంతుఁడా, వింటిన్ = వింటిని.

సీత. ఆసతి = ఆస్త్రీ ఆమేనన్ = ఆశరీరముతో, సర్వంసహన్ = భూమియందు, గర్భమందున్ = లోనిభాగమందు, భాసిలున్ = ప్రకాశించును, శేషముసమానము

గీ. కానసాచాననీపుత్త్రి-యగునిజంబు।
  సర్వమంగళజగదేక-జననియైన।
  యట్టిసతినీకుఁబట్టియై-పుట్టినంత।
  సకలసౌభాగ్యములునీకు-సంఘటిల్లు॥

టీ॥ పా. కాన్ = కనుక, ఆచాన = అత్రి, నీపుత్త్రియగున్ = నీకూఁతురగును, నిజంబు = సత్యము, జగదేకజననియైన = జగత్తులకు ఒక్కతెయగు తల్లియైన, అట్టిసతి = అట్టిపతివ్రతయైన, సర్వమంగళ = పార్వతీదేవి, నీకుఁబట్టియై = నీకూఁతురయి, పుట్టినంతన్ = పుట్టగానే, సకలసౌభాగ్యములు = అన్నియదృష్టములు, నీకుసంఘటిల్లును = నీకుకలుగును.

సీతా॥ సర్వమంగళ=సమస్తశుభములుఁగల, జగదేగజననిస్సైనట్టి=జగత్తుకుతల్లియైనఆపతివ్రత, శేషముసమానము,

సీ. సర్వసర్వంసహా-సర్వస్వనిర్వాహ,
ధూర్వహుండేవింట-మార్వియయ్యె!
నంభోధిరాడ్రత్న-డింభసంభృతహార,
హారియేవింటల-కోరియయ్యె!
బృందారకామంద-మందిరంబగుకాంచ,
నాద్రియేవింటసా-రాంశమయ్యె!
నంబరైకాలంబ-మైయాడుయాఁడుపు,
ఱమ్ములేవింటశ-రవ్యమయ్యె!
గీ. నహారహామునర్వాణీయమై-యజగవాఖ్య!
నలరునావిల్లుచేపట్టి-నట్టిదట్టు!
కసమసౌభాగ్యములఁమిరాఠి-నొపఁగమట్టి!
కన్నకనపస్యసామాన్య-మాన్యమతిని॥

పా॥ సర్వ . ధూర్వహుండు, సర్వ=సమస్తమైన, సర్వంసహా=భూమియొక్క, సర్వస్వ=సమస్తధనముయొక్కయనఁగా సమస్తభారములతోఁగూడినభూమియొక్కయనియర్థము నిర్వాహ=నిర్వహించుటయందు ధూర్వహుండు=భారమునువహించు శేషుఁడు, ఏవింటన్=ఏధనస్సునందు, మౌర్వియయ్యెన్=అల్లెత్రాడాయెనో, అంభోధి. హారి, అంభోధిరాట్=క్షీరసముద్రముయొక్క, రత్నడింభ=పిల్లవానివంటిరత్నముచేతను (కౌస్తుభమణిచేతననుట) సంభృత=కూర్పఁబడిన, హార=హారముచేత, హారి=మనోహరుఁడగు విష్ణువు, ఏవింటన్=ఏధనస్సునందు, లకోరియయ్యెన్= బాణమయ్యెనో, బృందార...మందిరంబు, బృందారక=దేవతలయొక్క. అమంద=గొప్పదియగు, మందిరంబు=గృహము అగు=అయినట్టి, కాంచనాద్రి=మేరుపర్వ

తము, ఏవింటన్ = ఏధనస్సునందు, సారాంశమయ్యెన్ = ముఖ్యభాగమయ్యె నో, అనగా వింటిబద్దయైయుండనుట, అంబరైకాలంబము, అంబర = ఆకాశమే, ఏక = ముఖ్యమైన, ఆలంబము = ఆధారముగలది, అయి, ఆడు = తిరుగుచుం డు = మూఁడుపురమ్ములు = త్రిపురములు, ఏవింటన్ = ఏధనస్సునందు, చర వ్యమయ్యెన్ = గురిమయ్యెనో, అహరహమున్ = ప్రతిదినమును, అర్హానీ యమై = పూజింపఁదగినదియై, అజగవాఖ్య అజగవమను పేరుచేతను, అలరు = ఒప్పుచున్న, ఆవిల్లు = ఆధనస్సును, చేపట్టినట్టినట్టికున్ = చేతఁబూ నినశివునికి, అనన్య...మతిని అనన్యసామాన్య = ఇతరులకుసాధారణముగాని, మతిని = బుద్ధిచేతను, అట్టికన్యకన్ = అట్టిగౌరీదేవి, అసమసౌభాగ్యములు = సమానములేనియదృష్టములు, మీఱన్ = అతిశయించునట్లుగా, ఒసఁగుము = ఇమ్ము.

సీతి॥ చేపట్టినట్టినట్టికు, చేతబూనినబలవంతునకు, అనగా ఎక్కుబెట్టి నవానికి శ్లేషముసమానము

క. ధారాళసుధారాశిసు।
ధారాలసమానసూక్తి-తతులముసీంద్రుం।
డీరీతిదెల్పితద్రచి।
తారాధనతృప్తుఁడై ర-యంబునజనియెన్॥

టీ॥ మునీంద్రుండు = మునిశ్రేష్ఠుఁడగు నారదుఁడు, ధారా ..తతులన్, ధారాళ = ధారారూపమును, సుధారాశి = అమృతసముద్రమును గలిసు = యోగ్యమగు, ధారా = ప్రవాహములవలె, లసమాన = ప్రకాశించుచున్న, సూక్తి = మంచిమాటలయొక్క, తతులన్ = సమూహమువను, ఈరీతిన్ = ఈప్రకారము చేత, తెల్పి = తెలియజేసి, తద్రచి ..తృప్తుఁడు, తత్ = ఆతనిచేత, రచిత = చేయఁబడిన, ఆరాధన = పూజచేతను, తృప్తుఁడై = తృప్తిహొందినవాఁడై, ర యంబునన్ = వేగముచేత. చనియెన్ = వెళ్ళెను.

క. అనిసూతజుండుపలుకన్।
వినిమదిముదమునయముంగ-విజ్ఞానకళా।

ఘనమానసుఁడగుశౌనక।
మునియుత్తరచరితమును గ-మునసిరిపురటన్॥

అతిసుస్పష్టము.

శా. లక్ష్మీపాదతలాంకకుంకుమకృతా-లంకారలంకారణా।
ట్టక్ష్మాకంపనకృద్ధనుర్గుణలతా-టంకారటంకారణా।
లక్ష్మాపన్నశరారియుద్యువతిఖే-లజ్జాలలజ్జాలసా।
త్పక్ష్మాక్షువ్రజసుందరీమదనచిం-తాపారతాపారతా॥

టీ॥ లక్ష్మీ..... లంకార- లక్ష్మీ=లక్ష్మీదేవియొక్క, పాదతల=పాదప్రదేశమునకు, అంక=చిహ్నముగు, కుంకుమ=కుంకుమచేతను, కృత=చేయఁబడిన, అలంకార=అలంకారముగలవాఁడా. లంకా...టంకార. లంకా=లంకాపట్టణమునందలి, రణ=యుద్ధమునందైన, అట్ట=బురుజులపై యుర్వియొక్క, క్ష్మా=భూమియొక్క, కంప=కంపనము, కృత్=చేయుచున్న, ధనుః=ధనుస్సుయొక్క, గుణలతా=తీగవంటి నారియొక్క, టంకార=ధ్వనివిశేషముకలవాఁడా [అనఁగా రామావతారమందీయన యొక్క ధనుష్టంకారము వినఁబడగానే లంకాపట్టణమందలి యుద్ధభూమిలోని అట్టళ్ళు బ్రద్దలువారిపోయెనని తాత్పర్యము] టంకారణా॥ లక్ష్మాపన్నశరారియుద్యువతిఖేలజ్జాల * * * * లజ్జాలసా.....తాపారతా. లజ్జా=లజ్జచేతను, అలసా=మందలగు, ఉత్పక్ష్మ=ఎత్తఁబడిన రెప్పలుగల, అక్షు=నేత్రములుగల, [అనఁగా నివ్వెరపోయి చూచుచున్న వారనుట] వ్రజసుందరి=గొల్లచేడియలయొక్క, మదన=కామముయొక్క, చింతా=విచారముచేతనైన అపార=హద్దులేని, తాప=తాపమందు, అరతి=ఇష్టములేనివాఁడా.

ప్రతిచరణార్ధవిపరివృత్తకందము.

ఘ్రాలాలక్ష్యలలామా।
సాలావిరసాపతాప-సారవిలాసా।

స్యాలాంగమంగళాస్యా।
శాలాపదసాధితాధి-సాదపలాశా॥

టీ. మాలాలక్ష్యలలామా — మాలా=మాలికారూపముగా, లక్ష్య=చూడఁదగిన, లలామా=అలంకారము గలవాఁడా, సాలా...విలాసా- సాల= [రలలకును భేదము చే సాం అనియగును] శ్రేష్ఠులయిన, అవిరస=విరసులు కానివారిని. అపహా=కొట్టివేయువారియొక్క — [అనఁగా సరసుల నిరాకరించువారనుట] అపసార=త్రోసివేయుటయందు, విలాస=విలాసముగలవాఁడా, స్యాలా...శాస్యా, స్యాలా=బావమఱఁదియగుచంద్రునియొక్క — అంగ=శరీరమువలె, మంగళ=శుభమయిన, ఆస్యా=ముఖము గలవాఁడా, శ్యాలా...పలాశా, శ్యాలా=పర్ణశాలలు, పద=స్థానము గలఋషులయొక్క, సాధిత=మనోవ్యధతోఁగూడుకొనుట చేతను, అధిసాద=పొందఁబడినవాశవముగల, పలాశా=రాక్షసులుగలవాఁడా (అనఁగా ఋషులు మనోవ్యధలతో కూడుకొన్నవారలగుటచేత వారి మనోవ్యధ తీర్చుటకయి విష్ణువు రాక్షసులను వశింపఁజేసెననుట)

ఉత్సాహము.

సింధురాజకన్యకావి-శీమకామమంథరా।
మంథరాద్రిమంథలబ్ధ-మణ్యుపేతకంధరా।
కంధరావళీసమాన-కమ్రకాంతిబంధురా।
బంధురారచక్రచక్ర-పాలితాగ్ర్యసింధురా॥

టీ సింధు...మంథరా, సింధురాజకన్యకా=లక్ష్మీదేవియందు, విశీమ=హద్దులేని, కామ=కోరిక చేతను, మంథరా=మందమైనవాఁడా, మంథరాద్రి.. కంధరా, మంధరాద్రి=మంథరపర్వతము చేతను, మంథ=మథించుట చేత, లబ్ధ=పొందఁబడిన, మణి=కౌస్తుభమణితోడ, ఉపేత=కూడుకొనిన, కంధరా=కంఠముగలవాఁడా. కంధరా...బంధురా. కంధర=మేఘము

లయొక్క, ఆవళీ=పఙ్క్తితోడను, సమాన=తుల్యమగు, క్రమ=మనోహరమగు, కాంతి=కాంతిచేతను, బంధురా=అతిశయమయినవాఁడా. బంధురార..సింధురా. బంధుర=దట్టమగు, అర=అంచులయొక్క, చక్ర=సమూహముగల. చక్ర=సుదర్శనముచేత, పాలిత=ఏలఁబడిన, అగ్ర్య=శ్రేష్ఠమగు, సింధురా=ఏనుఁగుగలవాఁడా.

పంచచామరము.

పరాపరార్థవేదిభావ-భావనైకగోచరా।
చరాచరాత్తభూతభూత-జాతదేహభాసురా।
సురాసురాధిరాజవంద్య-సుందరాధరాధరా।
ధరాధరాధరీక్రియాని-దానధైర్యతత్పరా॥

టీ॥ పరాపరా.....గోచరా. పరాపరా=వ్యక్తావ్యక్తములయిన అర్థ=వస్తువులను, వేది=తెలిసినమునులయొక్క, భావ=భావమందలి, భావనా=ధ్యానమునకు, ఏక=ముఖ్యముగా, గోచరా=తెలియువాఁడా. చరాచరా.....భాసురా. చరాచర=జంగమస్థావరములకు, ఆత్తభూత=ఆత్తయగు భూత=భూతములయొక్క, జాత=సమూహమనియెడు, దేహ=దేహముచేతను, భాసురా=ప్రకాశించుచున్నవాఁడా. సురాసురా...వంద్య. సురాసుర=దేవతలయొక్కయు రాక్షసులయొక్కయు, అధిరాజ=అధిపతులకు, వంద్య=నమస్కరింపఁదగినవాఁడా, సుందరా=సుందరుఁడా. ధరాధరా=భూమికి ధరించినవాఁడా. ధరాధరా.....తత్పరా. ధరాధరా=పర్వతముయొక్క, అధరీక్రియ=క్రిందుగాఁజేయుటకు, నిదాన=ఆదికారణమగు, ధైర్య=ధైర్యముచేత, తత్పరా=ప్రసిద్ధుఁడగువాఁడా.

గద్య — ఇది సర్వతంత్రస్వతంత్ర సకలభాషావిశేష కవితాధురంధర ప్రతి
దినప్రబంధ పరమేశ్వర శ్లేషయమకచక్రవర్తి బిరుదాంకితులును
కల్యపట్టణ శ్రీనివాసతాతాచార్య తనయ శ్రీమదప్పయాచార్య
దీక్షితసుత పితృవ్య శ్రీనివాసాచార్య కృపాకటాక్షులబ్ధ సక
లపాండిత్య తర్కాలంకార వాగీశ్వర బిరుదాంకిత వేం
కటాచార్య ప్రణీతంబయిన యచలాత్మజా
పరిణయంబను శ్లేషప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

---

# అచలాత్మజాపరిణయము.

## ద్వ్యర్థిప్రబంధము.

### ద్వితీయాశ్వాసము.

---

క. కాసారమహీసారని।
వాసాదిమునీంద్రహృదయ-వారిజరచితా।
శ్రీసారసవాసావర।
హాసాదివిలాసవేంక-టాచలవాసా॥

టీ. కాసార...శ్రీ, కాసార=సరస్సులయొక్క, మహీ=భూముల యందు, సార=శ్రేష్ఠములు, నివాస=ఉనికిగల, ఆది=మొదటివారగు, మునీంద్ర=మునిశ్రేష్ఠులయొక్క, హృదయవారిజ = మనఃపద్మములచేతను, రచిత=చేయఁబడిన, శ్రీ=శోభగలవాఁడా, సారసవాసా...విలాసా, సారసవాసా=లక్ష్మీదేవియొక్క, పరిహాసాది = పరిహాసము మొదలుగాఁగల, విలాస=విలాసములు గలవాఁడా, వేంకటాచలవాసా = తిరుమలయందు నివాసముగలవాఁడా.

ఆ. అవధరింపవయ్య-యఖిలకథాభిధా।
నాతతనయుఁడంత-సూతతనయుఁ।
డనియెశౌనకునకు-నరవిందబృందస।
న్మధురసోపమాన-మధురసూక్తి॥

టీ॥ అవధరింపవయ్యా=చిత్తగించవయ్యా, అంత=అంతట, అఖిల . న యుఁడు అఖిలకథా=సమస్తచరిత్రలయొక్కయు, అభిధా=చెప్పుటచేత, ఆతత=విస్తారముగు, నయుఁడు=నీతిగల, సూతతనయుఁడు=సూతునికుమారుఁడగు ఉగ్రశ్రవుఁడు, శౌనకునకున్=శౌనకమునికి, అరవింద సూక్తిన్. అరవింద=పద్మములయొక్క, బృంద=సమూహముయొక్క, సత్=యోగ్యమగు, మధుర=మకరందరసము, ఉపమాన=సామ్యముగల, మధుర=తియ్యనగు, సూక్తిన్=మంచిమాటచేతను, అనియెన్=చెప్పెను.

క. సురమహిమాఢ్యుఁడతండట।
సురమునినంపించియంత-సుదృగావళితోఁ।
నరసియుపవనమునందా।
సరసవనవిహారమునకు-సంకల్పించెన్॥

తా॥ సురమహిమాఢ్యుఁడు. సురమ=మంచిశోభగల, హిమ=మంచుతోడ, ఆఢ్యుఁడు=కూడుకొన్న, అతండు=ఆహిమవంతుఁడు, అటు=ఆప్రకారము, సురమునిన్=నారదమహామునిని, అంపించి=పంపించి, అంత=అంతట, సుదృగావళితోన్ సుదృక్=స్త్రీలయొక్క, ఆవళితోన్=పఙ్క్తితో, అరసి=చూచి, ఉపవనమునందు=ఉద్యానమునందు, ఆసరసన్=ఆదగ్గఱ, వనవిహారమునకున్=వనవిహారము జేయుటకు, సంకల్పించెన్=ఉద్దేశించెను

సీత॥ సురమహిమాఢ్యుఁడు=దేవతామహిమతోఁగూడిని, అతండు=ఆజనకుఁడు, సుదృగావళితోన్, సుదృక్=విద్వాంసులయొక్క, ఆవళి

తోన్ = పక్షులతో, అసరసవనవిహారమునకున్ అసర = అంతటవ్యాపించెడు, సవన = యజ్ఞముయొక్క, విహారమునకున్ = చేయుటకు, సంకల్పించెన్ = సంకల్పమును జేసెను.

ఆ. సూత్రపట్టినట్టు-శోభిల్లునాభూమి।
నప్సరస్సులింత-యంతటమర।
నతివిహారకౢప్తి-నాయాజనులొనర్ప
నద్రిరేంద్రుఁడంత-హర్షమొందె॥

పా॥ సూత్రపట్టినట్టు = సూత్రముపట్టినట్లుగా, శోభిల్లు = ప్రకాశించుచున్న, ఆభూమిన్ = ఆభూమియందు, అప్సరస్సులు = అప్సరస్త్రీలు, ఇంతటంతటన్ = ఇక్కడక్కడ, అమరన్ = ఒప్పునట్లుగా, అతివిహారకౢప్తిన్. అతివిహార అత్యంతక్రీడలయొక్క, కౢప్తిన్ = రచనను, ఆయాజనులు = ఆయామనుష్యులు, ఒనర్పన్ = చేయఁగా, అద్రిరేంద్రుఁడు = ఆపర్వతరాజు, అంతన్ = అంతట, హర్షమొందెన్ = సంతోషించెను-

సీత॥ అప్సరస్సులు = ఉదకసరస్సులు, అతివిహారకౢప్తిన్. అతివిహార = అత్యంతమయినయజ్ఞక్రియలయొక్క, కౢప్తిన్ = రచనను, ఆ = అట్టి, యాజలు = ఋత్విక్కులు, ఒనర్పన్ = చేయఁగా, అద్రిరేంద్రుఁడు = ఆరాజు, శేషము సమానము

క ఆయనయాజ్ఞానుసృతిన్।
డాయుచునాగరమణుల్ జ-డతఁదొలఁగంగా।
నాయతనవసుధనాగటి।
చాయనుఋషభమ్ములమర-సవరించుతరిన్॥

పా॥ ఆయన = ఆహిమవంతునియొక్క, ఆజ్ఞానుసృతిన్ = సెలవుప్రకారము, డాయుచున్ = సమీపించుచు, నాగరమణుల్ = నాగ = పర్వతముల సంబంధులగు, రమణుల్ = స్త్రీలు, జడత = మాంద్యము, తొలఁగంగాన్ =

టీ॥ ఆయ...సుధన్ ఆయత=విస్తారమయిన, నవ=నూతనమైన, సుధన్=అమృతమును ఆగాటి=ఆగునట్టి, (ఇచటనింతకంటె వేరుగనర్థముతోచదు. ఈయర్థమున నీశబ్దముగ్రామ్యము గానున్నది కవితాత్పర్యమేమో తెలియకున్నది.) చాయను=నీడచేత, ఋషభమ్ములు=ఓషధివిశేషములు, అమరన్=ఒప్పారట్లుగా, సవరించుతఱిన్= తీరుచున్న సమయమందు, పర్వతములస్త్రీలు అమృతపానముచేఁ గలిగినంతయానందమునుగలిగించు నీడలుంగలుగునట్లుగాదీపపొదలు చక్కగానిటునటు సవరించుచున్నారనితాత్పర్యము.

సీత॥ ఆయన=ఆజనకునియొక్క, యాజ్ఞాని స్యందన్ = యాజ్ఞ=యజ్ఞసంబంధియగు, అనుస్మృతిన్=అనుసరణముచేత, నాగరమణుల్=పట్టణపుజనులలో శ్రేష్ఠులు, ఆయతనవసుధన్=ఆయతన=యజ్ఞశాలలయొక్క వసుధన్=భూమియందు, నాగటిచాయను. నాగటి=నాగటియొక్క, చాయను= వెంబడిని, ఋషభమ్ములు=ఎద్దులు, అమరన్=ఒప్పునట్లు, సవరించుతఱిన్ = కూర్చసమయమున

క ఉన్మదనమితాస్త్రంబుల।
సన్మహిమనరుల్ భయప్ర-సంగంబునమీ।
ర న్నేటియతఁడువిహరిం।
ప న్మహిలసమానగర్భ-భాసురయయ్యెన్॥

టీ॥ ఉన్మ..మహిమన్. ఉత్=ఉన్నతములైన, మదన=మన్మథునియొక్క, మిత=పరిమితములైన. అస్త్రంబుల=ఆయుధములయొక్క, సన్మహిమన్=గొప్పదార్ఢ్యముచేత, భయప్రసంగంబునమీరన్=భయసంబంధముచేనొప్పఁగా, మన్మథుఁడుకొద్దిబాణములు వేసినను [అనగా మన్మథుఁడులోకమునవిజృంభించియున్నాఁడనితాత్పర్యము] మేటి=గొప్పవాఁడగు, అతఁడు ఆహిమవంతుఁడు, విహరింపన్=ఆ విహారముఁ జేయఁగా, మహిల=ఆయున భార్యయగుమేనక, సమానగర్భ భాసుర=తగిన గర్భముచేఁ బ్రకాశించుచున్నది, అయ్యెన్-

సీ॥ ఉన్మద...మహిమన్. ఉన్మద=ఉద్రేకించినట్టి. నమిత=మితములేని ఇచటనర్థముగలశబ్దమునకు సుప్సుపా అనుయోగవిభాగముచేత సమాసము గావుననలోపములేదు అస్త్రంబులన్=ఆయుధములయొక్క. సన్మహిమన్ గొప్పసామర్థ్యముచేత, అరుల్=శత్రువులు, విహరింపన్=యజ్ఞప్రయత్నముఁ జేయఁగా. మహీ=భూమి, లసమాన గర్భభాసురయయ్యెన్=ప్రకాశించుచున్న గర్భముచేఁబ్రకాశించుచున్నదియాయెను

ఉ. కాంతారక్షితిమంజులాంగలసదు-త్కర్షంబునన్ భూమిభృ।
త్కాంతుండంతమహావిహారమలరం-గన్యాగమాకాంక్షన।
త్యంతంబాపఁగఁదోఁచెనమ్మహిలస-ద్గర్భంబునన్ భృంగసం।
క్రాంతాంభోజమనంగమందసముద-గ్రచ్ఛాయలింపారఁగన్.

టీ॥ కాంతారక్షితిన్ = అరణ్యభూమియందు, మంజు...త్కర్షంబునన్. మంజుల=మృదువగు, అంగ=అవయవములయొక్క, లసత్=ప్రకాశించుచున్న, ఉత్కర్షంబునన్=అతిశయముచేత, భూమిభృత్కాంతుండు=పర్వతరాజు, అంత=ఆసమయమందు. మహావిహారము=గొప్ప వనవిహారము, అలరన్=ఒప్పఁగా, కన్యాగమాకాంక్షన్=స్త్రీసంభోగ మందలికోరిక్కను, అత్యంతంబాపఁగ=మిక్కిలియాప్పఁజేయఁగా, అమ్మహిల=ఆమేనక, సద్గర్భంబునన్=మంచిగర్భోత్పత్తిచేత, భృంగసంక్రాంతాంభోజమనంగన్ = తుమ్మెదలచేత వ్యాప్తమగు పద్మమో యనునట్లు మంద...చ్ఛాయలు మంద=మెల్లగా, సముదగ్ర = ఉన్నతములగుచున్న, ఛాయలు=కాంతులు, ఇంపారఁగన్=శోభిల్లఁగా, దోఁచెన్=కాన్పించెను.

సీత॥ మంజు ..త్కర్షంబునన్. మంజు=తిన్ననైన, లాంగల=నాగటియొక్క, సత్=మంచిదియగు, ఉత్=ఉన్నతమగు, కర్షంబునన్=దున్నడముచేత, భూమిభృత్కాంతుండు=రాజశ్రేష్ఠుఁడగుజనకుఁడు మహావిహారమలరంగన్=గొప్పయజ్ఞప్రయత్నమొప్పఁగా, యాగము=యజ్ఞము, అత్యంతంబాపఁగ = మిక్కిలి నిలుపఁగా, అమ్మహి = ఆభూమియొక్క

లసద్గర్భంబునన్=ప్రకాశించుచున్న లోనిప్రదేశమందు, భృంగసంక్రాంతాంభోజమునట్టుగా, మందసము=పెద్దపెట్టె, ఉదగ్రచ్ఛాయలన్=గొప్పకాంతులు, ఇంపారఁగన్=మనోహరముగానుండఁగా, తోఁచెన్=కాన్పించెను

వ. అంతే॥

శా. కప్పుల్ వీడ్కొనభూధరేంద్రములసౌ-కర్యంబున న్మించుచోఁ
దప్పెంగాంతపయోధరమ్ములు కన-ద్ధారావతారమ్ము పై
నుప్పొంగెం జెలువారు ని ర్మలతస-ద్యోమధ్యభాగంబునం
దొప్పెన్ హంసగతుల్ ప్రియంకరశరద్యోగంబు రానంతలోన్

పా॥ కాంత=మేనకయొక్క, పయోధరమ్ములు=స్తనములు, కప్పుల్=వలువులు, వీడ్కొనన్=చూడఁగా, భూధరేంద్రముల=పర్వతశ్రేష్ఠములయొక్క, సౌకర్యంబునన్=సౌలభ్యముచేత, [అనఁగా సౌందర్యముచేత] మించుచోన్=అతిశయించుచుండఁగా, చూచుకములు నలుపెక్కి కొండల సౌందర్యమును మీరుచుండఁగా నని తాత్పర్యము కనద్ధారావతారమ్ము=కనత్=ప్రకాశించుచున్న, హార=ముత్తెపుసరులయొక్క, అవతారమ్ము=ప్రదేశము, పైన్=మీఁద, తప్పెన్=వదలిపోయెను. గర్భిణియౌటచేత హారాద్యలంకారములు తీసివేసినదనుట, చెలువారు=శోభిల్లుచున్న, నిర్మలత=నైర్మల్యము. సద్యోమధ్యభాగంబునందన్ = అప్పటి నడుమునందు, ఉప్పొంగెన్=అతిశయించెను. నడుము బలిసినదనుట హంసగతుల్=అంచలవంటినడకలు, ఒప్పెన్=తగెను, నడకలు మందమైనవనుట. అంతలోన్=ఈలాగునున్నంతట శరద్యోగంబు=శరదృతుసంబంధము, రాన్=రాఁగా, పైపద్యముతో నన్వయము.

సీత॥ అంతలోఁ బ్రియంకరశరద్యోగంబు రాఁగా. కాంతపయోధరమ్ములు సుందరములగు మేఘములు=కప్పుల్=క్రమ్ముటలు, వీడ్కొనన్=తప్పఁగా, భూధరేంద్రములన్=పర్వతశ్రేష్ఠములయందు, సౌకర్యంబునన్=సులభ

త్వముచేత. మించునోక్-మీరిపోవునప్పుడు, కనద్ధారావతారమ్ము=ప్రకాశిం చుచున్న వర్షధారలప్రవేశము పైక్=మీద, (అనంగాభూమిపైని, తప్పైక్ మేఘములు పర్వతములపై గమ్ముట లేక కాన్పించకుండుటచేత వర్షధారలుప డుటలేదనితాత్పర్యము సద్ద్యోమధ్యభాగంబునక్=సత్=మంచిదియగు, ద్యో=ఆకాశముయొక్క, మధ్యభాగంబునక్=మధ్యప్రదేశమందు. చెలు వారునిర్మలత=సొగసైననైర్మల్యము, ఉజ్జ్వలగెక్ హంసగతుల్=హంస లనడకలు, ఒప్పెక్-ప్రకాశించెను, శరదృతువునందు హంసలుసంతోషిం చుండును

సీ. భ్రమరీకదంబసం-భ్రమరీణగరుదద,
భ్రమరీచిమలినస-త్పంకజంబు।
ప్రపదలీభవద్భ్రమ-కదలీమహీజసం,
పదలీనకిర్మీర-పాండురంబు।
కమలాకరాదర్శ-విమలాయితసమస్త,
కమలాకరవ్రాత-ఖస్థలంబు।
ధవళాయితమృణాల-లవలానవక్రియా,
ధవలాలసమరాళ-రాజకంబు।
గీ. అంబరశ్రీనితంబబిం-బావలంబి।
పాండుతరపట్టసిచయసి-ఖండవిభ్రమ।
మభ్రమకరభ్రమదఖండ-శుభ్రజలద।
భాసురంబొప్పె నాశర-ద్వాసరంబు॥

టీ॥ భ్రమరీ..పంకజంబు భ్రమరీ=ఆడు తుమ్మెదలయొక్క, కదంబ=సమూహముయొక్క, సంభ్రమ=త్వరవలన, రీణ=జారిన, (అనగ కసలన్ట్టి) గరుత్=రెక్కలయొక్క, అదభ్ర=తెక్కువగాని, మరీచి=కిరణములచేత,

మలిన=నల్లనయిన, పంకజంబు=పద్మములు గలది, ప్రవలీ ..పాండురంబు. ప్రదళీభవత్=బ్రద్దలగుచున్న, భర్మకదళీమహీజ=బంగారపు అరఁటిచెట్లయొక్క, [అరఁగాఁగ కర్పూరపుటరఁటులయొక్క] సంపత్=సమూహముయొక్క, అలీన=అణఁగనట్టి. కర్పూర=కప్పురము చేత, పాండురంబు=తెల్లనిది. కమలా . ఖసలంబు. కమలా=శోభను, కర=చేయునట్టి, ఆదర్శ=అద్దములవలె, విమలాయిత=నిర్మలములైయాచరించుచున్న. సమస్త=శేషములేని. కమలాకర=ఉదకమునకు గనులగు మేఘములుగల, ఖస్థలంబు=ఆకాశస్థలము గలది. ధవళా . రాజికంబు. ధవళాయిత=తెల్లనై యాచరించుచున్న, మృణాళ=తామర తూండ్లయొక్క, లవ=ముక్కలయొక్క, లావణ్యశ్రియా=త్రుంచుటయందలి, ఆగ్జన = తిన్నదనమందు, లాలస = ఆసక్తములగు, మరాళరాజికంబు = హంసపక్షులుగలది అంబర...భాసురంబు. అంబరశ్రీ = ఆకాశలక్ష్మియొక్క, నితంబబింబ = పిరుదును, అవలంబి = పట్టుకొనిన, పాండురతర = మిక్కిలి తెల్లనైన, పట్టపిచయ = పట్టుబట్టలయొక్క, శిఖండ = అంచులయొక్క, విభ్రమ = విలాసముల యొక్క, భ్రమకర = భ్రాంతిని జేయుచున్న, భ్రమత్ = తిరుగుచున్న, అఖండ = విస్తారమగు, శుభ్రజలద = తెల్లమేఘములచేత, భాసురంబు = ప్రకాశించుచున్నదయై, ఆశరద్వాసరంబు = ఆశరత్కాలదినము, ఒప్పెన్ = తగెను

చ. పొలిచెను యజ్ఞకృద్విసర-ముల్ సరముల్ నవపుండరీకప
క్షులగదళీవ్రజంబు మడుగుల్ మడుగుల్ హిమవాలుకాప్తిప
త్రిఁగ వనజాతమందుఁదన-రెన్నవమాలికలంచబాలికల్।
లలిసుమనస్స్థితుల్ నెలఁత-లన్ లతలందళుకొత్తెనత్తఱిన్॥

టీ॥ అత్తఱిన్=ఆశరదృతువునందు, యజ్ఞకృద్విసరముల్. యజ్ఞకృత్=జన్నములు జేసినవారియొక్క, విసరముల్=సమూహములును, సరముల్=పువ్వులదండలును. పుండరీక=వెల్లగొడుగులయొక్కయు, తెల్లపద్మములయొక్కయు, పక్షులన్=వయసులచేత, పొలిచెన్=ప్రకాశించెను, కదళీ...మ

డుగుల్ కదళీ=కప్పురపుటంటులయొక్క, వ్రజంబు = గుంపుయొక్క. మడుగుల్ = పరిశుభ్రతలును, మడుగుల్ = సరస్సులును, హిమవాలుకాప్తిన్. హిమవాలుకా = కర్పూరముయొక్కయు, చల్లనియిసుకయొక్కయు, ఆప్తిన్ = పొందుటచేత, వర్తిలెన్ = ప్రవర్తించెను, ఉన్నవియనుట. వనజాతమందున్ - వన = అడవులయొక్కయు, నీళ్ళయొక్కయు, జాతమందున్ = సమూహమందు. నవమాలికలు = క్రొత్తపూదండలును, అంచబాలికల్ = హంసపిల్లలును, తనరెన్ = ఒప్పెను, లలిన్ = సొగసుగా, సుమనస్స్థితుల్ - సుమనః = మంచి మనస్సులయొక్కయు, పుష్పములయొక్కయు, స్థితుల్ = ఉండుటలు, నెలంతలన్ = స్త్రీలయందును, లతలన్ = తీగలయందును, తఱుకొత్తెన్ = ప్రకాశించెను-

మ. నవఖండంబులనుండు వార్షికగతిం-దంభోళిసంఛిన్నయౌ|
నవనింబద్ధముసేయమేల్కని సరో-జాక్షుండు నేమింపనా|
ర్జవితంద్త్వష్టఘటింపనింపెసఁగుపెన్-రౌప్యంపుటుత్కీలకా
ళివలెన్ధారుణినచ్చటచ్చటమరా-ళీపాళివ్రాలెన్వడిన్||

టీ| నవఖండంబులనుండన్ = మునుపే తొమ్మిదితుక్కలతో నుండఁగా, వార్షికగతిన్ = వర్షాకాలసంబంధియగునడకచేత, దంభోళిసంఛిన్న = పిడుగులచేఁ బద్దలైనది యౌ = అయినట్టి అవనిన్ = భూమిని, బదముసేయన్ అదుకుటకు, సరోజాక్షుండు = విష్ణువు, మేల్కని = నిద్రనుండి లేచి. నేమింపన్ = ఆజ్ఞాపింపఁగా, ఆర్జవితన్ = పిన్నదనముచేత, త్వష్ట = విశ్వకర్త, ఘటింపన్ = అతుకుటకు, ఇంపెసఁగు = మనోహరములయిన, పెన్ = పెద్దదియగు. రౌప్యంపు = వెండియొక్క, ఉత్కీలకాళివలెన్ = టంకపుపొదుల గుంపువలె, ధారుణిన్ = భూమియందు, మరాళీపాళి = ఆడుహంసలపఙ్క్తి, వడిన్ = త్వరచేత, అచ్చటచ్చటన్ = అక్కడక్కడ, వ్రాలెన్ = దిగెను

చ సరసులకొప్పెఁబద్మినుల-సంగతిహస్తినులాక్రమింపఁగా|
సరసతరుల్సుగంధికర-జస్స్ఫురధీరతరూఢిపట్టిరా|

సరసతముల్ కళోన్నతుల-సంగతిఁ జిత్రిణులాటఁ దేటగాఁ।
బరఁగెనుగానఁ గానలకు-బర్వెవెజాతులరీతుల త్తఱిన్॥

టీ॥ సరసులకున్ = రసయుక్తులైనవారికని యర్థము, కొలఁకులకని యర్థాంతరము. పద్మినులసంగతి = పద్మినీజాతిస్త్రీలతోస్నేహమని యర్థము తామరపొదలకలయిక యని యర్థాంతరము సరసతరుల్ = మిక్కిలిసరసులని యర్థము. సరసముతోఁ గూడినవృక్షములని యర్థాంతరము. హస్తినులు = హస్తినీజాతిస్త్రీలని యర్థము. ఆడేనుఁగులని యర్థాంతరము. ఆక్రమింపఁగాన్=ఆవరింపఁగా, సుగంధి ..ధీరతన్. సుగంధి=మంచి వాసనగల, కరజ=గోరులయొక్క, సిర=సిరమైన, ధీరతన్=ధైర్యము చేతనని యర్థము. అనఁగా నఖక్షతములనుంచుటచేతనైన ధైర్యమని తాత్పర్యము సుగంధిక=మంచివాసనగల, రజః=పరాగములచేత, సిరి=నిబ్బరమగు, ధీరతన్=మనోహరత్వము చేత, (ధియంరాతీతిధీరః- తస్యభావఃధీరతా.) యూథిఁబట్టిరి=నియూథిగవహించిరి. [ఇచట వృక్షపక్షమందు మహాదరిక్రియఁ చింత్యము] ఆసరసతముల్=సరసతరులకంటె మిక్కిలిసరసులని యర్థము సరసములగు రాత్రులని భావము కళోన్నతుల-కళా=మన్మథకళలయొక్క, ఉన్నతుల=ఔన్నత్యములయొక్క అని యర్థము చంద్రకళలయౌన్నత్యముయొక్క యని యర్థాంతరము చిత్రిణులాట=చిత్రిణీజాతిస్త్రీలాటయని యర్థము. చిత్రముగలవియాటయని యర్థాంతరము. తేటగాన్=స్పష్టముగా, పరగెనుగాన=ఒప్పెనుగనుక, కానలకున్=అడవులకు, అత్తఱిన్=ఆశరదృతువునందు, జాతుల=పద్మిన్యాదిస్త్రీజాతులయొక్క యని యర్థము, మాలతీలతల యొక్కయని యర్థాంతరము. రీతులు=పద్ధతులు, పర్వె=వ్యాపింపవా.

ఉ. కావలికాపుగుబ్బెతల-కన్నరపించిబిరానరాజనా।
లైవిలసిల్లువెల్లువను-లంకుఁబడుందొలఁగుంగిశోరకీ।
రావళియభ్రలక్ష్మిశరి-దంగనసద్రవిలక్షణాన్వితల్।
గాపుసద్రావిడాంగనల-కైవడిఁజెండులుగొట్టిరోయనన్॥

టీ॥ కావలికాపుగుబ్బెతల = కాపున్న శూద్రస్త్రీలయొక్క, కన్ = చూపు, మరపించి = మఱుగుపెట్టి, బిరాన = త్వరగా, రాజనాలై విలసిల్లు = రాజనపుచేలై ప్రకాశించునట్టి పెల్లువనులందున్ = గొప్పవనములయందు, కిశోరకీరావళి = పిల్లచిలుకలగుంపు, అభ్రలక్ష్మి = ఆకాశలక్ష్మియును, శరదంగన = శరదృతువను స్త్రీయును, సద్రవిలక్షణాన్వితల్ — సత్ = యోగ్యమగు, ద్రవిల = లడలకభేదముచే ద్రవిడులయొక్క, క్షణ = ఉత్సవముతోడ, అన్వితల్ = కూడినవారు అనియర్థము. సత్ = యోగ్యమగు, రవి = సూర్యుఁడనెడు, లక్షణ = చిహ్నముతో, అన్వితల్ = కూడినవారు, కావున్ = కనుక, ద్రావిడాంగనలకైవడిన్ = ద్రవిడస్త్రీలవలె, చెండులుగొట్టిరోయన్ = బంతులుగొట్టినారోయనునట్లుగా, పడున్ = ఉరుకును, లోలఁగున్ = ఎగిరిపోవును.

మ. కమలేందీవరకర్ణికారకదళీ-కల్హారపుంజల్కపుం
జములం జిత్రమొనర్చికూర్చుచుశర-చ్చంద్రాస్య పెన్భూమిపా
త్రమునందున్నభమంటునంబరమణీ-లీలామణీదీపముం
చి మధుద్వేషికి నెత్తుటారతి ఘటిం-చెన్ నిద్రమేల్కాంచుచోన్

టీ॥ శరచ్చంద్రాస్య = శరత్కాలమను స్త్రీ. కమలేం .. పుంజములన్ = కమల = పద్మములయొక్కయు, ఇందీవర = కలువలయొక్కయు, కర్ణికార = కొండగోగుపువ్వులయొక్కయు, కదళీ = అరంటిపువ్వులయొక్కయు, కల్హార = ఎఱ్ఱగలువలయొక్కయు, కింజల్క = కేసరములయొక్క, పుంజములన్ = సమూహములచేత, చిత్రమొనర్చి = [ముగ్గులుబెట్టినట్లు] చిత్రవర్ణముగలదానిఁగాఁ జేసి, కూర్చుచున్ = సంధానముఁజేయుచు. పెన్భూమిపాత్రమునందున్ = పెద్దదియగు పుడమియనెడుపాత్రమునందు. నభమంటి = ఆకాశమునంటిన, అంబర . దీపము = అంబరమణీ = సూర్యుఁడనెడు, లీలా = విలాసార్థమగు, మణీదీపము = మాణిక్యదీపమును, ఉంచి = యేర్పరచి, మధుద్వేషికిన్ = విష్ణుమూర్తికి. మేల్కాంచుచోన్ = (శరదృతువు గావున) నిద్రలేచునపుడు, ఎత్తుటారతి = పైకెత్తువారతి, ఘటించెన్ = కూర్చెను

సీ. మల్లికారమణీమ-తల్లికాస్మితములు,
శరదభ్రిముధవాంగ-చారురుచులు।
భవుకప్రబోధమా-ధవలోచనచ్ఛవుల్,
కాండనిర్మలతార్థ-కతకరజము।
లుద్భవిష్యత్పంక-జోదారచకచకల్,
బహులనదీవిరహాతి-పాండురుచులు।
భువనమోహనరతి-ధవకీర్ణభసితముల్,
దిక్కామినీక్షౌమ-ధృతివిహృతులు।

గీ. నీలనీరదనిజయాన-నిర్మలీక।
రణచణపురందరకృతాంగ-రాగధవళ।
రంజకద్రవకచ్ఛాయ-పుంజకములు।
కపురపురజంబులువనాళి-గరిమనెరసె॥

టీ॥ మల్లి...స్మితములు=మల్లికా=మల్లితీగలనెడు, రమణీమతల్లికా=ఉత్తమస్త్రీలయొక్క, స్మితములు=నవ్వులైనట్టియు, శర...రుచులు, శరత్=శరదృతువనెడు, అభ్రిముధవ=ఐరావతముయొక్క, అంగ=శరీరముయొక్క, చారు=సుందరములగు, రుచులు=కాంతులయినట్టియు, భవుక...ఛవుల్=భవుక=శుభకరమగు, ప్రబోధ=మెలుకువగల, మాధవ=విష్ణువుయొక్క, లోచన=నేత్రములయొక్క, ఛవుల్=కాంతులైనట్టియు, కాండ..రజములు, కాండ=ఉదకములయొక్క, నిర్మలతార్థ=నైర్మల్యముకొఱకైన, కతక=చిల్లగింజలయొక్క, రజములు=గుండలైనట్టియు, ఉద్భవి..చకచకల్=ఉద్భవిష్యత్=పుట్టఁబోవుచున్న, పంకజ=పద్మములయొక్క, ఉదార=విస్తారములగు, చకచకల్=చాకచక్యములైనట్టియు, బహు..రుచులు, బహుల=విస్తారమైన, నదీ=ఏర్లయొక్క, విరహ=వియోగముచేతనై, అతిపాండు=మిక్కిలితెల్లనైన

రుచులు = కాంతులైనట్టియు, భువన. . . భసితముల్ = భువన = లోకములకు, మోహన = మోహపెట్టుటకైన, రతిధవ = మన్మథునిచేత, కీర్ణ = చల్లఁబడిన, భసితముల్ = భస్మములైనట్టియు, నీలనీరద. . . పుంజకములు, నీల = నల్లనైన, నీరద = మేఘములనెడు, నిజ = స్వకీయములగు, యాన = వాహనములయొక్క, నిర్మలీకరణచణ = శుభ్రముచేయుటనెఱిఁగిన, పురందర = ఇంద్రునిచేత, కృత = చేయఁబడిన, అంగరాగ = మైపూఁతలైన, ధవళ = తెల్లనగు, రంజకద్రవక = రంజింపఁజేయు ద్రావకముయొక్క, ఛాయా = కాంతులయొక్క, పుంజకములు = సమూహములైనట్టియు, కపురపురజంబులు = కర్పూరధూళులు, వనాళిన్ = వనపఙ్క్తియందు, కరము = మిక్కిలి నెరసెన్ = వ్యాపించెను

చ. కలమవనావనార్థపరి-కల్పితమంచకులమ్ములందువ।
ర్తిలుచెలువల్ నెరాపసరు-దేరెడుపైరులమీరుకీరప।
క్షులముకుచాయలం దెలసి-తోలినఁ దత్కణిశాలిశాలిచం
చులఁ జనుచుం దిక్సతులచొక్కపుపచ్చలహెచ్చులోయనన్.

టీ॥ కలమ. . . కులమ్ములందున్ కలమవ = వరిచేలయొక్క, అవనార్థ = కాచుటకొరకు, పరికల్పిత = రచింపఁబడిన, మంచ = అరఁలయొక్క, కులమ్ములందున్ = సమూహములయందు, వర్తిలు = ఉన్నట్టి, చెలువల్ = స్త్రీలు, నెరాపసరు దేరెడు = మిక్కిలి పచ్చనైన, పైరులన్ = చేలను, మీరు = అతిశయించెడు కీరపక్షులన్ = చిలుకల గుంపులను, ముకుచాయలన్ = [పచ్చని] ముక్కు కాంతులచేత, తెలసి = [వేఱురంగుచేత] నెఱిఁగి తోలినన్ = కొట్టివేయఁగా, తత్కణిశ. . . చంచులన్. తత్ = ఆవరిచేలయొక్క, కణిశ = వెన్నులయొక్క, ఆలి = పఙ్క్తితోడ, శాలి = ఒప్పుచున్న, చంచులన్ = ముక్కులతోడ, చనుచున్ = (చిలుకలు) పోవుచు దిక్సతుల = దిక్కులను స్త్రీలయొక్క, చొక్కపు = సొగసైన, పచ్చలు = [అలంకారములయందలి] మరకతములయొక్క, హెచ్చులో యనన్ = అతిశయములో యనునట్లుగ, ఒప్పెన్ = ప్రకాశించును

శా. నాళీకాళిమృణాళికాకబళనా-నందన్మరాళాంగనా।
పాళుల్ వ్యోమతలంబునం బ్రతిఫలిం-పం బోలు నాఁగా నభః।
పాళీపాండుపయోదపఙ్క్తులు సరః-పాళిం బిసాళింపఁగాఁ।
బోలున్నాఁగ దివిన్ భువిన్ సితఘన-మ్ముల్ హంసలుం బాటిలెన్

టీ॥ నాళీ..పాళుల్, నాళీక=పద్మములయొక్క, అళి=శ్రేణియొక్క, మృణాళికా=తూండ్లయొక్క, కబళన=తినుటచేత, ఆనందత్=సంతోషించుచున్న, మరాళాంగనా=హంసస్త్రీలయొక్క, పాళుల్=పఙ్క్తులు. వ్యోమతలంబునన్=ఆకాశమందు, ప్రతిఫలింపఁబోలు నాఁగాన్=ప్రతిబింబించెనోయనునట్లుగాను, నభః...పఙ్క్తు, నభఃపాళీ—ఆకాశప్రదేశమందలి పాండు=తెల్లనైన, పయోదపఙ్క్తులు=మేఘపఙ్క్తులు, సరఃపాళిన్=మడుగులవరుసయందు, బిసాళింపఁగాఁబోలున్నాఁగన్=వ్యాపించఁబోలుననునట్లుగా, దివిన్=ఆకాశమందును, భువిన్=భూమియందును, సితఘనమ్ముల్=తెల్లమేఘములును, హంసలున్=అంచలును, పాటిలెన్=ఒప్పెను.

చ. కలశజసంగతిన్ ఘనులు-గాంచిరి శుద్ధత నీడ నింక మా।
కలరదు మించుటంచుఁ గర-కావళితో మణిచాపరేఖతో।
నిలఁ డిగు చంచలాళియన-నింపగు జాజిసరాలు వ్రేలవ।
ర్తిఁ గలలనౌఘమత్తతిఁ బు-రిం గొనుచుం గురుకావిలీవులన్॥

టీ॥ కలశజసంగతిన్=అగస్త్యునిస్నేహముచేత, [అనఁగా నగస్త్యోదయమగుటచేత] ఘనులు=మేఘములు [గొప్పవారనియును] శుద్ధతన్=నైర్మల్యమును గాంచిరి=పొందిరి, (ఇచట మహాదరము విపక్షాధీనము) ఈడన్=ఇక్కడ, మించుట=అతిశయించుట, మాకున్=మాకు. అలరదు=ఒప్పదు, అంచున్=అనుచు, కరకావళితోన్=వడగండ్లవరుసతోడను, మణిచాపరేఖతోన్=ఇంద్రధనస్సుయొక్క రేఖతోడను, ఇలన్=భూమియందు, డిగు=దిగినట్టి, చంచలాళియనన్=మెఱుపుపఙ్క్తులోయనునట్టి, లలనౌఘము=స్త్రీస

మూహము, అత్తటిన్=ఆశరత్కాలమందు, జాజిసరాలు = జాజిపూవుల దండలు, ప్రేలన్ = ప్రేలుచుండగా, గొను = ధరించిన, చందురుకావిరీవులన్, చందురుకావి = సిందూరపురంగుగలబట్టలయొక్క, రీవులన్ = శోభలచేత, పురిన్ = పట్టణమందు, వర్తింపన్ = సంచరించుము

మ. కతకంబొక్కటికుంభసంభవుఁడనం-గల్పించికాదంబినీ।
శతకాడంబరపంకిలాభ్రజలధిన్-సాధుప్రసాదంబుఁగా।
ర్చితగెంగాలనుభూమినేకరణిమిం-చెందేటలీస్యందినీ।
తతినాసేలసదేనదిన్నదినిలే-దాబింబదంభంబునన్॥

టీ॥ కాలము=సమయము. కుంభసంభవుఁడనన్=అగస్త్యనక్షత్రమను నట్టి, కతకంబు=చిల్లగింజ, ఒక్కటి=ఒకదానిని, కల్పించి=కూర్చి, కాదం...జలధిన్ కాదంబినీ=మేఘపఙ్క్తులయొక్క, శతిక=వందలయొక్క, ఆడంబర=ఆటోపముచేత, పంకిల=బురదగలిగిన, అభ్ర=ఆకాశమనెడు, జలధిన్=సముద్రమందు సాధుప్రసాదంబున్=మంచి నైర్మల్యమును, గూర్చి=చేసి, తగెన్=ఒప్పెను. భూమిన్=పుడమియందు, ఈస్యందినీతతిన్=ఈనదీసమూహమునందు, తేటలు=నైర్మల్యములు, ఏకరణిమించెన్=ఎట్లువ్యాపించెను, నానేల=అది ఎందుకు, ఆదే=ఆయాకాశనైర్మల్యమే, నదిన్నదిని=ప్రతినదియందు, బింబదంభంబునన్=ప్రతిబింబమిషముచేత, లేదా=ఉండదా.

శా. చక్రంబొక్కటిశింశుమారముభ్రమిం-చంగ్రాంచపుర్
ప్రాట్నమం।
దాక్రీడత్సితవారివాహనివహా-వ్యాకీర్ణతూలాళిని।
ర్వక్రంబై వెలయున్ శరజ్జరచేఁ-బర్యాయపర్యస్తమా।
ప్రక్రామ్యత్సితతంతుపఙ్క్తులనఁగా-ప్రాలుమ్నరాళావళుల్

టీ॥ శింశుమారము= (గ్రహాదులకాధారమై మేరువునం దిరుగుచున్న) శింశుమారమను పేరుగల చక్రంబు=చక్రము, ఒక్కటి=ఒకటి. భ్రమించన్=తిరుగగా, క్రౌంచపుర్ రాట్నమునందున్=క్రౌంచపర్వతమను నూలువడుకునట్టి యంత్రమునందు, ఆక్రీడ.. ..తూలాళి ఆక్రీడత్=అంతటఁదిరుగుచున్న, సిత=తెల్లని, వారివాహ=మేఘములయొక్క, నివహ=సమూహమునెడి, వ్యాకీర్ణ=ఏకిన, తూల=దూదిపింజెలయొక్క, ఆళి=పఙ్క్తి, నిర్వక్రంబై=వంకర లేనిదై, వెలయన్=ఒప్పగా, శరజ్జరచేన్=శరత్కాలమనుముసలిదానిచేత, పర్యాయపర్యస్తమౌ-క్రమముగా వడికఁబడునట్టి; ప్రక్రామ్య ..పఙ్క్తులనఁగాన్- ప్రక్రామ్యత్=ఆరంభమగుచున్న, సిత=తెల్లనయిన, తంతు=దారములయొక్క, పఙ్క్తులనఁగాన్=వరుసలోయనునట్లుగా, మరాళావళుల్=హంసపఙ్క్తులు. ప్రాలున్ = వ్యాపించును.

శా. మంచుల్తాపనతాపవీతికెదురిం-పన్లేకసప్తచ్ఛదో।
దంచత్పర్ణములాశ్రయించిరవిప-క్ష్యాబ్జాళిగంధంబుపు।
ష్పాంచచ్చోరులుదొంగిలించియవియిం-నాకారభేదంబునం।
గొంచున్మించెననన్వనింగపురముల్ఘూర్ణిల్లెవాత్యాహతిన్

టీ॥ మంచుల్=హిమములు, తాపనతాపవీతికిన్ తాపన=సూర్యసంబంధియగు, తాప=వేడిమియొక్క, వీతికిన్=జికికి,ఎదురింపన్ లేక=ఎదుర్కొలేక, సప్త..పర్ణములు సప్తచ్ఛదా=ఏడాకులయరఁటిచెట్లయొక్క, ఉదంచత్=ప్రకాశించుచున్న, పర్ణములు=ఆకులు,ఆశ్రయించి=పొంది, రవి... గంధంబు రవి=సూర్యునియొక్క, పక్ష్య=పక్షమందైన, అబ్జ=పద్మములయొక్క, ఆళి=పఙ్క్తియొక్క, గంధ=పరిమళమును, పుష్పాంచచ్చోరులు=పువ్వులనెడుఒప్పుచున్న దొంగలు, (అరఁటిపువ్వులలోనుండుదొంగలఅను పేరుగలయవయవములనియిచ్చటధ్వని), దొంగిలించి=అపహరించి,ఆవియిన్ వాసనలియ్యఁగా, ఆకారభేదంబునన్=వేఱురూపుచేత, కొంచున్=స్వీకరించుచు, మించెననన్=వ్యాపించెనోయనునట్లు, వనిన్=వనమందు, కపుర

ముల్ = కర్పూరములు, వాత్యాహతిన్ = సుడిగాలి తాకుచేత, ఘూర్ణిల్లెన్ = తిరిగెను.

వ. ఇప్పగిది నుప్పొంగు నింపుసొంపు నప్పురము యోగ్యావసమున.

టీ॥ స్పష్టము

క. మందసమున్ముఖగర్భము।
నందమ్ముగ నమరఁ దెలసి-యలసవనలస।
న్మందిరమున నిల్పిరి మే।
నందనివిదలిర్పనంత-నవలాసఖులున్॥

పా॥ అంత = అంతలో, నవలాసఖులున్. నవలా = మేనకయొక్క, సఖులున్ = చెలికత్తెలును, మందసము న్ముఖగర్భమున్. మందా = మెల్లగా, సము న్ముఖ = ఉజ్జృంభించి, గర్భమున్ = చూలాటను, అందమ్ముగన్ = సొగసుగా అమరల్ = ఒప్పగా, తెలసి = ఎఱిఁగి, మేనన్ = మేనను, తనివిదలి ర్పన్ = తృప్తినొందునట్లుగా, వలసన్మందిరమునన్ = వసముండొప్పుచున్న గృహమందు నిల్పిరి = ఉంచిరి,

సీటి॥ అంత = అంతలో, నవలాసఖులున్ = నూతనులగు నాట్యము సేయువారు, [అనగా ఆటలాడువారు] ఉత్సవములు జేయువారని యర్థము, మందసముల్ = పెట్టెను, ముఖగర్భముల్ = ఎదుటిభాగమును లోభాగమును, అందమ్ముగనమరల్ = సొగసుగా నొప్పఁగా, తెలసి, ఎఱిఁగి, మేనల్ = శరీరమందు, తనివిదలిర్పల్ = తృప్తినొసఁగునట్లు, అలసవనలసన్మందిరమునల్ ఆయుజ్ఞ సంబంధియగు ప్రకాశించుచున్న యింటియందు, నిల్పిరి = ఉంచిరి.

క. మందసముదీయమానా।
నందంబులుపొంగిపొరల-నవలాలితని।
ష్పందమతులునుమహీభృ।
త్సందేశకరుల్ బొసంగ-సవరించునెడన్॥

పా॥ మంద... .నందంబులు, మంద=మెల్లగా, సముదీయమాన=పుట్టుచున్న, ఆనందంబులు=సంతోషములు' పొంగి=అతిశయించి, పొరలన్=వ్యాపించఁగా, నవలాలు=స్త్రీలును, ఇతనిష్పందమతులు=ఇత=పొందబడిన. నిష్పంద=చంచలించని, మతులు=బుద్ధిగలవారును, మహీభృత్సందేశకరుల్=హిమవంతునివార్తాహరులును, పొసంగన్=అనుకూలముగా, సవరించునెడన్=పనులు జేయుసమయమున,

సీ॥ ఉదీయ ..నందంబులు ఉదీయమాన=పుట్టుచున్న, ఆనందంబులు=సంతోషములు, పొంగి=అతిశయించి, పొరలన్=వ్యాపించఁగా, నవలాలిత...మతులు నవ=క్రొత్తగా, లాలిత=గౌరవించఁబడినట్టియు, నిష్పంద=చంచలించని, మతులు=బుద్ధులుగల, మహీభృత్సందేశకరుల్=రాజాయొక్క వార్తాహరులు, మందసము=పెట్టె, పొసంగన్=అనుకూలముగా, సవరించునెడన్=సర్దుబాటుచేయునపుడు.

క. అకలుషమతిమహీభృత్సతి।
ప్రకటోత్సుకభావలబ్ధిఁ-బర్వఁగను మే।
నక మనసుహితముగాఁగ।
న్యక నెయ్యారములకుప్ప-నచటంగనియెన్॥

పా॥ అకలుషమతి=నిష్కలుష బుద్ధిగల, మహీభృత్సతి=హిమవంతుని భార్యయగు, మేనక=మేనకాదేవి, ప్రకటోత్సుక భావలబ్ధిఁ బర్వంగను=అతిశయమగు వేడుక వ్యాపించఁగా, మనసుహితముగా=మదికిష్టముగా, ఒయ్యారములకుప్పన్=విలాసములప్రోవైన, కన్యకన్=పిల్లను, అచటన్=ఆగృహమందు, కనియెన్=కనెను.

పీ॥ మేనక=మేనకయనునప్సరస, [ఇదియితరాప్సరసల కుపలక్షణము.] ప్రకటోత్సుకభావలబ్ధిఁ=అతిశయమగుసంతోషముచేత, పర్వంగను=(లక్షణచే) నాట్యముచేయుఁగా, అప్సరసలాడగానని యర్థము. మహీభృత్సతి=జనకునిభార్య, అచటన్=ఆ పెట్టెయందు, కనియెన్=చూచెను. శేషము సమానము,

క. తతకనకనగప్రభవను।
మతిగర్భమునంజనించు-మాన్యసుగన్యన్।
క్షితిభృత్పతిగన్గొనితా।
నతికుతుకతరంగితాంత-రంగతఁబొంగెన్॥

పా॥ క్షితిభృత్పతి=పర్వతశ్రేష్ఠుఁడగుహిమవంతుఁడు, కనకనగప్రభవన్=మేరుపర్వతమువలనఁ బుట్టిన సుమతి=మంచిమనసుగల మేనకయొక్క, గర్భమునన్=కడుపునందు, జనించు=పుట్టినట్టి, మాన్యన్=పూజ్యురాలగు, కన్యన్=కన్నియను, కన్గొని=చూచి, తాన్=తాను. అతికుతుకి తాంతరంగతన్=మిక్కిలిసంతోషముచేతఁ బొంగుచున్న యంతఃకరణముగలుగుటచేత, పొంగెన్=ఉబ్బెను

సీ॥ క్షితిభృత్పతి=రాజశ్రేష్ఠుఁడగు జనకుఁడు, కనకనగప్రభన్=బంగారుపర్వతమువంటి కాంతిగలిగినట్టియు, వసుమతి గర్భమునన్=భూమియొక్క గర్భమునందు, జనించు=పుట్టినట్టియు, శేషము సమానము.

సీ. జన్నంపుటన్నంపు-టన్నువల్ వెదఁజల్లు,
పారిజాతలతాంత-ధారలలరె।
సాధారలాధార-మైధారుణిఁజనించు,
భృంగమ్ములరిసప్ర-సంగమెసఁగె।
నారవంబాదూఢ-గౌరవంబై మీర,
గంధగంధవహాసు-బంధమొప్పె।
నాగాలలోఁగొని-నాగాలికుంతలల్,
పాడుపాటలకోటి-పరిఢవిల్లె।

గీ కన్యధన్యయనన్యసా-మాన్యమాన్య।
వర్ణ్యలావణ్యసావర్ణ్య-వర్ణవర్ణ।

నీయగాత్రిధరిత్రిజ-నించినట్టి
కల్యకల్యాణసుముహూర్త-ఘటికయందు॥

టీ॥ ధన్య=ధన్యురాలైనట్టియు, అనన్య గాత్రి=అనన్యసామాన్య=ఇతరులకు సాధారణము గాని, మాన్య=పూజించఁదగినట్టియు, వర్ణ్య=వర్ణించదగినట్టియు, లావణ్య=శరీరతళతళ్యము చేతను, సౌవర్ణ=బంగారు సంబంధియగు, వర్ణ=కాంతిచేత, వర్ణనీయ=వర్ణించఁదగిన, గాత్రి=శరీరముగల, కన్య=ఆచిన్నది, ధరిత్రిన్=భూమియందు, జనించినట్టి=పుట్టిన, కల్య..యందు, కల్య=ప్రశస్తమైన, కల్యాణ=శుభప్రదమైన, సుముహూర్త=మంచిముహూర్తముయొక్క, ఘటికయందు=గడియయందు, జన్నంపుటన్నపుటన్నవల్=యజ్ఞములేయన్నముగలదేవతలస్త్రీలు, వెదజల్లు=విరియఁజల్లిన, పారి...ధారలు, పారిజాతలతాంత=పారిజాతపుష్పములయొక్క, ధారలు=ధారావర్షములు, ఎసఁగెన్=ఒప్పెను, ఆ ధారలు= ఆధారలే=ఆధారమై=జీవనాధారముగానుండి, ధారుణిన్=భూమియందు, చరించు=తిరుగుచున్న, భృంగమ్ముల=తుమ్మెదలయొక్క, రావ..సంగము=ధ్వనిప్రసక్తి, ఎసఁగెన్=ఒప్పెను, ఆరవంబు=ఆధ్వని, ఆరూఢగౌరవంబై=ప్రసిద్ధగౌరవముగలదియై, మీఱెన్=అతిశయించఁగా, గంధ..బంధము, గంధ=పరిమళముతోఁగూడిన, గంధవహ=గాలియొక్క, అనుబంధము=సంబంధము, ఒప్పెన్=ఎసఁగెను. ఆ గాలిన్=ఆవాయువుచే= లోఁగొని=లోఁబరచుకొని, నాగాలికుంతలల్=నాగకన్యలు, పాడు=గానముచేయునట్టి, పాటల=గానములయొక్క, కోటి=విస్తారము, ఎసఁగెవెలిన్=ప్రవర్తించెను,

ఉ. క్రొన్నెలదాల్పువెల్పుజిలు-గుల్ వెలుగుల్ గొనలేటిఘోటిజే।
క్రొన్నవలంతిపిల్లగమి-కొల్లగఁబిల్లపురెమ్ము లేసె మేల్।
జన్నములందునగ్గతిగ-సప్తవపజుల్ తృప్తిఁగాంచెముం।
చెన్నరతేటతామరలు-చొకులువల్ గలయేటికోఁటులన్॥

టీ॥ క్రొన్నెల..జిలుగుల్, క్రొన్నెలఁదాల్పు= లేతచంద్రుని ధరించిన, వేల్పు=దేవుని యొక్క [సాంబమూర్తి యొక్క] జిలుగుల్ సన్నపుబట్టలైన దిక్కులు, వెలుగుల్ గాన్=నిర్మలత్వమునొందఁగా, లేటి ..గమి=లేటిఘోటికన్=లేడియను గుఱ్ఱమును చేకొన్న=స్వీకరించిన, పవంతి = నేర్పరి, [గాలి] యొక్క, పిల్లగమి=బాలురసమూహము, (అనఁగా మందమారుతములు) పిల్లమిరెమ్ములు-తలక్రిందుగా వేసికొనుటలు, ఏసెన్ = వేసెను. మేల్ జన్నములందు = మంచియజ్ఞములయందు, అగ్నిశిఖ = త్రేతాగ్నులయొక్క, సప్తరసజ్ఞలు = ఏడునాలుకలు, తృప్తిఁగాంచెన్ = తృప్తిఁజెందెను, తామరలు = పద్మములును, దొంగిలువాల్ = ఎఱ్ఱకలువలును, కల = ఉన్నట్టి, ఏటికోటులన్ = బహునదులయందు, నెరతేట = మిక్కిలి నైర్మల్యము, మించెన్ = అతిశయించెను, ఆమె జన్మకాలమునందు సమస్తమును సుఖముగానుండెనని తాత్పర్యము

చ॥ జనకుఁడు ధన్యకన్యయయి-చంపకపుష్పసువర్ణ గౌరి స।
ద్వనరుహపాణి బుట్టినయు-దారముహూర్తమునన్దంబునన్
ఘనమణులంబరంబులున-గాధముగా నొసఁగంగ నేగతిన్।
దినమణియంబరంబు నెగి-నిల్చె నొకో యని రార్యులత్తఱిన్॥

పా॥ జనకుఁడు= తండ్రియగు హిమవంతుఁడు, ధన్య= ధన్యురాలైనట్టియు, చంపక ..సువర్ణ చంపకపుష్ప=సంపెంగపువ్వులవంటి, సువర్ణ= మంచిరంగుగలిగినట్టియు, (పార్వతియల్లనిదైను శ్లేషబలమునబట్టి స్త్రీసామాన్యమునకుఁ జేసినవర్ణనఁ జేసినాఁడు) సద్వనరుహపాణి=సత్=శ్రేష్ఠములగు, వనరుహ=పద్మమువంటి, పాణి=హస్తములుగలిగినట్టియు, గౌరి=గౌరీదేవి, కన్యయయి=కౌమార్తెయయి, పుట్టిన = జనించిన, ఉదారముహూర్తమునన్ = గొప్పముహూర్తమందు, ఘనమణులు గొప్పరత్నములును, అంబరంబులు =బట్టలును, అగాధముగా, మిక్కిలిగా, ఈశ్వరజ్ఞునకు లోతరమైనను లక్షణచేసియారఋగలిగినది, ఒసఁగంగన్ = ఇయ్యఁగా, అత్తఱిన్

ఆసమయమందు. ఆర్యులు = పెద్దలు, దినమణి - సూర్యుఁడును, మాణిక్య విశేషమనియుఁ దోచుచున్నది. అంబరంబును = ఆకాశమును, వస్త్రమనియుఁ దోచుచున్నది, ఒగిన్ = అనుకూలముగా, ఏగతిన్ = ఏప్రకారము, నిల్చెనో = ఆగెనో, అనిరి = అనిపల్కిరి,

సీ॥ జనకుఁడు = జనకమహారాజు. చరిపక ..గౌరి = చంపకపుష్ప = సంపెంగపువ్వులవలెను, సువర్ణ = బంగారమువలెను, గౌరి = పచ్చనిదియైన, సద్వనరుహపాణి = మంచిపద్మము హస్తమందుఁగల లక్ష్మీదేవి, శేషము సమానము.

క. ఎక్కువగఁబండ్లనమరిన।
చక్కెరలకుమూగుశాఖి-సద్విజవర్గం।
బక్కన్యజననమహామున।
నక్కజముగనొప్పెభావు-కాకరఫణితిన్॥

టీ॥ ఎక్కువగన్ = మిక్కిలిగా, పండ్లన్ = ఫలములతో, అమరిన = కలసిన, చక్కెరలకున్ = పంచదారలకు, మూగు = క్రమ్మిన, శాఖిసద్విజవర్గంబు. శాఖి = వేదశాఖాధ్యయనముఁజేసిన, సద్విజ = మంచిబ్రాహ్మణులయొక్క, వర్గంబు = సమూహము, అక్కన్య = ఆచిన్నదానియొక్క, జననమహమునన్ = జన్మోత్సవమందు, అక్కజమునన్ = ఆశ్చర్యముగా, భావుకాకరఫణితిన్ భావుక = శుభమునకు, ఆకర = స్థానమును, ఫణితిన్ = రీతిచేత. ఒప్పెన్ = ప్రకాశించెను.

వ. అంత॥

క. చిలుకలపిలుకలపలుకల।
కులుకులుగలమెలకువలకుఁ-గొలుతఘటించుం।
జలిబిలిపలుకులుబలుకుచు।
జలకముకలికికినొసర్పఁ-జనిరిపొలంతుల్॥

టీ॥ చిలుకలపిలుకల= చిలుక పిల్లల యొక్క, పలుకుల= వాక్యముల యొక్క కులుకులుగిలు= విలాసములుగల, మొలకవలకున్ = ప్రౌఢిమలకు, గొరతఘటించు= లోటుగలిగించు, జిలిబిలిపల్కులు= మృదు వాక్యములు, పలుకుచున్ = ఉచ్చరించుచు. పొలంతుల్ = స్త్రీలు, కలికకున్ = అచిన్నదానికి, ఉపర్పన్ = చేయుటకు, చని = వెళ్ళి,

చ. క్రమమునఁబ్రత్నరత్నపరి-ష్కృతనిర్మలశాతకుంభకుం
భములసుగంధగంధరస-బంధురమైననఖంపచోదకం
బమరిచిబాలకుంజలక-మార్చిపడిందడియొత్తిపొత్తులం
గొమరులుమించనుంచిరి-కురంతలలంతియలంతదీర్చఁగన్॥

టీ॥ అంత = అంతట, అళికుంతలలు = తుమ్మెదలవంటి ముంగురులుగల స్త్రీలు, అలంత = ఆయాసము, తీర్పఁగన్ = పోఁగొట్టుటకు, క్రమమునన్ = వరుసగా, ప్రత్న కుంభములన్ ప్రత్న = పురాతనములగు, రత్న = మణులచేత, పరిష్కృత = అలంకరింపఁబడిన, నిర్మల = శుభ్రములైన, శాతకుంభ = బంగారముయొక్క, కుంభములన్ = ఘటముల చేత, సుగంధ బంధురమైన. సుగంధ = మంచి పరిమళముగల, గంధరస = గంధోదకముచేత, బంధురమైన, అతిశయించిన, నఖంపచోదకము = గోరువెచ్చనీరు, అమరిచి సిద్ధపరచి, బాలకున్ = చిన్నదానికి, జలకమార్చి = నీళ్ళుబోసి, పడిన్ = త్వరతో, తడియొత్తి = తుడిచి, పొత్తులన్ = సన్నగుడ్డలయందు, కొమరులు మించన్ = శోభలతిశయింప, ఉంచిరి = పరుండఁబెట్టిరి.

క. అతులనతసీతసుమనః।
ప్రతినిధియువి.గుణముఁలేసు-పడచలసవన।
క్షితిలోనంబికనాదము।
హితముగనొకపేరఁబలికి-రితురుబాలన్॥

టీ॥ ఇంతులు=స్త్రీలు. బాలక్=ఆచిన్నదానిచే అతులక్=సామ్యముకేనిదాని, అతసీతసుమనః ప్రతినిధి=అతసీ=అగిసెచెట్టుచేత, ఇత, ఖాందఁబడిన, సుమనః=పుష్పములకు, ప్రతినిధి=సమానురాలు, అని=అని, గుణములేరుపడక్=గంగులుస్పష్టముగాగా, అలస లోక్. అలస=వృక్షవిశేషములయొక్క, వనక్షితిలోక్=వనభూమిలో, అంబికనాక్=అంబికయనఁగా, దమహితముగక్=శాంతగుణమునకు హితమగునట్లుగా, ఒకపేరక్=ఒకనామముచేత, పలికిరి=వచించిరి,

సీ॥ ఇంతులుబాలక్. అతులనతక్=సామ్యములేకుండుటచేత, సీత=సీత సుమనఃప్రతినిధి=దేవతాసమానురాలు, అనిగుణము లేరుపడక్ అల=అట్టి, సవనక్షితిలోనక్=యజ్ఞభూమిలోపల, పికనాదమహితముగక్= కోకిలధ్వని చేతఁబూజితమగునట్లు, ఒకపేరఁబలికిరి

వ. ఆక్రమంబున॥

సీ. పల్లవమ్ములకుసం-పల్లవమ్ములుగూర్చి,
పదములొక్కటిరెండు-బొదువనేర్చె।
విశ్వంబుఁగబళించు-విశ్వంభరునినామ,
మనుచుఁదానత్తత్త-యనఁగనేర్చె।
బంగరుచవికలో-శృంగారవతులతో,
గురివిందకుప్పలు-గూర్చనేర్చె।
వీణావతులఁగూడి-రాణామృతముసద్వి,
పంచికాతతులవా-యించనేర్చె।

గీ, బాలికారత్నమనుదిన-వర్ధమాన।
కాంతిశృంగారసటసరం-గంబులైన।

యంగములనంగజుని చేతి-యసమహేతి।
సాన(బట్టినరీతిము-చ్చటలహెచ్చె॥

టీ॥ బాలికారత్నము=బాలికలయందు(శ్రేష్ఠురాలగునాచిన్నది, పల్లవమ్ము లకుక్=చివుళ్ళకు, సంపల్లవంబులు=మిక్కిలి శోభలను, కూర్చు=సంధానము(చేయునట్టి, పదములు=అడుగులు, ఒకటిరెండు=కొలదిగా, పొదువనేర్చెక్=కూంచనేర్చెను- విశ్వంబు(గబళించు=ప్రపంచమునుదినునట్టి, విశ్వంభరుని=విష్ణువుయొక్క. నామమునుమక్=పేరనితలంచుచు, అత్తత్త యన(గ నేర్చెక్=అత్త, యత్తయనటనేర్చెను- ॥అదభక్షణే'' అ అను ధాతువుపైని త్రుప్రత్యయముగాని, త్ర ప్రత్యయముగాని చేర్చ(గా అత్త్ర అనిప్రాతిపదికము అయినది- అపై ॥డాబవిధాత్రీదేయః, దీర్ఘాణాంహ్రస్వస్స్యాత్'' అను నాంధ్ర వ్యాకరణ సూత్రములచే నీ రూపము [అత్త్రి] వచ్చెను- బంగారుచవికెలోక్=బంగారపుమండపములోపల. శృంగారవతులతోక్=స్త్రీలతోడ, గుజ్జెనగూళ్ళలు=క్రీడావిశేషములు, కూర్చనేర్చెక్=ఆడనేర్చెను, వీణావతులక్=వీణలుగల స్త్రీలను, కూడి=కలసి, రాణామృతము=అమృతమువంటిధ్వని, రణశబ్దే అను ధాతువుపై ఘఞ్ ప్రత్యయము(జేర్చ(గా రాణ అనురూపమువచ్చినది సంగీతమని యర్థము. సద్విపంచికాతతులక్=మంచి వీణాసమూహములయందు, వాయించనేర్చెక్=ధ్వనించనేర్చెను, అనుదిన. రంగంబులైన. అనుదిన=ప్రతిదినమందు, వర్ధమాన=వృద్ధి(బొందుచున్న, కాంత=మనోహరమైన, శృంగారనటన=శృంగారనాట్యమునకు, రంగంబులైన=రంగస్థలములైన, అన(గా శృంగారప్రచురములయిన. అంగములక్=అవయవములచేత, అంగజుని చేతి=మన్మథుని చేతిలోని, అసమహేతి=సమానములేనికత్తి, సాన(బట్టినరీతిక్=సానపెట్టినట్లుగా, ముచ్చటలక్=శోభలచేత, హెచ్చెక్=అతిశయ...

క॥ బాల్యంబుజారెమన్మథ।
లౌల్యంబలరారెనంత-లజ్జాసమమై।

కాల్యమునసలినికింబలెఁ

గల్యంబగుజవ్వనంబు-కలికికిఁబొడమెన్॥

టీ॥ కలికికిన్ = చిన్నదానికి, బాల్యంబు = బాలత్వము, జారెన్ = వదలెను, మన్మథలౌల్యంబు = కామము చేతనయినచాంచల్యము- లజ్జాసమమై = సిగ్గుతోసమానముయి. (అనఁగా మన్మథలౌల్యమును సిగ్గును కూడ) అలవారెన్ = ప్రకాశించెను, కాల్యమునన్ = ప్రాతఃకాలమందు, నలినికిం బలెన్ = తామరపాదకువలె, కల్యంబగు = మంచిదగు, జవ్వనంబు = యౌవనము, పొడమెన్ = అంకురించెను.

చ॥ కుటిలములయ్యెఁగోమలికిఁగుంతలముల్ బెళుకుల్ కనుంగవం

బుటమరిలెంజనుంగవయుఁ-బోకలరేకలఁ బ్రాకెఁబల్కులం

జటులలితంబులొప్పెనర-చందురుచందమునంజెందెమోముపొ

క్కిటగహనత్వముల్లసిలెఁ-గెంపులకెంపుదలిర్చెవాతెరన్॥

టీ॥ కోమలికిన్ = స్త్రీకి, కుంతలముల్ = ముంగురులు, కుటిలములయ్యెన్ = వంకరలయ్యెను, కనుంగవన్ = నేత్రద్వంద్వమందు, బెళుకుల్ = చాంచల్యములు, పుటమరిలెన్ = ఉబ్బెను, చనుంగవయున్ = కుచద్వంద్వమును, పోకలరేకలన్ = పోకచెక్కలరీతిని, ప్రాకెన్ = వ్యాపించెను, పల్కులన్ = వాక్యములయందు, చటులలితంబులు = చంచలములగువిలాసములు, ఒప్పెన్ = ప్రకాశించెను, మోము = ముఖము, [నుదురనితాత్పర్యము] అరచందురు చందమునన్ = అర్ధచంద్రునిరీతిని, చెందెన్ = పొందెను, పొక్కిటన్ = నాభియందు, గహనత్వము = లోతు, ఉల్లసిలెన్ = ప్రకాశించెను, వాతెరన్ = అధరోష్ఠమునందు, కెంపులకెంపు = కెంపులయెఱుపు, తలిర్చెన్ = ఒప్పెను,

ఉ॥ బాలికయుంగరాజ్యమున-బాల్యపుమంత్రినిజప్రభావముల్

తూలకుఁద్రొబ్బిరానతని-ముంచఁగయౌవనమంత్రినుంచితా

ల్లాలితమధ్యపుష్టినఖిలంబుఁగ్రహించిమనోజరాజను

ద్వైలతఁగూర్చిలిబ్బిలనఁ-దేలెఁగుచంబులు చంద్రఫాలకున్॥

టీ॥ మనోజరాజు=మన్మథుఁడను రాజు, బాలిక=చిన్నదానియొక్క, అంగరాజ్యమునన్=శరీరమను రాజ్యమందు, బాల్యపుమంత్రి=శిశుత్వమనెడు ప్రధాని, నిజప్రభావముల్=తన సామర్థ్యములు, మూలకుఁద్రొబ్బి పోన్=మూలకు ద్రోసి వేసి రాగా, అనఁగా బాల్యమందు మన్మథచేష్ట లుండవని తాత్పర్యము- అతనిన్=ఆ బాల్యమంత్రిని, ముంచఁగన్=అణఁచి వేయుటకు, యౌవనమంత్రిన్=జవ్వనమను ప్రధానిని, ఉంచి=ఏర్పాటు చేసి, తల్లాలితమధ్యపుష్టిన్- తత్=ఆయంగరాజ్యముయొక్క, లాలిత=గారవించఁబడు, మధ్యపుష్టిన్=నడుముయొక్క పుష్టిని. మధ్యదేశమందలి యైశ్వర్యమనియు- అఖిలంబు=అంతయును, గ్రహించి=పుచ్చుకొని, అనుద్వైలతన్=అతిశయము లేకుండుట చేత, అనఁగా మెల్లమెల్లగా ననియర్థము- కూర్చి=సంధానముఁ జేయునట్టి, లిబ్బిలనన్=ధనము ప్రాతరలన్నట్లుగా. కుచంబులు=స్తనములు, చంద్రఫాలకున్=చంద్రునివంటి లలాటముగల స్త్రీకి. తేలెన్=బయలు దేరెను.

చ. జలజరజంబుఁ జంద్రసుధఁ-జంచలచారుచకచ్చకచ్ఛవుల్।
మలయపుగాలిశూలివన-మానసఖంబును నేర్చికూర్చిక్రొం।
దలిరుకటారివీరుఁడుప-సర్పఁగఁ బోటుఁబడంతిఁ గానిచో।
బలియునె మేనగంధరస-భాస్వరశీతసువర్ణవైఖరుల్॥

టీ॥ క్రొందలిరుకటారి=క్రొత్తచివుళ్ళు కత్తిగల, వీరుఁడు=మన్మథుఁడు, జలజరజంబున్=పద్మపరాగమును, ఇది పంచభూతములలో భూమ్యంశము- చంద్రసుధన్=చంద్రుని యమృతమును ఇది జలాంశము చంచల=మెరపుయొక్క, చారుచకచ్చకచ్ఛవుల్=సుందరములగు చకచక యను కాంతులును, ఇది తేజోంశము- మలయపుగాలిన్=మలయపర్వతవాయువును, ఇది వాయ్వంశము- శూలివనమానసఖంబును- శూలి=ఈశ్వరునియొక్క, వన=వనమందలి, మానస=మానససరస్సునం దయిన, ఖంబును=ఆకాశమును. ఇది యాకాశాంశము- ఏర్చి=ఏరి, కూర్చి=కలిపి, పడంతిన్=ఈ చిన్నదానిని,

తిరిన్ = క్రమముచేత, అమరున్ = ఒప్పును, మొగము = ముఖము, కమలలక్షణలక్ష్మిన్ కమలలక్షణ = లేడిచిహ్నములుగల చంద్రునియొక్క యనియు, కమల = పద్మములయొక్క, లక్షణ = రీతులయొక్క యనియు నర్థము. లక్ష్మిన్ = శోభను, గణియింపన్ = లెక్కించుటను, ఓష్ఠము = పెదవి, అరుణ బింబపురక్తిన్. అరుణ = ఎఱ్ఱనైన. బింబపు = దొండపంటి యొక్క, అరుణబింబపు = సూర్యబింబముయొక్క, రక్తిన్ = ఎఱుపును, అవఘళించున్ = తిరస్కరించు నవ్వు = స్మితము, సుమనశ్ఛటాహార సురుచిరంబు సుమనః = పుష్పములయొక్క, ఛటా = సమూహముయొక్క, హార = మాలికవలెననియు సుమనశ్ఛటా = దేవతా సమూహముయొక్క, ఆహార = భోజనపదార్థమగు నమృతమువలెననియు నర్థము. సురుచిరంబు = మిక్కిలి మనోహరమైనది అగున్ = ఔను. పయోధరములు = స్తనములు తాళవృత్తత. తాళ = తాటిపండ్లయొక్కయనియు తాళములయొక్క యనియు నర్థము వృత్తత = వర్తులత్వమును. ఎనయున్ = పొందును, నితంబంబు = పిఱుదు విపులచక్రముల్ రీతిన్ - విపుల = విస్తారమైన చక్రము = బండిగల్లు యొక్క యనియు, విపుల చక్రము = భూచక్రము యొక్క, యనియు నర్థము- ఇది తెలుగు షష్ఠీ సమాసము గావున విపులాశబ్దమునకు హ్రస్వము కలిగెను- రీతిన్ = క్రమముచేత, వెలయున్ = ఒప్పును, తతనఖములు = విస్తారమగు గోళ్ళు, తారాకృతిన్ = తార = ముత్యములయొక్కయనియు, నక్షత్రములయొక్కయనియు నర్థము, ఆకృతిన్ = ఆకారమును, వహించున్ = పూనును, గీతచరణములయందు శ్లేషభంగిచేతఁ నిదివరలో జెప్పినవస్తువులఁ జెప్పుచున్నాఁడు. ఘనము = మేఘమును, అళులు = తుమ్మెదలును, తమ్మి = పద్మమును, తెళ్ళు = మృగములయొక్క కింకణములు = తొట్రుపాటున్న, గర్వములని తాత్పర్యము. ఇందుకమలములు = చంద్రపద్మములును, బింబములు = దొండపంటియొక్కయు సూర్యునియొక్కయు, శోణిమలు = ఎఱుపులును, సుమములు = పువ్వులును, ప్రీతము సుధ = సుధయును, తాళఫలము = తాటిపండును, తాళము = వాయించుకొనునట్టి తాళమును, అరి = బండిచక్రమును, ధరణీ = భూమియును, ముత్యములు = ము

త్యములును, భంబులు=మొక్కలును, ముదితమేనన్=చిన్నదానిశరీరమందు
ఒనఁగూడెన్=తారసించెను,

క. వింటికిసరిబొమకొనల।
వింటికినరిదొరకవెంత-విఱవీగినను।
ప్పంటికినలవంటికినల।
పంటికినలసాక్షిగుబ్బ-పాలిండ్లసిరుల్॥

టీ॥ బొమ=కనుబొమ, వింటికిన్=ధనస్సునకు, సరి=సమానము, కొన=వదును, అలవింటికిన్=ఆయాకాశమునకు సరి, సమానము, అలసాక్షి=మందముతైన నేత్రములుగలచిన్నదానియొక్క, గుబ్బపాలిండ్ల=గుండ్రనైనస్తనములయొక్క, సిరుల్=శోభలు, అలవంటికిన్=ప్రసిద్ధముగుతలమునకును, అలపంటికిన్=ప్రసిద్ధముగుకలశమునకును, ఎంతవిఱవీగినన్=ఎంతగర్వపడినను, ఎప్పింటికిన్=ఏకాలమునకును, దొరకవు=లభించవు.

సీ. నీలలీలలనేలు-వాలవాలభరంబు,
పద్మసంపదఁగాంచుఁ-బడఁతిమొగము।
రంభసంభ్రమమెంచు-రమణియూరుయుగంబు,
హేమభూమవహించు-నింతికాంతి,
శ్యామకోమలరీతి-సవరించుమెఱుఁగారు,
చిత్రరేఖనుమించుఁ-బత్రరేఖ।
తారసారులఁగేరుఁ-దరుణిపాదనఖాళి,
మినుకుకొమ్మనుమిగారు-మొలఁతభుజము॥
గీ. గానసీచానయసమాన-మానసకల।
మానినీమానసీయలీ-లానిధాన।

ఇన్నెలఁత నెన్నగాఁ బన్న-గేశ్వరునకు।
భూరిముఖములు నిర్మింపఁ-బోలు ధాత॥

టీ। బాలవాలభరంబు = చిన్నదాని కేశసమూహము, నీలలీలలన్ = ఇంద్రనీలములవిలాసములను, విష్ణుభార్యయగు నీలాదేవియొక్క విలాసములనియు ధ్వని- ఏలున్ = శాసించును, ఎడఁదెగ మొగము - చిన్నదానిముఖము, పద్మసంపదన్ - తమ్మియొక్క శోభను, లక్ష్మీదేవియొక్క శోభ యనియు ధ్వని- కాంచున్ = పొందును. గమనీయోరుయుగంబు = చిన్నదానితొడలజోడు, రంభసంభ్రమము = అరటిచెట్టుయొక్క యాటోపమును, రంభయను నప్సరసయొక్క యాటోపమునని ధ్వని, ఎంచున్ = లెక్కబెట్టును, ఇంతి కాంతి = చిన్నదాని కాంతి, హేమభూమన్ = బంగారముయొక్క గొప్పతనమును, హేమయను నప్సరసయొక్క గొప్పతనమునని ధ్వని, వహించున్ = పొందును, మెఱుఁగారు = మెఱుఁగైన నూగారు, శ్యామకోమలరీతిన్ = లలితకోమలమైన పద్ధతిని, శ్యామ యను నప్సరయొక్క కోమలరీతి యనని ధ్వని, సవరించున్ = దిద్దును, పత్రరేఖ = మకరికాపత్రరేఖ, చిత్రరేఖన్ = చిత్రమైన పద్ధతి చేతను, చిత్రరేఖయను నప్సరసను, అని ధ్వని. మించున్ = అతిశయించును, తరుణీపాదనఖాళి = చిన్నదాని పాదపుగోళ్ళవరుస, తారసౌరులన్ = నక్షత్రముశోభను, తారయను బృహస్పతి భార్యయొక్క శోభనని ధ్వని, కేరున్ = హాస్యముఁ జేయును, మెలఁత భుజము = చిన్నదాని బాహువు, మినుకుకొమ్మన = తళుకుగల తీగను. సరస్వతి యని ధ్వని విరున్ = అతిశయించును, గానన్ = కనుక, ఈచాన = ఈ చిన్నది, అసమానమానన = సమానములేని గౌరవముగల, సకలమానినీ = సమస్తస్త్రీలకును, మాననీయ = గౌరవించఁదగిన, లీలా = విలాసములకు, నిధానము = నిధియైనది, ఇన్నెలఁతన్ = ఈచిన్నదానిని, ఎన్నగాన్ = వర్ణించుటకు, ధాత = బ్రహ్మ, పన్నగేశ్వరునకున్ = శేషునికి, భూరిముఖములు, చాలానోళ్ళు, నిర్మింపఁబోలున్ = చేయఁబోలును.

క. నీలమ్ములు వాలమ్ములు।
నీలమ్ముల శ్రీలు దేలు-నిగనిగమనుగ్రొ।

గ్జాలమ్ములు జాలమ్ములు।
జాలమ్ములలీల నేలుఁ-జంద్రాననకున్॥

టీ॥ చంద్రాననకున్ - చంద్రునివంటిముఖముగల చిన్నదానికి, వాలమ్ములు = కేశములు, నీలమ్ములు = నల్లనివి, నిగనిగమను = నిగనిగలాడెను, దృగ్జాలమ్ములు = దృష్టిసమూహములు, జాలమ్ముల = వలలయొక్క, జాలమ్ముల = కపటములయొక్క, లీలన్ = విలాసమును, ఏలున్ = శాసించును.

సీ. కన్నెకన్నులతోడ-వన్నెలెన్నఁగవచ్చి,
సారసమ్ములునీర-సత్వమొందె।
నాతినేత్రములతో-సాటులాడఁగవచ్చి,
నల్లకల్వలువేగ-నయముదూలఁగ।
కాంతకన్గవతోడ-గరిమఁబూనఁగవచ్చి,
మీనజాలముసుళ్ళ-లోనమునిఁగె।
మగువదృగ్యుగళితో-నిగనిగల్గొనవచ్చి,
నెలపుల్గుగవలువ-ర్తిలఁగనరసె।

గీ. తమ్ములకుఁదమ్ములిందీవ-రమ్ములకువ।
రమ్ములుసుమీలకుస్నీల-సమ్ములలచ।
కోరికలకును.గోరికల్-కొమరెమేలు।
వాలుగన్నులువర్ణింప-వశమెవరికి॥

టీ॥ సారసమ్ములు=పద్మములు, కన్నెకన్నులతోడన్=చిన్నదాని నేత్రములతో, వన్నెలెన్నఁగవచ్చి=శోభలెంచుటకువచ్చి, నీరసత్వము=రసహీనతను, నీటియందునికినియు, ఒందెన్=పొందెను, నాతి నేత్రములతోన్=చిన్నదానికన్నులతో, సాటులాడఁగవచ్చి=సాటులు పలుకగవచ్చి, ఇందీవరములు

వేగన్ = త్వరగా, తెల్లవారఁగానియు, నయముఁజూపెన్ = అందమును బోఁగొట్టుకొని పోయెను. కాంతికన్నవలెన్ = చిన్నదాని నేత్రద్వంద్వముతో, గరిమ బూనఁగవచ్చు = గౌరవము నొందవచ్చు, మీనజాలము = చేపలగుంపు, సుళ్ళులోనన్ = నీటిసుడులయందు, కష్టములఁగాంచినదియు, మునిఁగెన్ = మునిఁగిపోయెను, ముగువదృగ్యుగళితోన్ = చిన్నదాని నేత్రద్వంద్వముతో, నిగనిగల్ గొనవచ్చి తాళితత్వము నొందవచ్చి. నిలుపుల్గుగవలు = చకోరద్వంద్వములు, వర్తిలఁగన్ = సంచరించుటను [ఈవాక్యము సరియయినదని తోఁచదు] అరసెన్ = చూచెను. తమ్ములకున్ = పద్మములకు. తమ్ములు = సహోదరులు, ఇందీవరములకున్ = నల్లగల్వలకు, వరమ్ములు = శ్రేష్ఠములు. మీలకున్ = చేపలకు ఊన్నీలమ్ములు, కనులుమూయయు నయును అలచకోరికలకున్ = ఆస్త్రీచకోరములకు, కోరికన్ = కామితములును, ఐవట్టి, కొమిరె = చిన్నదానియొక్క, వాలుగన్నులు = విశాలనేత్రములు, వర్ణింపన్ = వర్ణనఁజేయుటకు, ఎవరికిన్ = ఎవరికైనను, వశమే = స్వాధీనమా.

ఉ. కమ్మనిపల్కు తేనెలర-కమ్మనికుల్కుకుచమ్ము చక్రవా।
కమ్మని మేనికాంతి కన-కమ్మని బెళ్కుడుచూపు చేవపాం।
కమ్మని చెక్కు చంద్రఫల-కమ్మని క్రొమ్మెఱుఁగారు దందశూ।
కమ్మని కొప్పు తేటికుల-కమ్మని పల్కెడు నీలవేణికిన్॥

టీ॥ నీలవేణికిన్ = నల్లనిజడగలచిన్నదానికి, కమ్మని పల్కులు = రుచిగలవాక్యములు, తేనెలరకమ్ము = తేనెదినుసనియు, కుల్కుకుచమ్ము = శృంగారముగలస్తనము, చక్రవాకమ్మని = చక్రవాకపక్షియని, మేని కాంతి = శరీరచ్ఛాయ, కనకమ్మని = బంగారమనియు, బెళ్కుచూపు చేవ = చంచలమయిన దృష్టియొక్కబలము, పాంకమ్మని = సొగసయినదనియు, చెక్కు = గండస్థలము, చంద్రఫలకమ్మని = చంద్రకాంతమనియు, క్రొమ్మెఱుఁగారు = నిగనిగలాడెడునూగారు, దందశూకమ్మని = సాపమనియు, కొప్పు = కేశభారము, తేటికులకమ్మని = తుమ్మెదగుంపనియు, పల్కెదన్ = చెప్పెదను.

గీ. ఇంతిసల్లపనస్ఫూర్తి - యించుకమరు
రాజనకుమత్తకోకిల - రాజనకును
తరుణియుచ్చరణస్ఫూర్తి - దనరుఁగొంత
శుకములకునతివికచకిం - శుకములకును॥

టీ॥ ఇంతి=చిన్నదానియొక్క, సల్లపనస్ఫూర్తి- సత్=శ్రేష్ఠమయిన, లపన=ముఖముయొక్క, సల్లపన=పలుకుబడియొక్కయు, స్ఫూర్తి=స్ఫురణము, ఇంచుక=కొంచెము, రాజనకున్=చంద్రునికి, మత్తకోకిల రాజనకును=మదించినకోకిలశ్రేష్ఠమునకును, అమరున్=ఒప్పును, తరుణి=చిన్నదాని యొక్క, ఉచ్చరణస్ఫూర్తి- ఉచ్చరణ=పలుకుబడియొక్క, ఉత్=ఉన్నతమయిన, చరణ=పాదములయొక్కయు. స్ఫూర్తి=స్ఫురణము, శుకములకును=చిలుకలకును, అతివికచకింశుకములకును=మిక్కిలివికసించిన మోదుగపువ్వులకును, కొంత=కొంచెము, తనరున్=ఒప్పును-

చ. కలికిమొగంబుడంబునకుఁ - గాశశిపద్మములాఢ్యపుష్కర
స్థలినిసదాతపస్స్ఫురణఁ - దాల్చుతతిన్విశకలంకసౌరభో
జ్జ్వలతనుబద్ధమొందెనలచందముఁజందురుఁడందఁడయ్యెసా
కలుషముగాదెమేదినిసిఁ - గారణమిఝ్వరిపైరవృత్తికిన్॥

టీ॥ శశిపద్మములు=చంద్రపద్మములు, కలికి=చిన్నదానియొక్క, మొగంబుడంబునకుఁగాన్=ముఖశోభకై, ఆఢ్యపుష్కరస్థలిని- ఆఢ్య=మంచిదియగు, పుష్కరస్థలిని=తీరవిశేషమందు, ఆకాశస్థలమందనియు, నీటిస్థలమందనియునర్థములు- తపస్సు తీరవిశేషమందుఁజేయుదురుగదా- ఇదియుభయుక్తసమము- ఆకాశమందని చంద్రపక్షమందును, జలమందనిపద్మపక్షమందును, ఇట్లుమూఁడర్థములుగూర్చకొనవలయును- సదా=ఎల్లప్పుడును. తపస్స్ఫురణన్=తపస్సుయొక్క స్ఫూర్తిని, సత్=యోగ్యమయిన, ఆతప=ఎండయందు, స్ఫురణన్=వికాసమునునియు, తాల్చుతతిన్=ధరించినప్పుడు

నికలంక సౌరభోజ్జ్వలతను=కలంక రాహిత్యమున, బరిమళముచేఁ బ్రకాశించు టయును, పద్మము=తమ్మి, ఒందెన్ = చెందెను, అలచందమున్ = ఆరీతిని, చంద్రుఁడు=చంద్రుఁడు, అందఁడయ్యెన్ = పొందఁడాయెను, అకలుషము = అదోషము, మేదినిన్ = భూమియందు, ఇరువురి=ఇదఱియొక్క, వైరవృత్తికిన్ = విరోధవ్యాపారమునకు. కారణముగాదె = హేతువుగాదా.

గీ. కొమ్మకేలింపలరు లేత-కొమ్మకేలి।
మేచకములచ్చెలియ నెఱుల్-మేచకములు।
తియ్యనిరుచిం దనరుమోవి-తియ్యనిరుచి।
యించుకమరుని చేవింటి-యించుకమరు॥

టీ॥ కొమ్మకేలు=చిన్నదానిచేయి, లేతకొమ్మకేలిన్=లేతకొమ్మయొక్క విలాసముచేత, ఇంపలరున్ = శోభించును, మేచకములు = నల్లయిన, అచ్చెలియ = ఆచిన్నదానియొక్క, నెఱుల్ = వెండ్రుకలు, మేచకములు = నెమలిపింఛములు. తియ్యని = మధురమగు రుచిన్ = రుచిచేత, తనరు = ఒప్పుచున్న. మోవి = అధరము, తియ్యని = వెనుకఁదీయనట్టి, రుచి = మాధుర్యము, ఇంచుక = కొంచెము, మరుని = మన్మథునియొక్క, చేవింటి = చేతిలోనిధనుస్సుయొక్క, ఇంచురున్ = చెఱకునకు, అమరున్ = ఒప్పును-

చ. కలహమునంబరస్పరముఁ-గన్పడుచన్నులకున్విభాగపుం।
గలనలసాక్షులొప్పుకొనఁ-గాముఁడుయౌవనమంత్రి చేసము।
జ్జ్వలతనలగ్నపత్రమునఁ-బట్టిలిఖింపఁగఁ జేయునక్షర।
ములనలరారుబంతియనఁ-బొటిలుఁగొల్చి మెఱుఁగారు బోటికిన్॥

టీ. కలహమునన్ = విరోధముచేత, పరస్పరమున్ = అన్యోన్యమూ, కన్పడు = అతిశయించుచున్న, కన్నులకున్ = నేత్రములకు, విభాగపుంగలన = పంపకపుచోటు, అలసాక్షులు = ప్రసిద్ధులైనసాక్షులు. మందములగు నేత్రములనియును, ఒప్పుకొనన్ = అంగీకరించఁగా, కాముఁడు = మన్మథుఁడు, యౌ

వనమంత్రిచేఁ = జవ్వనమనెడుప్రధానిచేత, సముజ్జ్వలతఁ = ప్రకాశముచేత, వలగ్నపత్రమునఁ = నడుమనెడునాకుపై, పట్టి = పట్టికొని, లిఖింపఁగఁజేయు = వ్రాయింపఁజేసిన, అక్షరమ్ములన్ = వర్ణములచేత, అలరారు = ఒప్పుచున్న, బంతియనఁ = పఙ్క్తియనునట్లు, క్రొమ్మెఱుంగారు = క్రొత్తకాంతులుగనూగారు, బోటికిన్ = చిన్నదానికి, అలరారున్ = ప్రకాశించును-

సీ. రదపాళి కెదురించి - తాలేక పాలిండ్ల,
గౌరవంబువహించెఁ - గోరకములు।
తనుకాంతి కాసించి - తానిల్వలేమికి,
కేతకినెరిఁ గొప్ప - రీతిఁ గాంచె।
నెరతొడలను బోలి - దరహితస్థితిఁ గాంచి,
కదళికల్ నఖరస - సంపదలఁ బొదలె।
మెఱుఁగారు గుణియించి - మిగులవాదిగ నిల్చి।
శైవాలము పిఱుందు - చాయ ననసె।
గీ. మధుకరమ్ములు కుంతల - ప్రథమ నెంచి।
క్రమము గాన ద్వితీయ వ - ర్ణమున నిల్చి।
జంఘలకుఁగ్రిందుపడె నార - జలజనేత్ర।
గాత్రములదీటులచరిత్ర - చిత్రమయ్యె॥

టీ. కోరకములు = మొగ్గలు, రదపాళికిన్ = దంతపఙ్క్తికి, ఎదురించి = ఎదురై తాలేక = వచ్చుటకుసామర్థ్యములేక, ర అనునక్షరము లేకయనియు నర్థము - కోరకశబ్దమందు 'ర' లేకున్న కోకమగును చక్రవాకములనియర్థము - పాలిండ్లగౌరవంబున్ = స్తనములయౌన్నత్యమును, వహించెన్ = పూనెను, కేతకి = మొగలిపువ్వు, తనుకాంతికిన్ = శరీరకాంతికి, ఆశించి = ఆశపడి, తానిల్వలేమికిన్ = తానాగలేకుండుటకు, త అను నక్షరము నిలువకుండు

టకు ననియర్థము- కేతకిశబ్దమందు త నిలువకుంటే కేకియగును- నెమలియనియర్థము- కొప్పు రీతిన్=కొప్పుయొక్క పద్ధతిని, గాంచెన్=పొందెను, కదళికల్=అరఁటులు, నెఱతొడలను=మంచివియగుతొడలను, పోలి=పోలినవియై, దరహితస్థితిన్=కొంచెమిష్టముగురీతిని. కాంచి=పొంది, ద=దకారముతోడ, రహిత=శూన్యముగు, స్థితిన్=ఉనికిని, కాంచి=పొందియనియర్థము. కదళికల్ అనుశబ్దమందు "ద" శూన్యమయితే కళికల్ అనియగును- మొగ్గలనియర్థము, నఖరసంపదలన్=గోళ్ళయొక్క శోభలచేత, పొదలెన్=వృద్ధిఁబొందెను. శైవాలము=నాచు, మెఱుఁగారున్=మెఱుఁగైననూగారును, గణించి=లెక్కించి, మిగులన్=మీరుటకు, వాదిగన్=వాదముచేయునదిగా, నిల్చి=ఉండి, 'వ' అనునక్షరముదిగిపోఁగా నిలచి. శైవాలశబ్దమందు- 'వ' అనునక్షరముదిగిపోగా- శైలముఅగును, పర్వతమనియర్థము- పిఱుందుచాయన్=కటియొక్క శోభను, ఎనసెన్=పొందెను, మధుకరమ్ములు=తుమ్మెదలు, కుంతలప్రథిమన్=ముంగురులగొప్పతనమును, ఎంచి=లెక్కించి, క్రమము గాన్=తిన్నగా, అద్వితీయవర్ణముగన్=రెండవవర్ణములేనిదిగా, అనఁగా సామ్యములేనిదై- రెండవయక్షరములేనిదై యనియునర్థము- మధుకరశబ్దమందు రెండవయక్షరము లేకుంటే మకరమ్ములు అగును- మొసళ్ళనియర్థము జంగలకున్=పిక్కలకు, క్రిందుపడెన్=తక్కువాయెను, ఔర=ఆశ్చర్యము. జలజనేత్రి=చిన్నదానియొక్క, గాత్రముల=అవయవములయొక్క, దీటుల=సమానవస్తువులయొక్క, చరిత్ర=చరితము చిత్రమయ్యెన్=ఆశ్చర్యమాయెను.

క. మెఱుఁగుపసిండికి వాసన|

చెఱకునకున్ సత్ఫలంబు-సృజియింపని యు|

క్కఱ చెలి మేనినిజిగి వా|

తెఱఁగున నిర్మించిధాత-తీర్చికొనియెన్ ॥

టీ. మెఱుఁగుపసిండికిన్ = మెఱుంగుబంగారమునకు, వాసన = పరిమళమును, చెఱకునకున్ = ఇక్షువునకు, సత్ఫలంబు = మంచిపండును, సృజియింపని = నిర్మించనట్టి, అకొఱఁత = ఆలోటు, చెలిమేనిని = చిన్నదానిశరీరమును, జగివాతెఱయును = నునుపైనయధరోష్ఠమును, నిర్మించి = చేసి, ధాత = బ్రహ్మ. తీరిచికొనియెన్ = పోఁగొట్టుకొనెను.

సీ. సరసులలోనన-బ్జములున్నఁబనియేమి,
విషములసంగతి-విడువవెపుడు।
కళలన్నెలకునెన్ని-గలిగినఁబనియేమి,
దోషాకరఖ్యాతి-దొలఁగదెపుడు।
కవజకుఁబలువృత్త-గతినున్నఁబనియేమి,
తమినోడ్డోరులఁగూడు-క్రమములేదు॥
ఘనులలోనమెఱుంగు-గలసినంతనెయేమి,
చాంచల్యమొక్కింత-జారలేదు।

గీ. కానసీచానకనుదోయి-కాననమున॥
కబ్బురపుగబ్బిగుబ్బల-కంగమునకు।
జలజచయచంద్రచక్రచం-చలలసరిగ॥
బలుకనుచితంబుగాదిట్లు-దలఁచిచూడ।

టీ అబ్జములు = పద్మములు, సరసులలోన్ = రసయుక్తులయినవారిలో, మడుగులలోననియు. ఉన్నన్ = ఉంటచేత, పని యేమి = కార్యమేమి గలదు, విషముల = ఉదకములయొక్క, . గరళములయొక్కయనియు, సంగతి = స్నేహము, ఎపుడు = ఎన్నఁడును, విడువదు = వదలదు, అన్నెలకున్ = ఆచంద్రునికి, కళలు = పదియారవభాగములు, శాస్త్రములనియు, ఎన్నిగలిగినన్, పని యేమి = కార్యమేమి, దోషాకరఖ్యాతి = పాపములకుస్థానమనుప్రసిద్ధి, రా-

నిజచేయువాఁడను ప్రసిద్ధియునియును, ఎప్పుడుఁ దొలఁగఁడు=ఎన్నఁడును పోఁడు, కవజక్కవలు=జోడైన చక్రవాకములు, వృత్తిగతిన్=మంచినడతచేత, వర్తులరీతి చేతననియును, ఉన్నఁబనియేమి=ఉన్నకార్యమేమి, తమిన్=అనురాగముచేత, రాత్రియందనియును, ఒండొరులఁ గూడుక్రమము లేదు=అన్యోన్యముఁ గలిగియుండురీతి లేదు, మెఱుంగు=మెఱుపు, ఘనులలోనన్=గొప్పవారిలో మేఘములలోననియును, కలసినంత నెయ్యేమి=కూడినంతమాత్రమున నేమి ప్రయోజనము, చాంచల్యము=చంచలత్వము, ఒక్కింతఁ జారలేదు=కొంచెమైనఁబోలేదు, కాన్=కాబట్టి, ఈబాల=ఈచిన్నదానియొక్క, కనుదోయికిన్=నేత్రద్వంద్వమునకును, ఆననమునకున్=ముఖమునకును, అబ్బురపుగబ్బిగుబ్బలకున్=ఆశ్చర్యమయినగొప్పకుచములకును, అంగమునకున్=శరీరమునకును, జల...చలలన్=జలజచయ=పద్మసమూహమును, చంద్ర=చంద్రుని, చక్ర=చక్రవాకములను, చంచలలన్=మెఱపును, ఇట్లువలంచి చూడన్=ఈప్రకారముగా వలచిచూడఁగా, సరిగన్=సమానముగా, పలుకన్=చెప్పుటకు ఉచితంబు గాదు=అర్హము గాదు.

క. వదనము వాణీవల్లభ।
పదమును మధ్యంబు విష్ణు-పదమును గెలువన్।
సదళిక యీసతి తొడలకుఁ।
గదళిక లేపగిదిఁ బోల్పఁ-గాఁ దగు నొక్కో॥

టీ. వదనము=ముఖము, వాణీవల్లభపదమును=బ్రహ్మస్థానమును పద్మమును, మధ్యంబు=నడుము, విష్ణుపదమును=ఆకాశమును, గెలువన్=జయించఁగా, సదళిక=మంచిముంగురులుగల, ఈసతి=ఈచిన్నదానియొక్క, తొడలకున్=ఊరువులకు, కదళికల్=అరఁటిని, నిందితము సదళికయనియుఁ గరము, సదళికయొక్క తొడలకుఁ గదళికను బోల్పరాదని తాత్పర్యము. ఏపగిదిన్=ఏప్రకారము, పోల్పఁగాఁ దగు నొక్కో=పోటిచేయుఁ దగునో.

సీ. అలరుబంతులటంచు-నాడవచ్చునుగాని,
యలరుబంతులటంచు-నాడరాదు।
భద్రకుంభములంచుఁ-బలుకవచ్చునుగాని,
భద్రకుంభములంచుఁ-బలుకరాదు॥
వృత్తతాళములంచు-నెంచవచ్చునుగాని,
వృత్తతాళములంచు-నెంచరాదు।
అతనుకోశములంచు-నరయవచ్చునుగాని,
యతనుకోశములంచు-నరయరాదు॥

గీ. గుణమునఁ సువర్ణమనురక్తి-గుప్తిగలిగి।
విభ్రమరమాప్తమకరికా-విలసనంబు।
విద్రుమలతోపగమక్లుప్త-విలసనంబు।
నెయ్యెలరుబాలపాలిండ్ల-దోయి నిపుడు॥

టీ- ఇచట సీసచరణములకును గీతచరణములకును సంబంధము గలుగునట్లుగాఁ జెప్పఁబడినది- గుణమునన్ = వర్తులత్వాదికమునను [అలరుబంతుల పక్షమున] దారమునని యర్థము- సువర్ణమునన్ = మంచిరంగును, (భద్రకుంభపక్షమున) బంగారమునని యర్థము- అనురక్తి = అనురాగమును (వృత్తతాళపక్షమున) ఎఱుపునని యర్థము గుప్తి = రవికకప్పు [అతనుకోశపక్షమున] దాపరికమునని యర్థము, కలిగి = ఉండి, విభ్ర........లసనంబు = విభ్రమరమా = విలాసలక్ష్మిచేత, ఆప్త = పొందఁబడిన = మకరికా = మకరికాపత్రములయొక్క, విలసనంబు = విలాసము గలదియు- విద్రు........లసనంబు, విద్రుమలతా = పగడపుతీగలయొక్క, ఉపగమ = పొందుటచేత, క్లుప్త = రచింపఁబడిన విలసనంబు = విలాసము గలదియు, ఐ = అయి, అలరు = ప్రకాశించునట్టి, బాలపాలిండ్లదోయిన్

చిన్నదాని స్తనద్వంద్వమును, ఇపుడు = ఇప్పుడు, అలరుబంతులటంచున్ = పుష్పములబంతులని. ఆడవచ్చునుగాని = పలుకవచ్చునుగాని, అలరు = శోభించునట్టి, బంతులటంచున్ = కందుకములని, ఆడరాదు = పలుకఁగూడదు - భద్రకుంభములంచున్ = బంగారు కలశములని, పలుకవచ్చునుగాని = చెప్పవచ్చునుగాని, భద్రకుంభములంచున్ = ఏనుగుకుంభస్థలములని, పలుకరాదు = వచింపఁగూడదు, వృత్త తాళములంచున్ = వర్తులములగు తాటిపండ్లని, ఎంచవచ్చునుగాని = ఎన్నవచ్చునుగాని, వృత్త తాళములంచున్ = వర్తులములగు తాళపుచిప్పలని, ఎంచరాదు = ఎంచఁగూడదు, అతనుకోశములంచున్ = మన్మథుని ధనరాసులని. అరయవచ్చునుగాని = చూడవచ్చునుగాని, అతనుకోశములంచున్ = గొప్పమొగ్గలని, అరయరాదు = చూడఁగూడదు.

క. కామినికన్గవకాంతులు॥
సోమకళావిలసనంబుఁ-జూపుచుఁ బెనులీ॥
లామీనాకృతిఁ బూనఁగ॥
గోమలికిఁ శ్రుతులు శ్రీల-గుటసందియమే॥

టీ. కామినికన్గవకాంతులు = స్త్రీయొక్క నేత్రద్వంద్వముయొక్క కాంతులు, సోమకళావిలసనంబు = చంద్రకళయొక్క విలాసమును, చూపుచున్ = కనఁబరచుచు, పెను = విస్తారమగు, లీలా = విలాసముచేతనయిన, మీనాకృతిన్ = మత్స్యాకారమును పూనఁగన్ = ధరించఁగా, కోమలికిన్ = స్త్రీకి, శ్రుతులు = చెవులు, శ్రీలగుట = శ్రీకారములగుట, లక్ష్ములగుటయని యునర్థద్వయము. సందియమే = సంశయమా, ఇచట నేత్రములయందుఁ దెల్లని రంగు గలిగియుండుంగావునఁ జంద్రకళాసామ్యముఁ జెప్పెను, కన్నులు చంద్రకళావిలాసమును మీనాకారమ్మును ధరించుట చేత సముద్రమందుఁ బుట్టిన చంద్రమత్స్యములున్నచోట సముద్రమందే పుట్టిన శ్రీయుండుటకు సందేహము లేదని తాత్పర్యము.

చ. మనసనుప్రోలినేలు నెఱ-మావిశరమ్ములదంట నిస్తుల।
స్తనగిరిదుర్గయుగ్మముతు-దన్నిలపెన్ మకరాంకుఁడప్పుచ।
య్యనఁజను నాభికూపపుత-దంకము చేఁబదలగ్నకృప్తమై।
పసుపడు నాచుతీవ గనుగఁ-బ్రాకెననందగు నారు నాతికిన్॥

టీక. మనసనుప్రోలిన్=చిత్తమనెడుపట్టణమును, ఏలు=పాలించునట్టి, నెఱమావిశరమ్ములదంటన్=శ్రేష్ఠములగు మామిడిపువ్వుల బాణములుగల నేర్పరియగుమన్మథుఁడు, నిస్తుల...తుదన్—నిస్తుల=సామ్యములేని, స్తన=కుచములనెడు, గిరిదుర్గయుగ్మము=పర్వతదుర్గద్వంద్వముయొక్క, తుదన్=చివరను, మకరాంకము=మకరికాపత్రములనెడు మొసలిజండాను, నిలపెన్=ఉంచెను. చయ్యనన్=శీఘ్రముగా, చను=వెడలునట్టి, నాభికూపపు=నాభియను నూతియందలి, తదంకముచేన్=ఆ మన్మథుని చిహ్నమగు చేపచేత. నూతియందుఁ జేపయుండుట న్యాయముగనుక యట్టిచేపయొకటి నాభికూపమునందుండి మన్మథుని ధ్వజమీనమును జూచి పైకెగసెనని తాత్పర్యము. పదలగ్నకృప్తమై=పాదమందుఁ దగులుకొన్నట్టిదియు, ఆగఁబడినట్టిదియునై. చేపకుఁ బాదములు లేకున్నను పాదములవంటి యవయవముల నిట్లు నిర్దేశించినాఁడు. పసుపడు=బాగగు, నాచుతీవ=శైవలలత, ఎగఁబ్రాకెననన్=ఎగచెనదో యనునట్లు, నాతికిన్=స్త్రీకి, ఆరు=నూగారు, తగున్=ఒప్పును.

సీ. పొలఁతిపాదపయోజ-ములపేరనవనిలోఁ,
బ్రబలఁగాఁబోలుఁబ-ల్లవచయంబు।
కలువకంటికటాక్ష-ములపేరఁబుడమిఁవ
ర్ధిలఁబోలువాలుగ-న్నులకులంబు।
కలకంఠికాలండి-యులపేరవర్ధిల్లఁ,
గాఁబోలువరహంస-కవ్రజంబు।

కుందసుందరహాస-కుంతలమ్ముల పేరఁ,
నమరఁబోలును మద-భ్రమరకంబు॥

గీ. లాకులతనున్న వలఁగొన్న-సమరభంగి।
ములఁబడినవెల్ల యెడలను-మొరయిడినను।
మించుచిగురులు వాలుగ-లంచలగులు।
గాంచఁజాలవు శృంగార-మించుకైన॥

టీ॥ పల్లవచయంబు=చిగుళ్ళసమూహము, మఱియు, పత్=పాదముల యొక్క, లవ=లేశములయొక్క, చయంబు=సమూహమనియర్థము, ఈ యర్థము పాదముల పేరఁ బ్రబలఁబోలు నని చెప్పుట కుపయోగించుచున్నది. ముందుఁగూడ నిట్లూహించవలయును- పొలఁతిపాదపయోజముల పేరన్=స్త్రీయొక్క పాదపద్మముల పేరితో, అవనిలోన్=భూమిలో, ప్రబలఁగాఁబోలున్=అతిశయించఁబోలును, వాలుగన్నుల- వాలుగ=వాలుగ చేపల యొక్క, అన్నుల=స్త్రీలయొక్క, కులంబు=జాతి, మఱియు, వాలు=దీర్ఘములగు, కన్నుల=నేత్రములయొక్క-యనియర్థము- కలువకంటికటాక్షముల పేరన్=స్త్రీయొక్క క్రేఁగంటిచూపుల పేరుతో, పుడమిన్=భూమియందు, వర్ధిలఁబోలున్=వృద్ధిఁబొందఁబోలును వరహంసకవ్రజంబు- వర=శ్రేష్ఠమయిన, హంసక=అంచలయొక్క, వ్రజంబు=సమూహము- మఱియు, హంసక=కాలికడియములయొక్క-యనియర్థము, కలకంఠి కాలందియల పేరన్=ఆచిన్నదాని పాదములయందలియందెల పేరుతో, వర్ధిలఁగాఁబోలున్=వృద్ధిఁబొందఁబోలును, మదభ్రమరకంబులు- మద=మదముతోఁగూడిన, భ్రమరకంబులు=తుమ్మెదలు, మఱియు, భ్రమరకంబులు=ముంగురులు. కుందసుందరహాస=మల్లిపువ్వులవలె సుందరమయిన నవ్వుగల స్త్రీయొక్క, కుంతలమ్ముల పేరన్=ముంగురుల పేరితో, అమరఁబోలును=ఒప్పఁబోలును, ఆకులతనున్నన్=ఆకులత్వముచేతనున్నను, [పల్లవము] ఆకు లతయందున్నదనియును, వలఁగొన్నన్=ప్రదక్షిణముఁజేసినను, [వాలుగలు]

వలలోఁ బడె ననియును, అనురక్ = ఒప్పునట్లు, భంగములఁబడిన = హానులఁ బొందినను, (హంసలు) తరంగములలోఁ బడె ననియు, ఎల్లమొదలన్నానిచోట్టుల, మొలయి కినక్ = మొత్తఁబెట్టుకొన్నను, (తుమ్మెదలు) ధ్వనిచేసెననియు, మించు చిగురులు = అతిశయించు పల్లవములును, వాలుగలు = వాలుగచేఁపలును, అంచలు = హంసలును, అళులు = తుమ్మెదలును, ఇంచుకైనక్ = కొంచెమైనను, శృంగారము = సౌందర్యమునని లాక్షణికారము. కాంచఁజాలవు = పొందలేవు.

మ. ఘనశృంగారప్రతీపయౌవననవని-గందర్పుఁడన్ హాలికుం।
డునెరాపొక్కిటిపాదునిల్పఁదనరె-న్మాగాయనాదానిమీఁ।
దనవ్రోషారుణబింబడంబరరతిన్-ద్వంద్వంబయ్యెజక్కవల్।
దనరెంజన్నులునాఁగనింతిముఖచం-ద్రశ్రీభయస్తబ్ధమై॥

టీ యౌవననవన్ = జవ్వనమనుతోటయందు, కందర్పుఁడన్ = మన్మథుఁడనెడు, హాలికుండు = సేద్యగాఁడు, నెరా = ప్రశస్తమైన, పొక్కిటిపాదు = నాభియనెడుపాదు, నిల్పన్ = ఉంచఁగా, దానియందని యధ్యాహారము. ఘనశృంగారప్రతీప = గొప్పదియగు శృంగారమనెడు తీగ, నూగాయనాన్ = రోమావళియను పేరుచేత, తనరన్ = ఒప్పెను. దానిమీఁద = దానిపైని, నవోష్ణారుణబింబడంబరరతిన్ = నూతనమగు నథగోష్ఠమనెడు సూర్యబింబము యొక్క యాటోపమందాసక్తిచేత- చక్రవాకములకు సూర్యబింబమందాసక్తికలుగుట ప్రసిద్ధము. ద్వంద్వంబయి = జోడై, జక్కవల్ = చక్రవాకములు, చన్నులనాఁగన్ = స్తనములను పేరితో, ఇంతి = ఆచిన్నదానియొక్క, ముఖ...స్తబ్ధమై — ముఖచంద్ర = ముఖమను చంద్రునియొక్క, శ్రీ = శోభయొక్క, భయ = భీతిచేత, స్తబ్ధమై = కొయ్యవారి, తనరెన్ = ఒప్పెను. చక్రవాకములు చంద్రునికి జడియుట ప్రసిద్ధము.

సీ. పడఁతిమేల్నడతలా-పరమహంసలకైన,
పతిసఖస్థితులుస-ద్వ్రతతికైన,

వనితకన్గవకాంతి-యనిమిషావళికైనఁ,
గన్నెపెన్నెరిగుంపు-ఘనులకైన।
వనజాక్షివదనమీ-శ్వరశిఖామణికైన,
వెలఁదిపలుకులు శుకా-దులకునైన।
హరిణాక్షియరిగౌను-హరికైనఁబల్లవా,
ధరయూరులు సరస-తరులకైనఁ।

గీ॥ బట్టిదర్శింపనలవిగా-దిట్టులుండ।
సతివయాసొంపులా పొంపు-లానెరాదొ।
యారములు బీరములు నుశృం-గారములును।
దరమెలెక్కింపఁదర్కింప-నరులకెపుడు॥

టీ॥ ఈపద్యమం దుపమానవస్తువులకును బూజ్యులకును శ్లేషద్వారాయభేదాధ్యవసాయముఁ జేసినాఁడు- పడఁతిమేల్నడతలు=ఆచిన్నదాని మంచిగమనములు, అపరమహంసలకైనన్=ప్రసిద్ధులగుజ్ఞానులకయినను, గొప్పహంసలకనియును, సతినఖస్థితులు=ఆచిన్నదాని గోళ్ళరీతులు, సద్విజతతికైనన్=యోగ్యులసమూహమునకైన, నక్షత్రసమూహమునకనియును, వనితకన్గవకాంతి=ఆచిన్నదాని నేత్రద్వంద్వముయొక్క కాంతి, అనిమిషావళికైనన్=దేవసమూహమునకైనను, అప్పపాటులేని చేపలసమూహమునకనియును, కన్నెపెన్నెరిగుంపు=చిన్నదానికేశసమూహము, ఘనులకైనన్=గొప్పవారికైనను, మేఘములకయిననియు, వనజాక్షివదనము=స్త్రీయొక్క మొగము, ఈశ్వరశిఖామణికైనన్=ఈశ్వరశ్రేష్ఠులకయినను, శివుని శిరోమణియగుచంద్రునకనియును, వెలఁదిపలుకులు=చిన్నదానిమాటలు. శుకాదులకునైనన్=శ్రీశుకుఁడు మొదలగువారికయిన. చిలుకలు మొదలగువానికనియును, హరిణాక్షియరిగౌను=చిన్నదాని సన్నమగునడుము, హరికైనన్=విష్ణువుకయినను, సింహమునకనియును, పల్లవాధరయూరులు=చిన్నదానితొడలు,

సరసతరులకైనన్ = మిక్కిలి సరసులగువారికయినను, రసయుక్తములగు చెట్ల కనియైనను, పట్టి = పూని, వర్ణింపన్ = వర్ణనఁజేయుటకు, అలవిగాదు = శక్యముగాదు, ఇట్టులుండన్ = ఈరీతినుండఁగా అతివ = చిన్నదానియొక్క ఆసొంపులు = ఆసొగసులు, ఆపెంపులు = ఆయతిశయములును. ఆనెరా యొయ్యారములు = ఆగొప్పవిలాసములును, బీరములును = బిగువులును, శృంగారములును = శృంగారచేష్టలును, నరులకున్ = మనుష్యులకు, ఎప్పుడున్ = ఎన్నఁడును, లెక్కింపన్ = గణనచేయుటకును, తర్కింపన్ = ఊహించుటకును. తరమె = శక్యమా?

క. కాంచనకళికాంచనమును।
గాంచెం బంకేజపాణి-ఘననాసికయు।
మ్రించులమించులమించిర।
మించులతాలలితగాత్రి-మేనిమెఱుంగుల్॥

టీ॥ పంకేజపాణిఘననాసిక = పద్మములవంటిహస్తములుగల చిన్నదానిముక్కు, కాంచనకళికాంచనమును = సంపెంగమొగ్గయొక్క గౌరవమును, కాంచెన్ = పొందెను. లతాలలితగాత్రి = తీగవలె సుందరమగు శరీరముగల స్త్రీయొక్క, మేనిమెఱుంగుల్ = శరీరకాంతులు. అమ్రించులమించుల = ప్రసిద్ధమగు మెఱుపుల కాంతులను, మించి = అతిశయించి, రమించున్ = క్రీడించును.

మ. కలయన్మీనముద్విస్వభావగరిమం-గన్దోయిదంభంబునన్।
వెలయం దచ్చనుచ్చభావమగుటన్-విచ్చేయుశుక్రుండునా।
నలరుస్మంగరము త్రైమంగనకుఁద-ధ్వ్యంబిచ్చెలింగాంచుచో।
నలఘుండాతఁడుగన్నకన్యకిలనై-చ్యంబెంచలేదే జనుల్॥

టీ॥ మీనరాశి ద్విస్వభావరాశియనియు శుక్రుకది యుచ్ఛయనియు, ఉచ్చకు నేడవరాశియగు కన్యారాశి నీచయనియు, గ్రహములన్నియుఁ దా

మున్న రాశియండి యేడవరాశిఁ జూచును గావున మీనమందున్న శుక్రుఁడు కన్యారాశిఁ జూచుననియు, జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధము. ఈపద్యము దానిననుసరించి చెప్పుచున్నాఁడు- కలయన్ = వ్యాపించునట్లుగా, మీనము = చేప, మీనరాశియు నగును, ద్విస్వభావగరిమన్ = చరస్థిర స్వభావగౌరవము చేత, కన్దోయి = ఆచిన్నదాని నేత్రద్వంద్వము యొక్క, దంభంబునన్ = మిషముచేత, వెలయున్ = ఒప్పుఁగా, తచ్ఛలన్ = కపటముచేత, ఉచ్చభావముగుటన్ = ఉన్నతత్వముగుటచేత, ఉచ్చరాశి యనియును, విచ్చేయు = వచ్చినట్టి శుక్రుంకు నాన్ = శుక్రుఁడే పోయునట్లు, ముంగరముత్తెము = ముంగిరయందలి ముత్తెము, అంగనకున్ = స్త్రీకి, అలరున్ = ఒప్పును, తథ్యంబు = నిశ్చయము, ఇచ్చెలింగాంచుచోన్ = ఈచిన్నదానిఁ జూచునపుడు, అలఘుండు = గొప్పవాఁడగు. ఆతఁడు = ఆశుక్రుఁడు, కన్నెకన్యకన్ = చూచినకన్యరాశికి, కన్నట్టిచిన్నదానికి [అనఁగా దేవయానికి, జనుల్ = మనుష్యులు, నైచ్యంబు = నీచత్వమును, ఎంచలేదే = ఆలోచించలేదా.

సీ. నానాప్రసూనాళి-లోనారసి వసంతుఁ,
డసమశౌరభవసార-మొసఁగ నొసఁగ।
ధారాళధారాసు-ధారాసుజాబిల్లి,
నెదకిసారముఁ దెచ్చి-పద నొసర్ప।
సంపాతిశంపాళి-నింపారుచకచకల్,
ఘనులోకగుప్పుగఁజే-కొనితనర్ప।
శృంగారముంగారఁ-బొంగారుబంగారు,
మేరులేర్పరచిన-మిక్కరయొసంగఁ॥

గీ. బచ్చువిలుకాఁడు లచ్చిపై-యచ్చొచ్చెనర్చి।
యచ్చరలు మెచ్చ ముచ్చటల్-హెచ్చ విచ్చ।

నిచ్చలినిఁ జేసెఁగానిచోఁ-నింతవింత।
చక్కఁదనమొక్కటనెట్లు-పిక్కటిల్లు॥

టీ. వసంతుఁడు=వసంతర్తువు, నానాప్రసూనాళిలోన్ = సమస్తపుష్పపఙ్క్తులలో, అరసి=చూచి, సౌరభసారము=మంచిపరిమళము, ఎసఁగన్=ఒప్పునట్లు, ఒసఁగన్=ఇయ్యఁగా, జాబిల్లి=చంద్రుఁడు, ధారా......... రాశిలోన్=ధారాళ=అడ్డులేని, ధారా=ధారారూపమైన, సుధా=అమృతముయొక్క, రాశిన్=రాశియందు. వెదకి=వెమకి, సారముదెచ్చి=మెఱుఁగుఁదెచ్చి, పదనొనర్పన్=తడిసేయఁగా, ఘనులు=మేఘములు, సంపాతశంపాళిన్=సంపాత=బాగుగప్రసరించుటతోఁగూడిన, శంపా=మెఱుపుయొక్క, ఆళిన్=పఙ్క్తియందు, ఇంపారు=సొగసయిన, చకచకల్=తళతళలు, ఒకగుమిగన్=ఒకప్రోగుగా చేకొని=పుచ్చుకొని=తనర్పన్=అతిశయించఁగా, మేరువు=మేరువుపర్వతము, శృంగారముంగారన్=శృంగారిం పుపొంగునట్లు, పొంగారు=అతిశయించునట్టి, బంగారు=బంగారము, ఏర్పరచి=ఏరి, నమ్మికన్=నమ్మకముచేత, ఒసంగన్=ఈయఁగా, పచ్చవిలుకాఁడు=మన్మథుఁడు, లచ్చిపైన్=లక్ష్మిమీఁద, అచ్చొసర్చి=అచ్చొత్తి, అచ్చరలు మెచ్చన్=అప్సరస్త్రీలుపొగడునట్లుగా, (అప్సరలసౌందర్యమును మించినదని తాత్పర్యము) ముచ్చటల్ హెచ్చన్=ఆనందములతిశయించఁగా, ఇచ్చన్=ఇచ్చచేత, ఇచ్చెలిని=ఈచిన్నదానిని. చేసెన్=రచించెను, కానిచోన్=కానట్టయితే, ఇంతవింతచక్కఁదనము=ఇంతచిత్రమగుసౌందర్యము, ఒక్కటన్=ఒక్కచోట, ఎట్లుపిక్కటిల్లున్=ఎట్లుగావిజృంభించును-

మ. కన్నుల్ గాంచిచకోరకఁబుపరిరాఁ-గానుచ్చవర్ణంబుతోఁ।
మిన్నాదంతములందలంచుచుసము-న్నీలద్విరేఫస్థితిం।
జన్నుల్ గాఁచినఁగోపవృత్తినవిపై-సాధింపఁగంఠంబుమేల్!
చెన్నుల్ గోరుచుసుళ్ళఁబొందెనవలా-శ్రీలబ్బునేయేరికిన్॥

టీ। చకోరకంబు=చకోరపక్షి, కన్నుల్ గాంచి=నేత్రములనుజూచి, నేత్రములతో సామ్యముఁబొందఁదలఁచియనిభావము- ఉచ్చవర్ణంబుతోన్=ఉన్నతమగుకాంతితోఁగూడి, సరిరాగాన్=సరివచ్చుట, మిన్నాదంతములన్=శ్రేష్ఠములగుదంతములను, తలంచుచున్= తలపోయుచు, (ఉచ్చవర్ణంబుతోన్=ఉత్కృష్టమయిన, అనఁగా విడువఁబడిన, చకారముతో] చకోరకంబు అనుశబ్దమందు చవర్ణము విడువఁగా, కోరకము అయినది- మొగ్గయనియర్థము- అదిదంతములసామ్యమొందినదనిభావము, సము...సిరిన్=సముత్సీలత్=అతిశయించుచున్న, విరేఫ=సౌందర్యముగాని, సిరిన్=ధనికిచేత, జన్నుల్ గాంచినన్=స్తనములఁజూడఁగా, [విరేఫసిరిన్=రఅనువక్షరములేనియూనికిచేత] చకారముపోఁగామిగిలినకోరకశబ్దమందురేఫము పోఁగా 'కోకంబు' అయినది చక్రవాకమనియర్థము, అదిస్తనములతో సామ్యమునకువచ్చెననిభావము.అవి అస్తనములు,కోపవృత్తిన్=క్రోధవ్యాపారముచేత,పైపాధింపన్=అధికములుగాఁగా,కంఠంబు=కుత్తుకయొక్క, మేల్ చెన్నెల్ మంచిశోభలు, కోరుచున్=కోరుకొనుచు, (కోపవృత్తిన్- కో=కో అనువక్షరముయొక్క, అపవృత్తిన్=నివారించుటచేత) మిగిలిన కోకంబు అనుశబ్దమందు కో అనువక్షరమునుదిసివేయఁగా, కంబు అయినది- శంఖమనియర్థము- అదికంఠముసామ్యముగోరుచున్నదనిభావము. కుర్శఁబొందన్=బాధలఁబొందదని లాక్షణికార్థము. శంఖమునకు కోఁతల సుడిదిరిగియుండునని భావము. ఏరికిన్=ఎవరికైనను, నవలా=ఆచిన్నదానియొక్క, శ్రీలు=శోభలు, అబ్బునే=దొరకునా.

సీ. ఘనచంపకస్నేహ-మునమించుమురిగురుల్,
భ్రమరకంబులటంచు-భ్రమయరాదు।
వలరేనినెనరుబా-టిలుచానయనముల్,
వాలుగమ్మలటంచుఁ-బలుకరాదు।

సీ. ఘనచంపకస్నేహ-మునమించుముంగురుల్,
భ్రమరకంబులటంచు-భ్రమయరాదు।
వలఱేనినెనరుబా-టిలుచానయనముల్,
వాలుగన్నులటంచుఁ-బలుకరాదు।
అనిశోజ్జ్వలస్ఫూర్తి-గనుబాలఫాలంబు,
చంద్రకాంతమటంచుఁ-జనువరాదు।
ఇలసల్లవవనదం-బులఁబొసంగమిజెడ,
కృష్ణవేణియటంచు-నెంచరాదు।
గీ. మదమధువ్రతవితతులు-మత్స్యసతులుఁ।
హరిణకిరణాశ్మములు-సదుల్ హరిణనయన।
కుంతలదృగాస్యవేణుల-గురుసమాఖ్య।
లేకతంబునవహించు-నేకతమున॥

టీ. ఘన...స్నేహమునన్, ఘన=గొప్పదియగు, చంపకస్నేహమునన్=సంపెంగనూనెచేత, సంపెంగపువ్వులమైత్రిచేతననియు, మించు=అతిశయించునట్టి, ముంగురుల్=అలకములు, భ్రమరకంబులటంచున్=తుమ్మెదలనుచు, భ్రమయరాదు=భ్రమపడఁగూడదు, తుమ్మెదలైనచో చంపకస్నేహమును మించవనితాత్పర్యము. భ్రమరకములని ముంగురులకుఁబేరు. వలఱేని=మన్మథునియొక్క, వలలకున్=అధికారియగు పల్లెవానియొక్కయనియు, నెనరు=స్నేహమును, పాటిలు=పొందిన, చానయనముల్=ఆచిన్నదాని నేత్రములు, వాలుగన్నులటంచున్=ఆడువాలుగలనుచు, పలుకరాదు=చెప్పఁగూడదు, ఆడువాలుగలైనచోఁ బల్లెవాని నెనరు బాటిలవని తాత్పర్యము. వాలుగన్నులని నేత్రములకు పేరు. అని...స్ఫూర్తిన్, అనిశ=ఎల్లప్పుడు, నిశేతరకాలమందు [అనఁగాఁబగటియందు] అనియు ఉజ్జ్వల=ప్రకాశించుచున్న స్ఫూర్తిన్=స్ఫురణను, కను=పొందునట్టి, బాలఫాలంబు=ఆచిన్నదానిలలాటము, చం

ద్రకాంతమటంచున్ = చంద్రకాంతమణియని, చదువరాదు = చెప్పటకూడదు, చంద్రకాంతమైనచోఁ బగటియం దుజ్జ్వలస్ఫూర్తిగవదని తాత్పర్యము. చంద్రకాంతము (చంద్రునివలె సుందరమైనది) అని నుదుటికిఁ పేరు, ఇలన్ = భూమియందు, అల్ల = ప్రసిద్ధములై, నవ = నూతనములగు, నదంబులన్ = పురుషపదములచేత, అల్లనన్ = తిన్నగా, వనదంబులన్ = మేఘములచేతననియు, బొసంగమిన్ = అనుకూలించకుండుటచేత, [జడపక్షమున మేఘములను మించియున్నదని భావము] జడ = జట, కృష్ణవేణియటంచున్ = కృష్ణవేణీనదియని ఎంచరాదు = తలఁచఁగూడదు. నదియైనచో నదములఁబొసంగుననితాత్పర్యము కృష్ణవేణి = నల్లనిజడ యని జడపేరు. మదమధువ్రతవితతులు = మదయుక్తములగు తుమ్మెదలసమూహములును, మత్స్యపతులు = అడుచేపలును, హరిణకిరణాశ్మములు = చంద్రకాంత మణులును, నదుల్ = ఏఱులును, హరిణనయన = ఆచిన్నదానియొక్క, కుంత...వేణులు — కుంతల = ముంగురులయొక్కయు, దృక్ = నేత్రముల యొక్కయు, ఆస్య = ముఖముయొక్కయు, వేణుల = జడయొక్కయు, గురుసమాఖ్యలు = గొప్పపేరులు, ఏకతంబునన్ = ఒంటరితనముచేత. ఏకతంబునన్ = ఏ హేతువుచేత. వహియించున్ = ధరించు.

వ. ఇప్పగిది ముప్పిరిఁగొను జవ్వనంబుప్పతిల్లఁ జొప్పడి యొప్పుల
కుప్పయగు నప్పొలఁతుక యప్పుడప్పుడరవిప్పువిరులందలిక్రొ
పుప్పొడికుప్పలఁ దెప్పలు దేలుచు, నిప్పుకలచొప్పున జెక్కు
లప్పళింపుచుఁ గుప్పగంతులం గుప్పళించు సఖులుగప్పికొనఁ
జొప్పడు పూఁజప్పరమ్ముల గుప్పుగుప్పున లేఁగరువలి దలిర్ప
నుప్పరంబెగయు కప్పురంపుఁదిప్పల నపికల్పకల్పనలఁ దోడు
నీడలగు ప్రోడచేడియలతోడ నాడుచుం బాడుచునుండి యొ
క్కనాఁడు మనోవినోదంబున.

టీ. స్పష్టము.

సీ. పాటీరకోటీర-కోటీసమాటీక,
మానమందమరుత్కు-మారగతులు।
నాళీకపాళీమృ-ణాళీకబళనైక,
పాకపాకమరాళ-బహువిహృతులు।
సారంగకీరాంగ-నారంగనారంగ,
పరిపక్వఫలపరం-పరలరుచులు।
వేలాపగాలాప-లీలాపరపికావ,
ళీలాలితమహాకు-హూలలితము।

గీ. తైందవశిలాకలాపని-ష్యందములును।
సారమారందసారణీ-ధోరణులును।
విలసిలునుకానుకవిలాస-విపినమునను।
దోడుచేడియలనుగూడి-యాడఁదలఁచి॥

టీ. పాటీర..గతులు — పాటీరకోటీర=శ్రేష్ఠములైన మంచిగంధపుచెట్లయొక్క, కోటీ=కోటులయందు. బహువృక్షములయందనుట, సమాటీకమాన=సంచరించుచున్న. మరుత్కుమార=పిల్లవాయువులయొక్క, గతులు=సంచారములును, నాళీక...హృతులు — నాళీకపాళీ=పద్మపఙ్క్తులయొక్క, మృణాళీ=తూండ్లయొక్క, కబళ=తినుటయందే, ఏకపాక=ముఖ్యపరిపాకముగల, పాకమరాళ=పిల్లహంసలయొక్క, బహు=విస్తారముయిన, విహృతులు=విహారములు, సారంగ...రుచులు — సారంగ=తుమ్మెదలయొక్కయు, కీర=చిలుకలయొక్కయు, అంగనా=స్త్రీలను, రంగ=విహారస్థలమగు నారంగ=నారింజచెట్లయొక్క, పరిపక్వ=పండిన, ఫల=పండ్లయొక్క, పరంపరల=పఙ్క్తుల యొక్క, రుచులు=కాంతులును, వేలా...లలితములు. వేలా=హద్దును, అపగ=దాటిపోయిన, ఆలాప=వాక్యములయొక్క, లీలా=విలాసము, పర=ప్రధానముగల, పిక=కోయిలలయొక్క, ఆవళీ=పంక్తి

యొక్క, లాలిత=సమ్మానింపఁబడుచున్న, మహత్=గొప్పలగు, కుహూ=కుహూధ్వనుల యొక్క, [కోయిలకూఁతకు కుహూవని పేరు] లలితములు=విలాసములును, ఐంద...ష్యందములును ఐందవశిలా=చంద్రకాంతమణులయొక్క, కలాప=సమూహముయొక్క, నిష్యందములును=జలప్రవాహములును, సార...ధోరణులును, సార=శ్రేష్ఠమైన, మారంద=మకరందసంబంధియగు, సారణీ=పిల్లకాలువలయొక్క, ధోరణులును=పఙ్క్తులును, విలసిలు=ప్రకాశించునట్టి, ఒకానొక విలాసవిపినమునకు=ఒకప్రమదారామమందు, తోడుచేడియలనుగూడి=చెలికత్తెలఁగూడి, ఆడఁదలఁచి=విహరింపుటకాలోచించి-

క. నిగనిగలుగలిగిసొగసగు।
తొగరుచిగురుపాదుకలను-దొడిగి చెలుల్ తో।
డుగ రామగరానిగరా।
లఁగరాళితమైనత్రోవ-లఁగనుంగొనుచున్॥

టీ॥ నిగనిగలుఁగలిగి=తాళతళ్యములుఁగలిగి, సొగసగు=మనోహరమైన, తొగరుచిగురు పాదుకలను=ఎఱ్ఱనిచిగుళ్ళ పావలను, తొడిగి=ధరించి, చెలుల్=చెలికత్తెలు, తోడుగరాన్=వెంటరాఁగా, మగరానిగరాలన్=శ్రేష్ఠములగు వజ్రములచేత. కరాళితమైన=పొడవైన, త్రోవలన్=మార్గములను, కనుంగొనుచున్=చూచుచు-

సీ. కప్పురాలొప్పురా-చప్పరాలనెసంగు,
కప్పుతాల్గప్పుమా-ర్గమున్నైనఁ।
బలుకురాచిలుకరా-జులకురాగమొసంగు,
పలుకురాల్గులుకుమేల్-పద్యనైనఁ।
బొదలసంపదలస-మ్మనలసద్గతిమించి,
పొదలుతుమ్మెదలాను-పదవినైన।

విపులపెందరులపం-దిరులఁబుప్పొడితుప్పఁ,
లుఱలుసుందరలతా-సరణినైనఁ।

గీ. కొమ్మపూరెమ్మబంగారు-బొమ్మముద్దు।
గుమ్మపోవలయునంచు-నెమ్మిచెలులు।
నమ్మికలుగ్రమ్మి తెలుపఁగా-నమ్మనోజ।
రాజసామ్రాజ్యలక్ష్మిబి-రానఁదరలి॥

టీ. కప్పు..చప్పరాలన్, కప్పు=నల్లనైన, రాలు=రాళ్ళు, ఒప్పు=ప్రకాశించు, రాచప్పరాలన్=రాతిచవికలచేత, ఎసంగు=ఒప్పునట్టి, కప్పురాల్=కర్పూరములు, కప్పు=క్రమ్మునట్టి, మార్గమునైనన్=త్రోవలయందైనను, పలుకు...రాగను, పలుకు=మాటాడు, రాచిలుక=రాజకీరముల యొక్క, రాజాలకున్=పఙ్క్తులకు, రాగమొసంగు=అనురాగమునుబుట్టించునట్టి, పలుకురాల్=ప్రతిధ్వనియిచ్చురాళ్ళు, కులుకు=ప్రకాశించునట్టి, మేల్=శ్రేష్ఠమయిన, పద్యనైనన్=త్రోవయందైనను. పాదలసంపదలన్=తీరములసంపదలయందు, సద్గతిన్=మంచిసంచారముచేత, మించి=అతిశయించి, పొదలు=వృద్ధిఁబొందునట్టి, తుమ్మెదలాడు=తుమ్మెదలు విహరించునట్టి, పదవినైనన్=త్రోవయందయినను. విపుల=పువ్వులయొక్క పెందరుల=పెద్దచెట్లుగల, పందిరులన్=పందిరులయందు, పుప్పొడి=పరాగముయొక్క తుప్పలు=ప్రోవులు, ఉరులు=జాఱుచున్న, సుందరలతాసరణినైనన్=చక్కనితీగలుగలత్రోవయందైనను, కొమ్మ=ఓచిన్నదానా, పూరెమ్మ=పువ్వుగొమ్మా, బంగారుబొమ్మ=బంగారుబొమ్మవంటిదానా, ముద్దుగుమ్మ=ఓసుందరీ, పోవలయునంచున్=వెళ్ళవలయునని, నెమ్మిచెలులు=ఇష్టమగుచెలికత్తెలు, నమ్మికలుగ్రమ్మి=విశ్వాసములుగలిగి, తెలుపఁగాన్=చెప్పఁగా, అమ్మనోజరాజసామ్రాజ్యలక్ష్మి=ఆమన్మథరాజ్యలక్ష్మి, బిరానన్=సత్వరముగా, తరలి=బయలుదేరి.

క. సకనకకైతుకవైమా
నికనికరవధూకరాగ్ర-నీరదశంకా
చకచకితకితవశిఖిమే
చకచకితమరాళశాలి-జలపదపదవిన్॥

టీ॥ స . . . విన్ - సకనక కైతుక = సువర్ణమయములయిన టెక్కెములసమూహముతోఁ గూడిన, వైమానికనికర = దేవతాసమూహముయొక్క, వధూ = స్త్రీలయొక్క, కరాగ్ర = భుజములయందున్న. నీర.....శిఖి - నీరదశంకా = మేఘసందేహముచే, చకచకిత = మిక్కిలి ప్రకాశించెడు, కితవశిఖి = ధూర్తమయూరములయొక్క, మేచక = చంద్రకముచే, చకిత = భయపడిన, మరాళ = హంసలచే, శాలి = ఒప్పుచున్న. జలపదపదవిన్ = కొలనును-

సీ. వకుళపాదపపల్ల-వకులముల్ విలసిల్లు,
ముకుళముల్ రవజల్లు-మూఁగికొనుచు
మలయమారుతపోత-వలయమాడఁగఁ జూత,
ములయచ్ఛనువీత-ములయినట్టి
తొఁగరుమించినలేఁత-చిగురుటాకుల మేఁత,
కెగరుకోయిలకూఁత-లగుడుపడుప
నదరిడెందములోన-బెదరిచూచితటాకఁ
జెదరితమ్ములలోనఁ-బదగుచుండు.
గీ. తుమ్మెదలుఝుమ్మనుచు లేచి-దొమ్మిపడుచు
నెడనెడఁజలించు నెరిగొప్ప-జడలనడరు
కమ్మతావికివెనువెంటఁ-గ్రమ్మికొనఁగఁ
దోడుచేడెలతోడను-గూడిచనుచు

టీ. వకుళ...కులముల్, వకుళపాదప=పొగడచెట్లయొక్క, పల్లవకుల
ముల్=చిగురుగుంపులు, విలసిల్లు=ప్రకాశించునట్టి, ముకుళముల్ = మొగ్గల
ను, రవఁజల్లన్ = పొడివలెఁజల్లఁగా, మూఁకొనుచున్ = ఆవరించుచు,
[ఇది తుమ్మెదలకు విశేషణము] మలయమారుతపోతవలయము = మలయ ప
ర్వతసంబంధమయిన లేత గాలియొక్క సముదాయము, అడఁగన్ = విస
రఁగా, మాతములన్ = మామిడిచెట్లలోనుండి, యదృచ్ఛను = తమంతట
దామే, వీతములయినట్టి=బయలువెడలునట్టి తొఁగరుమింపిన=ఎక్కువయెఱుపు
గల. లేఁతచిగురుటాకుల=లేతనైనపల్లవములయొక్క, మేతకున్=ఆహారమున
కు, ఎగరు=పైకిలేచిన, కోయిల = కోయిలలయొక్క, కూఁతలు = ధ్వనులు,
అగడుపడుపన్ = తొట్రుపడఁజేయఁగా, అదరి = చలించి, డెందములో
నన్ = మనస్సులో, బెదరి = భయపడి, చూచి = వీక్షించి, తటాలున్ =
హఠాత్తుగా, చెదరి = విడిపోయి, తమ్ములలోనన్ = పద్మములలో, పదరు
చుండు = ధ్వని చేయుచుండునట్టి, తుమ్మెదలు = తేంట్లు, ఝుమ్మనుచు
లేచి = ఝుంకారముఁ జేయుచులేచి, దొమ్మిపడుచున్ = చీకాకుపడుచు,
ఎడనెడన్ = అక్కడక్కడ. చలింపు = కదలెడు, నెఱి = శ్రేష్ఠమయిన,
కొప్పుజడలన్ = కొప్పులయందును జడలయందును, అడరు = ఒప్పునట్టి,
కమ్మతావికిన్ = మంచిపరిమళమునకు, వెనువెంటన్ = వెంబడిగా, క్రమ్మి
కొనఁగన్ = ఆవరించఁగా. తోడుచేడెలతోడను = చెలికత్తెలతో, కూడి=
కూడుకొని, చనుఁగన్ = వెళ్ళుము.

ఉ. అంగనయుంగనుంగొనెవ-నాంగణసంగిలవంగలుంగనా।
రంగకుడుంగశృంగశత-రంగతరంగితఖాంతరంగణా।
సంగతురంగిపుంగవవి-హంగమభృంగకులింగకాంగనా।
భంగరవప్రసంగమున-భాసిలుకేళివనీలలామమున్॥

టీ॥ అంగనయున్=ఆచిన్నదియు, వనాంగణ..ప్రసంగమునన్ వ
నాంగణ=వనసీమయందు. సంగి=కలసికొన్న, [ఉన్నవియనుట] లవంగ=
లవంగపుచెట్లయొక్కయు, లుంగ=పుల్లమాదీఫలపు చెట్లయొక్కయు, నా

రంగ = నారింజచెట్లయొక్కయు, కురుంగ = పొదలుగల, శృంగ = పర్వతశిఖరములయొక్క, శత = వందలయొక్క, రంగ = ప్రదేశములచేత, తరంగిత = వ్యాప్తమైన, ఖ = ఆకాశముయొక్క, అంతరంగణ = మధ్యప్రదేశమందలి అనంగ = మన్మథునియొక్క, తురంగపుంగవ = అశ్వశ్రేష్ఠములకు, విహంగము = పక్షులనగాఁ జిలుకలయొక్కయు, భృంగ = తుమ్మెదలయొక్కయు, కుళింగ = పక్షివిశేషములయొక్కయు, అంగనా = స్త్రీలయొక్క, అభంగ = ఎడతెగని, రవప్రసంగమునకు = ధ్వనియొక్క ప్రసక్తిచేత, భాసిల్లు = ప్రకాశించునట్టి, కేళివనీలలామమును = క్రీడావనశ్రేష్ఠమును, కనుంగొనెను = చూచెను.

వ. మఱియు నయ్యుపవనంబు జవనపవనప్లవనవిచలదమంద తటినీతటనికట చటులసురవిటపి పటపటదేలాలతికా లాలితడోలాపరిలోలామరబాలాకలితాలాప సుధాలాలస వేలాపగ లీలావరశైలాసి ఘూర్ణాకృతనీలాంబుజ జాలాంబక మూలాగమకోలాహల ఖేలాహల హాళిక మెలకువ వలకు మాకుబలుకు కలికిచిలుకపిలుకల తండంబులుద్దండంబులగు తుండంబుల ఖండింపమెండుగనవని మండలంబునంబడు ఫలఖండంబులు మెసవిమెసవి యసమకుసుమ రసవశంబున ముదముదయింప నింపుగాఁబాడున భంగభృంగాంగనల సంగీతభంగీ ప్రసంగంబున నంతరంగంబులు పొంగ నిలిచినిలిచి దరతరళతరలసదసమ కుసుమవిసరవిసృమర రజోవ్రజోపరాగంబున గాత్రమ్ములు చిత్రమ్ములుగా నుండియుండి చండకరకిరణమండలంబు మెండుకొనసలరు జ్వాలాభీషణమ్మునఁ దరలి మరుమరీచి వీచికలఁ దిరిగితిరిగిసారిగి హరిణాంకోపలఫలకములకలితాలవాల జాలమ్ములనిండిన పజ్జనలరుగొజ్జఁగితీవలనీడకొంతసేపు దాఁగుచు నంతలోనచట బింబితమ్ములగు తమవిచి

త్రగాత్రంబులు చూచిచూచి విలక్షణలక్షణ మృగమ్ములని మెం
చి యుదంచితోభయమ్మునం బరునెత్తు కురంగ పుంగవమ్ములును,
కురంగ పుంగవమ్ములం గనుంగొని యనంగసంగర ప్రసంగమ్మున
కుఁ బోషితకురంగికలం గలియఁబంచు పుళిందమిళింద సుందరా
లకాబృందమ్ముల సల్లలితచరణ పల్లవమ్ముల నుల్లసిల్లు మంజుతర
కంజరాగపుంజ పింజరిత మంజీరపుంజంబులం జెలువలరు శింజా
రవమ్ములకు బెదరి దిక్కుదిక్కుల దృక్కులు పిక్కటిల్ల మెల్ల మె
ల్లన సంచరించు పరిసర సరస్తరంగ మాలికా డోలికా కేళికా
శాలి కాంచన మరాళికా బాలికా జాలంబుల గరుత్పరంపరల
తుంపురులగుంపు తళుక్కొత్తు క్రొత్త ముత్తియంపు సంపదలనిం
పవింపెసఁగుపచ్చరాగట్టుల బిట్టులవఘళించు పద్మినీపత్రంబులఁ
జూచి తివియఁదివురనెంచు కుమారికలయంగమ్ములం గులుకు మె
ఱుంగులనియుఁ బ్రఫుల్ల పల్లవోల్లసిత సల్లకీవిటప విఘటనోచి
త కరప్రచారంబులగు సామజ వారంబుల బృంహితంబు లురు
ములనియు నావర్త నర్తనోద్వృత్త గంధ గంధవహసంధుక్షిత
విచిత్రపరాగ పూగంబులు పురందరశరాసన యోగంబులనియు
నిబిడతిమ తమాల నికురుంబంబులం బరాలంబి కాదంబినీ డంబ
రంబులనియు భ్రమించి సంభ్రమించి రమించు శిఖండిమండలం
బుల పింఛసంచలన ప్రపంచమ్ములుగాంచి తలలువాంచి గానతా
నప్రతానమ్ములఁ జాలించు పటీరవిటపి విటపకుటీతటీసటన ఘట
నపటుచటుల భుజంగపుంగవాంగనలును, భుజంగపుంగవాంగన

ల సంగీతప్రసంగంబునం గఱంగు కురంగటీయువంగులఁ జెలంగు కలువగేవి మాసికంబుల నల్లసిల్లు పెల్లువెల్లువల నల్లనల్లన నల్లుకొను మల్లికావల్లికామతల్లికల చల్లనినీడల నుండియుండి తండోపతండంబులుగా మొనుకొని యొండొరులఁ జెండాడు వరాహవ్యూహంబుల దుష్టదంష్ట్రికా ఘట్ట ఘట్టనంబులం బగులు వెదురుపొదల కణుపూడుపునంజిటిలు మౌక్తిక పటలంబులు తటాలునం దాక పులిందబృంద సందానిత నళికా పాళికోన్ముక్త గుళికా నికాయంబులని యుఱుకుఱుకు కురంగ పుంగవమ్ముల పొక్కిళ్ళఁ గక్కసంబులగు మార్గమార్గ కిరాత జాతనిఖాత ఛురికాభిఘాతంబునం జాఱు కొత్తకస్తూరికా వికారంబులం బొడము నరీణ పరిమళ పరీవాహంబులునుం గలిగి డెందంబున కమందానందంబు సంపాదింప నెచ్చెలులతోడఁ గూడుకొని యచ్చెలువ యుద్యానంబుఁ బ్రవేశించు సమయంబున.

టీ. మఱియుఁ = ఇంతే కాక, అయ్యుపవనంబు = ఆయుద్యానము, జవన ... మెలకువలకుఁ. జవన = వేగము గల, పవన = గాలి యొక్క, ప్లవన = దాటులచేత, విచలత్ = కదలుచున్న, అమంద = విస్తారమగు, తటినీ = నదుల యొక్క, తట = ఒడ్డులయొక్క, నికట = సమీపమందలి, చటుల = చంచలములగు, సురవిటపి = మందరావృక్షములయొక్క, పటల = సమూహమందు, నటత్ = ఆడుచున్న, ఏలాలతికా = ఏలకి తీగలనడు. లాలిత = లాలించఁబడు, డోలా = ఉయ్యెలలయందు, పరిలోల = ఆసక్తలగు, అమరబాలా = దేవతాస్త్రీలచేత, కలిత = పలుకఁబడుచున్న, ఆలాపసుధా = అమృతమువంటి పలుకులయందు, లాలస = ఆసక్తులగు, వేలాపగ = హద్దులేని, లీలా = విలాసముచేత, వర = శ్రేష్ఠులగు, వైలాసిక = విలాసస్వభావులయొక్క, మాలా = పఙ్క్తిచే

త, కృత=చేయఁబడిన. నీలాంబుజజాలాంబక=నల్లకలువలే బాణములుగల మన్మథునకు (అనఁగా మోహోద్దీపకమునకు) మూల=కారణమైన, ఆగమ=శాస్త్రముయొక్క (అనఁగా సంగీతముయొక్క) కోలాహల=కలకలముయొక్క, ఖేలావిలాసముయొక్క, హాళిపాళిక=సందడిగోష్ఠముయొక్క, మెలకువలకున్=నేర్పు, మురుబలుకు=మారుమాటఁజెప్పునట్టి కలికి=మనోహరములగు, చిలుకకీకల=చిలుకపిల్లలయొక్క, తండంబులు=సమూహములు, ఉద్దండంబుల తీక్ష్ణములగు, తుండంబులన్=ముక్కులచేత, ఖండింపన్=కొట్టఁగా, మెండుగన్=అతిశయముగా, అవనిమండలంబునన్=భూప్రదేశంబున, పడు=పడినట్టి, ఫలఖండంబులు=పండ్లముక్కలు, మెసవి=తిని, అసమ=సమానములేని, కుసుమరస=మకరందమునకు, వశంబునన్=స్వాధీనత్వముచేత ముదముదయింపన్=సంతోషముగలుగునట్లుగా, ఇంపుగాన్=మనోహరముగా, పాడు=గానముఁజేయునట్టి, అభంగ=భంగములేని, భృంగాంగనల=ఆడుతుమ్మెదలయొక్క, సంగీతభంగీ=గానరీతియొక్క, ప్రసంగంబునన్=ప్రసక్తిచేత, అంతరంగంబులు=మనస్సులు, ఉప్పొంగన్=ఉబ్బఁగా, నిలువిలువి=ఆగియాగి, దర. రాగంబునన్—దర=కొంచెముగా, తిరళితి=మిక్కిలి చలించుచున్న, లసత్=ప్రకాశించుచున్న, అసమ=సమానములేని, కుసుమవిసర=పుష్పసమూహముయొక్క, విస్ఫుర=వ్యాపించుస్వభావముగల, రజోవ్రజ=పరాగసమూహముయొక్క, ఉపరాగబునన్=ఆవరణముచేత, గాత్రములు=దేహములు, చిత్రములుగాన్=చిత్రవర్ణములుగలవిగా, ఉండియుండ. చండకరకిరణమండలంబునన్=సూర్యకిరణసమూహమును, మెండుకొనన్=వ్యాపించఁగా, అలరు=ఒప్పుచున్న, జ్వాలా=మంటలవలె, భీషణంబునన్=భయంకరస్థితిచేత, మరలి=మళ్ళుకొని, మరుమరీచికలన్—మరు=నీరులేనిబయళ్ళయందైన, మరీచికలన్=ఎండమావులయందు, తిరిగితిరిగి=సంచరించిసంచరించి, సొరిగి=మూర్ఛిల్లి హారి... జాలంబులన్—హరికాంతోపల=చంద్రకాంతమణులయొక్క, ఫలక=పలకలయొక్క - కుల=సమూహముచే, కలిత=చేయఁబడిన, ఆలవా

ల=పాదులయొక్క, జాలంబులన్=సమూహములయందు, నిండిన=పూరించిన, పజ్జలరు=సమీపమందొప్పుచున్న, గొజ్జఁగితీవల=గొజ్జంగితీగల యొక్క, నీరు=జలము, కొంటెసేవు=ఇంచుక సేపు, త్రావుచున్=పానము చేయుచు, అంతలోన్=అంతటిలో, అచట=ఆ పాదులయందు, బింబితంలగు=ప్రతిఫలించిన, తమ విచిత్రగాత్రంబులు=స్వీయములగు చిత్రశరీరలు, చూచి=ఆలోకించి, విల..మృగమ్ములని, విలక్షణ=వేరురూపుగల లక్షణ=స్వరూపములుగల, మృగమ్ముల=మెకములని, ఎంచి=ఆలోచించి, ఉదంచితభయమ్మునన్=అతిశయించిన బెదురుచేత, పరువెత్తు=పరుగువారుచున్న, కురంగపుంగవమ్ములు=సుశ్రేష్ఠములగు లేళ్ళు చు, కురంగపుంగవమ్ములన్=శ్రేష్ఠములగు లేళ్ళను, కనుంగొని=చూచి, అనంగ...ప్రసంగమ్మునన్--అనంగసంగర=సంభోగముయొక్క, ప్రసంగంబునకున్=ప్రసక్తికై, పోషిత కురంగికలనన్=పెంపుడు లేళ్ళను, కలియఁబంచు=కలియుటకై పంపునట్టి, పుళింద...బృందమ్ముల—పుళింద=చెంచువాండ్రయొక్క, పుళిందసుందరీలకా=స్త్రీలయొక్క, బృందమ్ముల=సమూహములయొక్క, సత్=మంచివియగు లలిత=సుందరములగు, చరణపల్లవమ్ములన్=చిగుళ్ళవంటి పాదములయందు, ఉల్లసిల్లు=ప్రకాశించుచున్న, మంజుతర=మిక్కిలిమృదువులగు, కంజరాగ=పద్మరాగములయొక్క, పుంజ=సమూహముచేత, పింజరిత=వ్యాపించఁబడిన, మంజీర=అందెలయొక్క, పుంజంబులన్=సమూహములయందు, చెలువలరు=శోభించుచున్న, శింజారవమ్ములకున్=శింజాధ్వనులకు, బెదరి=భయపడి. దిక్కుదిక్కులన్=ప్రతిదిక్కులయందును, దృక్కులు=చూపులు, పిక్కటిల్లన్=విజృంభించఁగా, మెల్లమెల్లనన్=మందమందముగా, సంచరించు=తిరుగునట్టి, పరి...జాలంబుల=పరిసర=సమీపమందలి, సరః=మడుగులయొక్క, తరంగ=అలలయొక్క=మాలికా=పఙ్క్తులనెడి, డోలికా=ఉయ్యాలలయందు, కేళికా=క్రీడతోడ, శాలి=ఒప్పుచున్న, కాంచనమరాళికా=బంగారుపుస్త్రీహంసలయొక్క, బాలికా=పిల్లలయొక్క, జాలంబుల=సమూహములయొక్క, గరుత్=ఱెక్కలయొక్క, పరంపరల=

పక్షులయొక్క, తుంపురుల=జలబిందువులయొక్క, గుంపు= సమూహము. తళుకొత్తు=తళతళలాడు, క్రొత్తముత్తియంపు= క్రొత్తముత్తెములయొక్క. సంపదలన్=సంపత్తులచేత, ఇంపెసఁగు=మనోహరములగు, పచ్చరాతిట్టుల=పచ్చరాళ్ళప్రదేశములయొక్క, బిట్టులు=అతిశయములు, అవఘళించు=తిరస్కరించునట్టి, పద్మినీ=తామరతీగెయొక్క, పత్రంబులన్= ఆకులను, చూచి=వీక్షించి, తివియన్=వానిలాగుటకు, తివురుసెంచు= వేడుకపడు కుమారికల=చిన్నపిల్లలయొక్క, అంగమ్ములన్=శరీరములను, కులుకు=శోభించునట్టి, మెఱుంగులనియును=మెఱపులనియును, ప్రఫుల్ల ........చారంబులగు. ప్రఫుల్ల=వికసించిన, పల్లవ=చిగుళ్ళచేత, ఉల్లసిత=ప్రకాశింపఁజేయఁబడిన, సల్లకీ=అందుగుజెట్లయొక్క, విటప=శాఖావిస్తారముయొక్క, విఘుటన=విరచుటకు, ఉచిత=తగిన, కర= తుండములయొక్క, ప్రచారంబులగు=ప్రసారముగలవియగు, సామజ=ఏనుఁగులయొక్క, వారంబుల=సమూహములయొక్క, బృంహితంబులు=బృంహితధ్వనులు, ఉరుములనియును=గర్జితములనియును, అవర్త........పూగంబులు=ఆవర్తనర్తన=సుడి దిరుగుటయందు, ఉద్వృత్త=అతిశయించిన, గంధ=పరిమళముయొక్కయైన, గంధవహ=గాలిచేత, సంధుక్షిత=మూర్ఛఁబడిన, విచిత్ర=అనేకవర్ణములుగల, పరాగ=పుష్పాదులయొక్క, పూగంబులు=సమూహములు, పురందరశరాసన= ఇంద్రధనుస్సుయొక్క, యోగంబులనియు=సంబంధములనియును, నిబిడతర=మిక్కిదట్టముగు, తమాల=చీకటిమ్రానుచెట్లయొక్క, నికురుంబంబులు=సమూహములు, అంబరా..డంబరంబులు. అంబర = ఆకాశమందు, అలంచి=వ్రేలుచున్న, కాదంబినీ=మేఘపఙ్క్తియొక్క. డంబరంబులనియును=ఆటోపములనియును భ్రమించి= భ్రమపడి, సంభ్రమించి= త్వరపడి,రమించు= క్రీడించునట్టి, శిఖండిమండలంబుల= నెమిలిగుంపులయొక్క, పింఛ= పురులయొక్క, సంచలన= కదలుటయొక్క, ప్రపంచమ్ములు=విస్తారములు, కాంచి= చూచి, తలలు=శిరములు, వాంచి = వంచి గానతానప్రతతమ్ములన్ = సంగీతములయందలి తానముల సమూహములను, చాలించు= మానునట్టి, పటీర...

గనలునః—సత్కీరవిటపి = మంచిగంధపు చెట్లయొక్క, విటప = శాఖావిస్తారముయొక్క, కుటీ=చిన్నయిండ్లయొక్క, తటీ=ప్రదేశమందు, నటన=సంచారముయొక్క, ఘటన=కూర్పుటయందు, పటు=సమర్థములయిన, చటుల=చంచలములగు, భుజంగపుంగవ=సర్పశ్రేష్ఠములయొక్క, అంగనలును=స్త్రీలును, భుజంగపుంగవాంగనల=సర్పశ్రేష్ఠముల స్త్రీలయొక్క, సంగీతప్రసంగంబునన్=గానప్రసక్తిచేత, కలంగు=నీరుస్రవించునట్టి, సురంగటి=దగ్గిరనున్న, అరుగులన్=వేదికలయందు, చెలంగు=ఒప్పుచున్న, కలువరేనిమానికంబులన్=చంద్రకాంతమణులచేత, ఉల్లసిల్లు=ప్రకాశించునట్టి పెల్లు=విస్తారమగు, వెల్లువన్=నీటికాలువలచేత, అల్లనల్లనన్=మెల్లమెల్లగా, అల్లుకొను=ఆవరించునట్టి, మల్లికావల్లికామతల్లికల=శ్రేష్ఠములగు మల్లెతీగలయొక్క, చల్లనీడలన్=శీతలచ్ఛాయలయందు, ఉండియుండి=నిలచినిలచి, తండోపతండంబులుగా, తేఁపిలేక, =మెండుకొనఁ=అతిశయించి, ఒండొరులన్=అన్యోన్యము, చెండాడు=కొట్టునట్టి, వరాహవ్యూహంబుల=పందులగుంపులయొక్క, దుష్ట=కఠినములగు, దంష్ట్రికా=కోరలయొక్క, ఘట్ట=సమూహముయొక్క, ఘట్టనంబులన్=దెబ్బలచేత, పగులు=బ్రద్దలయిన, వెదురుపొదల=వెదురుడొంకలయొక్క, కణుపూడుపునన్=కణుపులూడిపోవులచేత, ఒటిలు=తూలునట్టి, మౌక్తికపటలంబులు=ముత్తెపుసమూహములు, తటాలునన్=చటుకున, తొఁకన్=తొగుచుఁగా, పుళింద.....నికాయంబులు, పుళింద=చెంచువాండ్రయొక్క, బృందా=సమూహముచేత, సందానిత=కూర్చఁబడిన, నళికా=తుపాకులయొక్క, నాళికా=పఙ్క్తిచేత, ఉన్ముక్త=విడువబడిన. గుళికా=గుండ్లయొక్క, నికాయంబులని=సమూహములచే, ఉరుసు=తూలిపడుచున్న, ఉరు=గొప్పవియగు, కురంగపుంగవమ్ముల=మంచిమృగములయొక్క, పొక్కిళ్ళన్=నాభులయందు, కక్కసంబులగు=కఠినములగు. మర్గ=కస్తూరియొక్క మార్గ=వెదుకుటగల, కిరాతజాత=చెంచువాండ్రసమూహముచేత, ఖాత=పొడితఁబడిన, ఛురికా=కత్తులయొక్క అభిఘాతంబులన్=దెబ్బచేత, జా

రు = తొరగునట్టి, క్రొత్త = నవీనమయిన, కస్తూరికావికారంబులన్ = కస్తూరియొక్క వ్యాప్తిచేత, పొడము = పుట్టునట్టి, అరీణ = జారినట్టి, పరిమళ = వాసనలయొక్క, పరీవాహంబులును = ప్రవాహములును, కలిగి = ఉండి, డెందంబునకున్ = మనస్సునకు, అమంద = అధికమయిన, ఆనందంబు = సంతోషమును, సంపాదింపన్ = పుట్టింపఁగా, అచ్చెలితోడన్ = ఆచెలికత్తెతో, కూడుకొని = కలసికొని, అచ్చెలువ = ఆచిన్నది ఉద్యానంబున్ = ఉద్యానవనమును, ప్రవేశించుసమయంబునన్ = ప్రవేశించునప్పుడు.

క. వనపాలికనత్తరినొక।
వనపాలికి వినయమెనయ-వచ్చి జగజ్జీ।
వనపాలికయా కైరవ।
వనపాలికపాదములను-బడియిట్లనియెన్॥

టీ. వనపాలికన్ = వనపఙ్క్తియందు, అత్తరిన్ = ఆసమయమందు, ఒకవనపాలిక = ఒకవనమును గాపాడునాడుది, వినయమెనయన్ = వినయమొప్పునట్లు, వచ్చి = ఏతెంచి, జగజ్జీవనపాలిక = జగత్ = లోకముయొక్క, జీవన = జీవితమును, పాలిక = పాలించునట్టి, ఆ = అట్టి, కైరవవనపాలిక = కైరవవన = కలువపాదను, పాలి = పాలించునట్టి చంద్రునివంటి, అలిక = లలాటముగలచిన్నదానియొక్క, పాదములను = కాళ్ళపైని, పడి = ఒరఁగి, ఇట్లనియెన్ = ఈప్రకారము జెప్పెను.

సీ. తొఁగకంటికంటెయు-ధ్వగమానలుంటాక్,
కంటకంబగునీకు-రంటకంబు।
వించుబోడిరొవిలో-కించితేమదభ్రుం,
కంపకంబైనయి-చంపకంబు।

కంజాక్షికనుఁగొంటె - మంజరీకింజల్క,
మంజులంబైనయీ - వంజులంబు!
కాంచనాంగిరో విలో - కించితేయుల్లాసి,
కేసరంబైనయీ - కేసరంబు!
గీ. కీరకంఖాణరింఖణ - ధీరపంచ
బాణబహుళప్రతాపపా - వకశిఖాని
కాశపల్లవజాతమీ - కాంతమౌత!
జాతమునుజూచితే బాల - చంద్రఫాల॥

టీ. తోఁగకంటి = కలువవంటికన్నులుగలయోచిన్నదానా, అధ్వ...కంటకంబు అధ్వగ = మార్గస్థులయొక్క (అనఁగా విరహవంతులయొక్క) మానస = గర్వమునకు లుంటాక = హరించునట్టి, కంటకంబగు = ముండ్లుగల, ఈకురంటకంబుఁ = ఈపచ్చపువ్వులగోరంటచెట్టును, కంటె = చూచితివా. ఇంచుబోఁడిరో = చెఱకువలెమనోజ్ఞములగు నవయవములుగలయోచిన్నదానా, మద = మదముతోఁగూడిన, భృంగ = తుమ్మెదలకు, కంపకంబగు = కంపింపఁజేయునట్టి, ఈదంవకంబుఁ = ఈసంపెంగచెట్టును, విలోకించితే = చూచితివా, కంజాక్షీ = పద్మములవంటినేత్రములుగలయోచిన్నదానా, మంజ..మంజులం = మంజరీ = పువ్వులగుత్తులయొక్క, కింజల్క = కేసరములచేత మంజులంబై = మనోజ్ఞమైన, ఈవంజులంబుఁ = ఈయశోకవృక్షమును, కనుగొంచూచితివా, కాంచనాంగిరో = బంగారము వంటి దేహముగల యోచిన్నదానా, ఉల్లాసికేసరంబు = వికసించిన కింజల్కములు గల, ఈకేసరంబుఁ ఈపొగడచెట్టును, విలోకించితే = చూచితివా, కీర...జాతము. కీరకంఖాణ = చిలుకయే గుఱ్ఱముగల మన్మథునియొక్క, రింఖణ = చలనముగల, ధీర గంభీరముతైన, పంచబాణ = అయిదుబాణములయొక్క, బహుళ = విస్తారమగు, ప్రతాపపావక = ప్రతాపాగ్నియొక్క, శిఖా = జ్వాలల తోడ, నికాశ = సమానమగు, పల్లవ = చిగుళ్లయొక్క, జాతము = సమూహముగల

ఈ=ఇట్టి, కాంత=సుందరమయిన, చూత=మామిడిచెట్లయొక్క, జాతము
ను=సమూహమును, బాలచంద్రఫాల=లేఁతచందురునివంటి లలాటముగల
యో చిన్నదానా, చూచితే=కనుఁగొంటివా.

శా. సంతుష్టాంతరకంతురాజకరవి-శ్రాంతానలాంతశ్శిఖా।
సంతప్తాంతలతాంతకుంతకృతదు-స్సంతాపచింతాపరి।
శ్రాంతస్వాంతనితాంతతాంతతరుణీ-సంతానమిక్కాననో।
పాంతంబింతిరో నీవు రా వనరమా-దంతంబు చేఁబొల్చెడిన్॥

టీ. సంతు......సంతానము, సంతుష్ట=సంతోషించిన, అంతర=అంతఃకరణగల, కంతురాజ=మన్మథరాజుయొక్క, కర=హస్తమందు, విశ్రాంత=నిలచియున్న, అనల=అగ్నియొక్క, అంతశిఖా=లోపలిజ్వాలల చేత, సంతప్త=కాల్పఁబడిన, అంత=చివరలుగల, లతాంత=పుష్పములనెడి, కుంత=ఈటెలచేత, కృత=చేయఁబడిన, దుస్సంతాప=దుష్టతాపముచేతనైన, చింతా=విచారముచేత, పరిశ్రాంత=అలసిన, స్వాంత=చిత్తముగలిగినట్టియు, నితాంత=అత్యంతము, తాంత=బడలికగల, తరుణీ=స్త్రీలయొక్క, సంతానము=సమూహముగల, ఇక్కాననోపాంతంబు=ఈవనప్రాంతము, ఇంతిరో=ఓచిన్నదానా, నీవురాన్=నీవురాఁగా, వనరమాదంతంబుచేన్=వనలక్ష్మీవార్తచేత, పొల్చెడిన్=ఒప్పును.

క. అనివనపాలిక దెలుపఁగ।
మనమున ముదముదయమంద-మందారలతా।
ఘనసరణిఁ దరుణి చనుచోఁ।
జనువున నవచంద్రికయను-సఖి యిట్లనియెన్॥

టీ. అని=ఇట్లని, వనపాలిక=వనపాలిక, తెలుపఁగన్=చెప్పఁగా, మనమునన్=మనస్సునందు. ముదము=సంతోషము, ఉదయమందన్=పుట్టఁగా, మందారలతా=మందారవృక్షపుతీగలయొక్క, ఘన=గొప్పదియగు, సర

ణిగాఁడ్రోత్రనయందు. తరుణి=ఆచిన్నది, చనుచోన్=వెన్నెలవలె, చను వునన్=స్నేహముచేత, నవచంద్రికయనుసఖి=నవచంద్రికయను పేరుగలచె లికత్తె, ఇట్లనియెన్=ఈప్రకారము జెప్పెను.

చ. జలజల రాలుపూలలర-సాలరసాలరసాజరాజిలోఁ।
పలుఁదగుకోకిలచ్ఛటల-పాటలపాటలపావనామృతో।
జ్జ్వలతఁదలిర్పనేర్పుఁగల-వాకలవాకలవాణి యోరనీ।
వలరులతాళినేలనవ-లానవలానవలాఘవంబునన్॥

టీ. జలజల రాలు=జల్లుగ రాలునట్టి, పూలలరన్=పువ్వములు వికసించఁగా సాల...లోఁ పలన్ - సాల=మద్దులు, రసాల=తీయమామిళ్ళు అన్నట్టి, రసాజ=వృక్షములయొక్క, రాజిలోఁ పలన్=పఙ్క్తిలో, తగు=అమరిన, కోకిలచ్ఛటల=కోయిలగుంపులయొక్క, పాటలన్=గానములను. పాటల...జ్జ్వలత - పాటల=కలిగొట్టు చెట్లయొక్క, పావన=నిర్మలమయిన, అమృత=మకరందమువలె, ఉజ్జ్వలత=ప్రకాశము, తలిర్పన్=ఒప్పునట్లు, నేర్పుఁగలవా=కలుపఁగలవా, కలవాణి=అవ్యక్తమధురవాక్కుగలయోచిన్నదానా, నీవు-అలరులతాళిన్=పువ్వుతీవలగుంపునందు, ఒరఁగలవా=ఒరఁగగలవా, నవలా=ఓచిన్నదానా, నవలాఘవంబునన్=క్రొత్తయగౌరవముచేత నవలు=నగలు, ఆననేల=పొందనెందుకు, వలా=(వబలకభేదముచేత)బలా యనిప్రశంసార్థము. [పువ్వుదీవలచెంత నిలువఁబడినచో నగలుధరించుట యగౌరవమే కాని వేరులాభము లేదని తాత్పర్యము]

చ. కలరవకీరవారకలి-కాకలికాకలికావికారముల్।
తొలఁగకయొప్పుకల్పలత-లోలతలోలతలాదరీవన।
స్థలిఁగనుఁగొంటెనీవువని-తావనితావనితావమందకీ।
నెలవులుజూడుమావరమ-ణీరమణీరమణీయపైఖరుల్॥

టీ॥ కలరవకీరవారకలికాకలికా, కల=అవ్యక్తమధురమగు, రవ=ధ్వనిగల, కీర=చిలుకలయొక్క, వార=సమూహముతోడ, కలి=వినోదముగల, కాకలికా=సూక్ష్మమధురధ్వనిగల యోచిన్నదానా, కలికావికారముల్=మొగ్గలప్రాముఖ్యములను, తూలఁగ=విడిపోఁగ, కల్పలతి=కల్పవృక్షలత, లోలతన్=చాంచల్యముచేత, ఒప్పన్=ప్రకాశించిన, లోలతలోదరీ=చంచలమగునా చేతివలె పలుచనగునుదరముగల యోచెలీ, నీవు=నీవు, వసలిన్=వనభూమినికనుఁగొంటి, చూచితివా, వనితా=ఓచిన్నదానా, వని=ఉద్యానము, తావి=వాసనలమని తాపమందక=బాధజెందకుము- వరమణీ=శ్రేష్ఠములగుమాణులుగలదానా, రమణీ=సుందరీ, రమణీయవైఖరిన్=మంచిరీతిచేత, ఈవెలవులుదాడుమా=ఈస్థలములుగాంచుమా.

సీ. వనవనప్రథితదే-వనవనప్రియగుహుహూ,
ఘనఘనప్రచితెరం-జనజనంబు।
కలకలస్ఫురదగాం-చలచలత్కుసుమకే,
వలవలద్భ్రమరపు-ష్కలకలంబు।
సరసరజ్యకురుకే-సరసరప్రభవదా,
దరదరస్ఫురలికే-స్వరసరంబు।
ధగధగజ్జ్వలనపుం-జగజగజ్జయిసుమా,
స్తగశుగర్దితమనో-జ్జగజగమున।
గీ. మలయమలయజధరణిభృ-ద్వలయనిలయ।
పవనజవనటమురులతో-పవనభవన।
భవనవరజోత్ప్రజోదయ-భాసురంబు।
వాసికిపుడెక్కెనువసంత-వాసరంబు॥

టీ. వన...జనంబు = వనవన = ప్రతివనమందును, ప్రథిత = ప్రసిద్ధమగు, హేవా = క్రీడగల, వనప్రియా = కోయిలలయొక్క, కుహూ = కో యను ధ్వనిచేత, ఘనఘన = ఘనప్రకారమగునట్లు, ప్రచిత = వ్యాప్తమగు, రంజన = సంతోషముగల, జనంబు = మనుష్యులుగలదియు, కల.....కలంబు = కలకలధ్వనుల చేత స్ఫురత్ = ప్రకాశించుచున్న, అగాంచల = కొంబచివరలయందు, చలత్ = కదలుచున్న, సుమ = పుష్పములయందు, కేవల = ముఖ్యముగా, వలత్ = చంచలించుచున్న, భ్రమర = తుమ్మెదలయొక్క, ప్రకర = విస్తారమగు, కలంబు = అవ్యక్తమధురధ్వనిగలదియు, సరస..సారంబు సరస = మకరందముతో గూడినట్టియు, రజ్యత్ = ప్రకాశించుచున్న, ఉరు = గొప్పలగు, కేసరసర = పొగడపూదండలయందు, ప్రభవత్ = పుట్టుచున్న, ఆదర = ఆదరముగల, దరస్ఫురిత = ఇంచుక చలించుచున్న, కిన్నర = దేవయోనివిశేషులును, నరంబు = మనుష్యులునుగలదియు, ధగ.........గమనము = ధగధగత్ = ధగధగలాడుచున్న, జ్వలన = అగ్నికణములయొక్క, పుంజ = సమూహమును, గ = పొందిన, జగజ్జయ = లోకములను జయించిన, సుమాశుగ = మన్మథునిచేతనైన, శుక్ = దుఃఖముచేత, అర్దిత = పీడింపఁబడిన, మనోజ్ఞ = మనఃప్రదములుగల, గజగమనయు = స్త్రీలుగలదియు, అలయ...భాసురంబు — అలయ = అణఁగిపోవని, మలయజధరణీభృత్ = మలయపర్వతముయొక్క, వలయ = మండలమందు, నిలయ = స్థానముగల, పవన = గాలియొక్క, జవ = వేగముచేత, నటత్ = కదలుచున్న, ఉరు = గొప్పలగు, లత = తీగలుగల, ఉపవనభవన = ఉద్యానగృహములయందు, భవ = పుట్టిన, నవరజః = క్రొత్తపుప్పొడులయొక్క, వ్రజ = సమూహముయొక్క, ఉదయ = పుట్టువుచేత, భాసురంబు = ప్రకాశించుచున్న, వసంతవాసరంబు = వసంతర్తుదినము, ఇపుడు = ఈకాలమందు, వాసికెక్కెను = ప్రసిద్ధికెక్కెను,

చ. వనవనితాతనుస్ఫురిత-వక్రనఖాంకములంగఁ జాగ్నిలం।
బనశరముల్ ప్రసూనరస-వర్షపురందరగోపముల్ సఖీ।

లనవనదేవతాచరణ-లక్షణలాక్షలు పక్ష్మలేక్షణా।
మనసిజదావపావకస-మగ్రశిఖల్ దగెఁ గింశుకావళుల్॥

టీ. వన...నఖాంకములు — వనవనిత = వనమను స్త్రీయొక్క, తను = శరీరమందు, స్ఫురిత = ప్రకాశించుచున్న, వక్ర = వంకరలైన, నఖాంకములు = నఖక్షతములైనట్టియు, అంగ...శరముల్ — అంగజ = మన్మథుని యొక్క, అగ్నిలంబన = అగ్నిని జల్లుచుండు, శరముల్ = బాణములైనట్టియు, ప్రసూన...గోపముల్ — ప్రసూనరస = మకరందముల యొక్క, వర్ష = వానలయందలి, పురందరగోపముల్ = ఆర్ద్రపురుగులైనట్టియు, సఖే...లాక్షలు — సఖేలన = విలాసములతోఁ గూడిన, వనదేవతా = వనలక్ష్మియొక్క, చరణలక్షణ = పాదచిహ్నములయందలి, లాక్షలు = లాక్షారసములైనట్టియు, పక్ష్మశిఖల్ = పక్ష్మలేక్షణా = స్త్రీలయందలి, మనసిజ = కామునకును. దావపావక = కార్చిచ్చుయొక్క, సమగ్ర = సంపూర్ణములగు, శిఖల్ = జ్వాలలయిన, కింశుకావళుల్ = మోదుగుపువ్వులపఙ్క్తులు, తగెన్ = అనుకూలముగానుండెను.

సీ. గళితమైయరవింద-మిళితమైమకరంద,
మొలయఁగిన్నెలఁదేనె-లుంచవలదు।
లలితమైపవనసం-చలితమైసుమబృంద,
మెసయఁబూవ్రులపాన్పు-వేయవలదు।
కలితమైతరుముఖ-స్ఖలితమైశీకరాళి,
నెరయఁజొక్కపుబుక్క-సింపవలదు।
లలితమైపికముఖో-జ్జ్వలితమైపంచమ,
స్వరముమించపిపంచి-నరయవలదు।

గీ. వల్లరితమల్లివల్లిమ-తల్లి పేల్లి।
లతలుపొదలల్లసిల్లను-న్నముఁదలిర్ప।

టీ. బాలరో = చిన్నదానా, ఈ మధూకతరుపఙ్క్తి = ఈయిప్పచెట్లవరుస యొక్క, వినోదముల్ = సంతోషమును, చూడు = కన్గొనుము. చేడియల్ = స్త్రీలు, మేలగు తేనెలు = మంచిమధువులు, ఆని = త్రాగి, మద...తలై — మద = మత్తుచేత, మీలిత = మూయఁబడిన, లోల = చంచలములగు, విలోచనాంతలై = నేత్రాంతములు గలవారై, వ్రాలుచున్ = తూలుచు, పుక్కిటన్ = బుగ్గలలోపల, మిగులువానిన్ = మొక్కవయయిన వానిని, క్రోయఁగన్ = క్రక్కఁగా, తానున్ = ఇప్పయునుట, పూవుపుక్కిటన్ = పుష్పమనెడు పుక్కిటియందు, తాలుచున్ = ధరించుచునట్టి, తేనెన్ = మధువును, కలికోపక్లప్తిచేన్ — కలి = ద్వేషము చేతనైన, కోప = కోపముయొక్క, క్లప్తిచేన్ = చేయుట చేత, కలికా = మొగ్గలయొక్క, ఉపక్లప్తిచేన్ = రచనచేతఁనైయు, ఉమిసెన్ = ఉమ్మివేసెను. అహహా = ఆనందార్థకమగు నవ్యయము,

ఉ. కొమ్మరొ పువ్వుగుత్తి కొన-గొమ్మను గాంచి గ్రహించనెంచుచుం
గ్రమ్మి చెలుల్ పదంబు పృథు-కాండమునందు నుపంబొసంగుఁ బు
ష్పమ్ములశోకమూలమునఁ-బ్రాయఁపు బాలల కాలు సోఁకినం
గ్రమ్మవె పల్లవప్రకృతి-గల్గిన చో సుమనోవినోదముల్॥

టీ. కొమ్మరో = చిన్నదానా. చెలుల్ = స్త్రీలు, పూవుగుత్తిన్ = పువ్వులగుత్తిని, కొనగొమ్మను = చివరకొమ్మయందు, గాంచి = చూచి, గ్రహింపన్ = పుచ్చుకొనుటకు, ఎంచుచున్ = తలఁచుచు, క్రమ్మి = ఆవరించి, పదంబు = పాదము, పృథుకాండమునందున్ = గొప్పమానియందు ఉనుపన్ = ఉంచఁగా, పుష్పమ్ములు = పువ్వులు, అశోకమూలమునన్ = అశోకవృక్షముయొక్క మొదటియందు, పొసంగున్ = బాగుగనుండును, ప్రాయపుబాలలు = యౌవనముగల స్త్రీలయొక్క, కాలుసోఁకినన్ = పాదము ప్రసరించఁగా, పల్లవప్రకృతి = విటస్వభావము, చిగుళ్ళస్వభావమనియును, కల్గినచోన్ = ఉన్నచోట, సుమనోవినోద

ములు = లెప్పుడయుఁ చిత్తవినోదములు, పుష్పవినోదములనియు, క్రమ్మఁగన్ = వ్యాపించఁగా.

చ. కలికికవుంగిటం గురవ-కమ్ములఁ గొమ్మలు నెమ్మిఁ గ్రమ్మఁ గా।
వలఁగొను గబ్బిగుబ్బలను-వర్తిలు వర్తులతాకఠోరతల్।
తెలిసి మదిన్ ముదంబలరఁ-దేఁకు వసంతుని హర్షబాష్పముల్।
పులకలనంగ రంగలరెఁ-బుష్పరసమ్ములుఁ బుష్పపాళికల్॥

టీ. కలికి=ఓ చిన్నదానా, కొమ్మలు = స్త్రీలు, కవుంగిటన్ = కౌఁగిటియందు, కురవకమ్ములు = గోరంటచెట్లు, నెమ్మిన్ = ప్రీతిచేత, క్రమ్మఁగాన్ = ఆవరించుచుండఁగా, వలఁగొను = చుట్టుకొనిన, గబ్బిగుబ్బలన = వృద్ధములగు స్తనములయందు, వర్తిలు = ఉండునట్టి, వర్తులతాకఠోరతల్ = గుండ్రదనమును కాఠిన్యమును, తెలిసి = ఎఱిఁగి, మదిన్ = మనస్సునందు, ముదంబలరన్ = సంతోషమొప్పునట్లుగా, తేఁకు = బయలు వెడలునట్టి, వసంతుని = వసంతునియొక్క, హర్షబాష్పముల్ = సంతోషముచేతనైన కన్నీళ్ళును, పులకలు = పులకాంకురములును, అనంగన్ = అనునట్లు, పుష్పరసమ్ములు = మకరందములును, పుష్పపాళికల్ = పుష్పపఙ్క్తులును. రంగలరెన్ = ప్రకాశించెను.

## రగడ

మధురమధురసైకపాకి-మహితఫలరసాలసాల।
పృథివిఁ దివసించుమించు-పికము జూడ వెలబాల।
తొగరుజిగురులందు జిందు-తొలిమధూళిసోనవాన।
కెగరుఁబొగరు తేఁటికోటి-నెనయుమనుపమానచాన।
మాటిమాటికింపు నింపు-మలయపవనుఁడంచు వేఁచు।
నాటినాటికిందువిందొ-నర్చువిరుల మించుమించు।
కంటకంకివిల్లు జెల్లు-ఘనుని మేటిధాటిఘోటి।

యెంటిగంటినేయుమేయు-నగుణబింబకోటిబోటి।
శాలమాలతీలతాల-వాలజాలమందుఁబొందు।
నేలమూఁరాలలీల-నీలమాలనందునిందు।
నల్లముల్లసిల్లుఁబల్ల-వ్రాల్లసల్లవంగభృంగ।
మల్లహృల్లఫుల్లఫుల్ల-మల్లివల్లులంగనంగ।
కందుఁడిందుచందుపొందు-గ్రంథుగంధనర్చిపేర్చు।
కుందబృందనుందునిందుఁ-గుందుఁజెందకేర్చికూర్చు।
తేనెసోనలీనసీన-దీనవీనకమలకమల।
లోనగాసలీనమాన-ఖానసూనగములుగములు॥

టీ. బాల=ఓచిన్నదానా, మధుర...పృథివిన్—మధుర=తియ్యనైన, మధురస=మకరందముల యొక్క, ఏక=ముఖ్యమైన. పాక=పరిపాకముచే త, మహిత=గౌరవించఁబడు, ఫల=పండ్లుగల, రసాలసాల=మామిడిచెట్ల యొక్క, పృథివిన్=భూమియందు, అధివసించు=పొందునట్టి, మించు=అతిశయించునట్టి, పికమున్=కోయిలను, చూడు=వీక్షించుమా, అనుపమాన=సామ్యములేని, చాన=ఓచిన్నదానా, తొగరుచిగురులందున్=ఎఱ్ఱని పల్లవములయందు, చిందు=కూలిపడిన, తొలి=క్రొత్తదియగు, మధూళి=మకరందముయొక్క, సోనవానకున్=ధారావర్షమునకు, ఎగయు=ఎగయుచున్న, పొగరు=గర్వించిన- తేటికోటిన్=తుమ్మెదలసమూహమును, ఎనయుము=పొందుము, మలయపవనుఁడు=మలయమారుతము, మాటిమాటికిన్=మరలమరల, ఇంపునింపున్=సంతోషమునిచ్చును, అంచునెంచు=అనియెంచు, నాటినాటికిన్= నానాటికి, ఇంచున్=ఇచట, విరులన్=పువ్వులయందు, మించు=అతిశయించునట్టి, మించు=కాంతి, విందొనర్చున్=ఆనందముగలిగించును, కంటె=చూచితివా, కంటివిల్లుజెల్లు=కన్నుగలధనువొప్పునట్టి, ఘనుని=గొప్పవాఁడగుమన్మథునియొక్క, మేటి=గొ

ప్పనియగు. దాటి=దాడియొండలి, ఘోటి=గుఱ్ఱముగుచిఁక, అాటి=తాకి, జోటి=ఓచిన్నదానా, అరుణబింబకోటిన్=ఎఱ్ఱని దొండపండ్లసమూహా మును, గంటిసేయఁగన్=కాటుసేయును. మేయఁగన్=తినును, బాల...మందున్—బాల=లేతదైన, మాలతీలతా=మాలతీలతలయొక్క, ఆలవాల=పాదులయొక్క, జాలమందున్=సమూహమందు, పొందు=అనుకూలమగు, వేలన్=భూమియందు, మూలఁ=ప్రక్కయందలి, రాల=రాళ్ళయొక్క, లీల=శోభ, నీలమాలన్=నీలములపఙ్క్తిని, ఇందున్=ఇక్కడ, అందున్=పొంగును, పల్లవో...ల్లులన్. పల్లవ=చిగుళ్ళచేత, ఉల్లసత్=ప్రకాశించుచున్న, లవంగ=లవంగవృక్షములను, భృంగమల్ల=గొప్పతుమ్మెదలయొక్క, హృత్=హృదయమును, ల=స్వీకరించుచున్న, ఫుల్లఫుల్ల=మిక్కిలివికసించిన, మల్లివల్లులన్=మల్లితీగలను. కనంగన్=చూడఁగా, ఉల్లము=హృదయము, ఉల్లసిల్లున్=ఆనందించును, కలంకము=కళంకము, డిందు=నశించిన, చంద్ర=చంద్రునియొక్క, పొందు=కలయిక, క్రందుగన్=దట్టముగా, తనర్చు=ఒప్పు, పేర్చు=అతిశయించునట్టి, కుందబృందము=మల్లికలసమూహము, అందునిందున్=అక్కడనిక్కడ, కుందుఁజెందక=తక్కువనుపొందక, ఏర్చు=అతిశయించి, కూర్చు=కూడఁబెట్టునట్టి, తేనెసోలు=మధువర్షములు, ఈనన్=పుట్టించఁగా, ఈ=ఈకాన్పించుచున్న, నదీ=నదియందైన, నవీన=నూతనమయిన, కమల=పద్మములయొక్క, కమలలోనన్=శోభలోపల, కానన్=చూడఁగా, అలూన=త్రుంచఁబడని, సూన=పుష్పములను, గములు=పొందిన, గణులు=సముదాయములు, లీనమౌన్=అణఁగును.

చ. పరగుచిరత్నరత్నములు-బన్నినపాదులపాదులందరుల్।
తెరువులపై విరుల్ విరులఁ-దామ్రిమధూళిమధూళిపై రజం।
బురజమునన్ మదభ్రమర-ముల్ భ్రమరంబులనుస్స్వరంబును
స్వరమునఁ బంచబాణవిభ-వంబులఁ బాటలుబోటియువ్వనిన్॥

టీ. బోటి=ఓచిన్నదానా, ఇవ్వనిక౯=ఈవనమందు, పరగు=ఒప్పునట్టి, చిరత్న=చిరకాలపువియగు, రత్నములు=మణులు, పన్నిన=కూర్చిన, పాదులక౯=కుదుళ్ళయందు, తరుల్=వృక్షములును, తరువులపైక౯=వృక్షములమీద. విరుల్=పువ్వులును, విరులక౯=పువ్వులయందు, తాౘ్రమమధూళి=ఎఱ్ఱనిమకరందమును, మధూళిపైక౯=మకరందముపైని, రజంబు=పుప్పొడియును, రజమునక౯=పుప్పొడియందు, మదభ్రమరకుల్=మత్తులోఁగూడిన తుమ్మెదలును, భ్రమరంబులక౯=తుమ్మెదలయందు, సుస్వరంబు=మంచిస్వరమును, సుస్వరమునక౯=మంచిస్వరమందు, పంచబాణవిభవంబులు=మన్మథవైభవములును, పొటిలుక౯=ఒప్పును.

సీ. లలనయీదేవవ-ల్లభసమాజములెల్లఁ,
బొసఁగుసదానవ-స్ఫూర్తినిచట।
కలికిరోఘనగంధ-కలితపున్నాగముల్,
హరులకుహర్షంబు-నెరపునిచట।
కలవాణిచక్కెర-కవణంపువిహగముల్,
సకులాస్యమునఁబొ-సంగునిచట।
శంపాసదృశగాత్రి-చంపకమ్ములతోన,
భ్రమరకామోదంబు-బరఁగునిచట।

గీ. సజ్జఘనమండలస్ఫుర-చ్చంచలాంశు।
కాంతవిహృతులుహంసకా-త్యంతరుచికిఁ।
గారణముగాఁదగినసీస-కాశమహిమ।
నెంతయెంతటిమహిమాలిఁ-బెసఁగునిచట॥

టీ. లలన=ఓచిన్నదానా, ఈదేవవల్లభసమాజము లెల్లక౯=ఈదేవతాౘ్రేష్ఠసమూహములన్నియు, పొన్నచెట్లుకుంపులన్నియుననియు, సదానవ=రాక్షసులతోఁగూడిన, స్ఫురణక౯=స్ఫూర్తిచేత, సదా=ఎల్లప్పుడును, నవ=

శ్రోత్రిణియును, స్ఫురణన్ = స్ఫూర్తిచేతననియు, ఇచటన్ = ఇక్కడ, పొసఁగున్ = అనుకూలించును. (దేవతాసమూహము దానవస్ఫురణచేఁ బొసఁగుట విరోధము. రెండవయర్థముచేతనిది పోవుచున్నది ఈవిరోధముతో చుటకు ముందుఁజెప్పఁబోవునట్టి 'ఎంతెంతటిమహిమలింపెసఁగు' ననునది కారణము. ఇట్లిపయింగూడ నూహించవలయును) కలికిరో = ఓచిన్నదానా. ఘనగంధకలితపున్నాగముల్ = గొప్ప గర్వముగల పురుషగజములు, గొప్పవాసనగల పొన్నచెట్లనియును, హరులకున్ = సింహములకు, గోతులకనియును, ఇచటన్ = ఇక్కడ, హర్షంబు = సంతోషము, నెరయఁజేయున్ = అతిశయింపఁజేయును. కలవాణి = అవ్యక్తమధురవాక్కులుగలయో చిన్నదానా. చక్కరకవణంపువిహగముల్ = పంచదార బాణాగలపక్షులు, అనఁగాఁ జిలుకలు, సంకులాస్యమునన్ = సంకుపిల్లులనాట్యముచేత, సంకులముగు ఆస్యమునన్ = ముఖముచేత. [అనఁగాఁ బలుకుచుండు నోటిచేతనని యర్థము.] ఇచటన్ = ఇక్కడ, పొసంగుచుండున్ = ఒప్పుచుండును. శంపాసదృశగాత్రి = మెఱపుతోఁ దుల్యమగు శరీరము గల యోచిన్నదానా! చంపకమ్ములతోన = సంపంగి పువ్వులతోనే, సంపంగి నూనెతో ననియు, భ్రమరకామోదంబు = తుమ్మెదల యానందము, ముంగురుల పరిమళమనియును, ఇచటన్ = ఇక్కడ, పరగున్ = ఒప్పును, సజ్జ..విహృతులు. సజ్జ = సిద్ధముగనున్న, ఘనమండల = మేఘమండలమందు, స్ఫురత్ = ప్రకాశించుచున్న, చంచలా = మెఱపుల యొక్క, అంశు = కిరణముల యొక్క, కాంత = మనోహరమగు, విహృతులు = విహారములు, సత్ = యోగ్యమైన, జఘనమండల = పిఱుదునందు, స్ఫురత్ = ప్రకాశించుచున్న, చంచల = కదులుచున్న, అంశుక = వస్త్రముయొక్క, అంత = చివరయొక్క, విహృతులు = విలాసములనియును, హంసకాత్యంతరుచికిన్ = హంసలయొక్క యంతములేని కాంతికి, కాలికడియముల గొప్ప కాంతికి ననియును, కారణముగాన్ = హేతువుగా, తగిన = ఒప్పిన, నీసకాశమహిమన్ = నీసామీప్య మహత్త్వముచేత. ఇచటన్ = ఇక్కడ, ఎంతెంతటిమహిమలు = ఎంతెంతిమాహాత్మ్యములు, ఇంపెసఁగున్ = శోభించును.

లయగ్రాహి.

కుందముల బృందములఁ జిందుమకరందముల,
బిందువులనందుకొని డెందములమందా|
నందరసకందళము లందవులమందగతు,
లందగుమిళిందముల సుందరులుమింటన్|
గ్రందుపడనందమగు చందనగిరిందనరు,
పెందరులఁగ్రొందరుల సందులరజోని|
ష్యందములయందురవి సుందరిమెయిందనివి,
పొందుపడఁగందిరుగు మందపవనమ్ముల్||

టీ. కుందములబృందములన్ = మల్లితీగలసమూహము౦దు, చిందు = రేగు చున్న, మకరందములబిందువులన్ = మకరందబిందువులను, అందుకొని = పుచ్చుకొని, డెందముల = హృదయములు, అమం...దళములన్. అమంద = గొప్పదియగు, ఆనందరస = సంతోషరసముయొక్క, కందళములన్ = మొలకలయందు, తవులన్ = తగులునట్లుగా, మందగతులన్ = మందసంచారముల చేత, తగు = ఒప్పుచున్న, మిళిందములసుందరులు = ఆడుతుమ్మెదలు, మింటన్ = ఆకాశమందు, క్రందుపడన్ = ధ్వనించుచుండఁగా, అందమగు = సొగసైన, చందనగిరిన్ = మలయపర్వతమందు, తనరు = ఒప్పునట్టి, పెందరులన్ = పెద్దగుమాలయందు, క్రొందరుల = క్రొత్తచెట్లయొక్క, సందులన్ = మధ్యములయందు, రజోనిష్యందములయందున్ = పుప్పొడియొక్క జారుటలయందు, రవిసుందరిమెయిన్ = ఛాయాదేవియొక్క శరీరమందు, (ఇచట లక్షణచే నీడయందని యర్థము) తనివి పొందుపడఁగన్ = తృప్తి యావహిల్లునట్టుగా, మందపవనమ్ముల్ = మందమారుతములు, తిరుగున్ = సంచరించును.

క. వనజాతగంధియిటుల|
వ్వనజాతవిలాసమెల్ల-వరసఖదెలుపన్|

గనుచు నొకానొకపొ రిం
టను జేరి నిదాఘజలక-ణాలసితముఖియై॥

టీ॥ వనజాతగంధి=పద్మమువంటి పరిమళముగల యాచిన్నది, ఇటులు=ఈప్రకారముగ, అవ్వనజాతవిలాసమెల్లన్=ఆవనసమూహముయొక్క శోభ యంతయును, వరసఖి=శ్రేష్ఠురాలగు చెలికత్తె, తెలుపన్=చెప్పఁగా, కనుచున్=చూచుచు, ఒకానొక పొదరింటను=ఒకనికుంజమునందు, చేరి=ప్రవేశించి నిదా...ముఖియై=నిదాఘజలకణ=చెమటబిందువులచేత, లసిత=ప్రకాశింపఁజేయఁబడిన, ముఖి యై=ముఖముగలదియై

క. మావుల క్రోవుల పూవుల
తావుల తావలములైన-తావుల సలరుం
దీవల నావల నీవలఁ
దా వెలిగా వెలయఁ దార్చి-తమి నొకచోటన్॥

టీ॥ మావుల...వలనులు- మావుల=మామిడిచెట్లయొక్కయు, క్రోవుల=గోరంటచెట్లయొక్కయు, పూవుల=పుష్పములయొక్క, తావుల=పరిమళములయొక్క, తావలములైన=స్థానములయిన, తావులన్=చోటులయందు, అలరుం దీవలన్=పువ్వుదీగలచేత, ఆవల నీవలన్=అవతల నివతలను, తాన్=అనఁగా నాచిన్నది, వెలిగాన్=వెలుపలగా, వెలయన్=ఉండునట్లుగా, తార్చి=తారసిల్లఁజేసి, తమిన్=ప్రీతిచేత, ఒకచోటన్=ఒకస్థలమందు.

శా. మందస్పందనచందనానిలచల-న్మందారబృందాసవ
స్యందానందమిళన్మిళిందమహిళా-సందోహసంధానితా
మందోద్గానకిశాల్రదవన్నవమణీ-మాలాలవాలోపకం
తేంమప్రస్తరపట్టికన్నిలుచుచో-నిచ్చానతిన్నెచ్చెలుల్॥

టీ॥ మంద...పట్టికన్ - మందస్పందన=మెల్లగాఁ గదలుచున్న, చందన=మంచిగంధపు చెట్లయందలి, అనిల=గాలిచేత. చలత్=కదలుచున్న, మందారబృంద=కల్పవృక్ష సమూహము యొక్క, ఆసవ=మకరందము యొక్క, స్యంద=కారుటయందు, ఆనంద=సంతోషముతోడ. మిళత్=కూడుకొనుచున్న, మిళిందమహిళా=ఆడుతుమ్మెదలయొక్క, సందోహ=సమూహముచేత సందానిత=కూర్పఁబడిన, అమంద=విస్తారమైన, ఉద్గాన=ఉన్నతగానము యొక్క, కళా=శిల్పముచేత. ద్రవత్=కరఁగుచున్న. నవమణీ=నూతనమణులయొక్క, మాలా=శ్రేణియొక్క, ఆలవాల=పాదులయొక్క, ఉపకంఠ=సమీపమందలి, ఇందుప్రస్తర=చంద్రకాంతశిలలయొక్క, పట్టికన్=పలకయందు. నిలుచునోన్=నిలచియున్నప్పుడు. ఇచ్ఛాగతిన్=స్వేచ్ఛాశక్తిచేత, నెచ్చెలుఁన్=చెలికత్తెలు

క. ప్రసృమరకుసుమరసరభస।
భసలసముదయంబుఁదోలి-ప్రవికసితబిస।
ప్రసవసహస్రముఁ గైకొని।
రసమునసరసికిఁజనిరి-రమణియనుజ్ఞన్॥

టీ. ప్రసృమ... సముదయంబున్ - ప్రసృమర=వ్యాపించుచున్న, కుసుమరస=మకరందముంగూర్చి, రభస=వేగముగల, భసలసముదయంబున్=తుమ్మెదగుంపును, తోలి=వెడలఁగొట్టి, ప్రవిక..సహస్రమున్ - ప్రవికసిత=వికసించిన, బిసప్రసవ=పద్మములయొక్క, సహస్రమున్=అనేకములను, కైకొని; రసమునన్=ఉబ్బుటయందలి యాసక్తిచేత, రమణియనుజ్ఞన్=ఆచిన్నదానియాజ్ఞచేత, సరసికిన్=కొలఁకికి, చనిరి=వెళ్ళిరి.

వ. అంత.

సీ. గగనరంగస్థలీ-కలితనర్తనమున,
త్రిదశతన్వంగికాం-గదమునంగ।

జవసవప్లవనవ-ద్రవిశతాంగతురంగ,
గళగళద్ధరిదశ్వ-ఘంటయనంగ।
బహుళగాంగతరంగ-బంధురోత్పతితఋ,
ష్యతులశీతతులసీ-తతియనంగ
సరభసామరవధూ-కరపతత్సురపుష్ప,
పూర్ణవారిత్పత్ర-పుటమనంగ

గీ. సమయమనితూరిజిగిమీరి-సెమము దేరి।
కరువలులదారినెగఁబారి-కడకుఁ జేరి।
తలిరులకటారివలశారి-ధాటిఘోటి।
చిలుకచిలుకలకోలికిముం-గలనునిలచె॥

టీ. గగన...మనంగ — గగన=ఆకాశమనెడు, రంగసలీ=నాటకసలమందు, కలిత=చేయఁబడిన, నర్తన=నాట్యముగల, మరుత్=వాయుదేవుని యొక్క, పద=పాదమువలన, పతత్=పడుచున్న, మరకత=మరకతవికారమగు, అంగదమనంగన్=అందెయనునట్లు, జవ..యనంగ, జవ=వేగముచేత, నవ=నూతనమైన, ప్లవత్=తూలుఁగలిగిన, రవిశతాంగ=సూర్యరథముయొక్క. తురంగ=గుఱ్ఱముయొక్క. గళ=కంఠమువలన, గళత్=జారుచున్న, హరిదశ్వ=సూర్యునియొక్క, ఘంటయనంగన్=గంటయో యనునట్లు, బహుళ...యనంగన్—బహుళ=విస్తారమైన, గాంగ=గంగాసంబంధులగు, తరంగ=అలలవలన, బంధుర=ఉన్నతముగా, ఉత్పతిత=ఎగురుచున్న, ఋషి=మునులయొక్క, [మునులు పూజలుచేసి గంగలో విడచిన నిర్మాల్యతులసియనుట,] అతుల=సామ్యములేని, శీత=చల్లనైన, తులసీ=తులసీదళములయొక్క, తతియనంగన్=సముదాయమనునట్లుగా, సరభ..మనంగ, సరభస=వేగముతోఁగూడిన, అమరవధూ=దేవతాస్త్రీలయొ

కిఁ, కర=హస్తమువలన, పతత్=పడుచున్న. సుప్రష్ప=మందారపు ష్పములచేత, ప్రాఙ్ణ=పండిన, హరిత్=పచ్చనైన, పత్త్రిపుటమునంగన్=ఆకుపొట్లమనునట్లుగా, సమయమని=ఇది తానమ్ముటకనుకూలమైన వేళయని. తూరి=చొచ్చి, జిగిమీఱ=శోభచే నతిశయించి, సెనుమదేర=ఆయాసముఁ దీర్చుకొని, (సెమునునది శ్రమశబ్దభవముగాఁ దోఁచుచున్నది) కరువలులదారిన్=ఆకాశమందు, ఎగఁబారి=ఎగఁబ్రాఁకి, కడుఁజేరి=దగ్గరకువచ్చి, తలిరుఁబలుకటారి=మన్మథుఁడైనను, వలకారి=మోహకారియొక్క, ధాటి=దాడియందలి, ఘోటి=గుఱ్ఱము, చిలుక=శుకము, చిగ్గకలకొలికిమొంగలను=ఆచిన్నదానియెదుట, నిలచెన్=నిలువబడెను.

క. కనికరిమితనదుమనమునఁ
గనికరముదలిర్పఁజిగురు-గతిఁదనరెడిమ
ల్కనికరిముఁబట్టెనశో
కనికరముకుసుమశుభప్ర-కరణముఁదెలుపన్ ॥

టీ. కని=చూచి, కరము=మిక్కిలి, తనదుమనమునన్=తనమనస్సునందు కనికరము=దయ, తలిర్పన్=ఒప్పఁగా. చిగురుగతిన్=పల్లవమువలె, తనరెడి=ఒప్పారెడి, మల్కనిన్=మృదువైన, కరమునన్=హస్తముచేత, అశోకనికరముకుసుమ=అశోకపుష్పకాంతులు, శుభప్రకరణమున్=శుభవ్యాపారమును, తెలుపన్=తెలుపఁగా, పట్టెన్=చిలుకనుబట్టుకొనెను.

క. చిలుకను గైకొనిమదిఁదమి
జిలుకనుబలికెనపడంతి-చిత్రంబుగనే
తలములు పొలములునుపవన
కులములుగనఁబోయితిశుక-కులమణిచెప్పుమా ॥

టీ. పడంతి=ఆచిన్నది, చిలుకను=శుకమును, కైకొని=పట్టుకొని, మదిన్=మనస్సునందు, తమి=అనురాగము, చిలుకన=వ్యాపింపఁగా, చిత్రంబుగన్=చిత్రముగా, పలికెన=చెప్పెను, శుకకులమణి=చిలుకజాతిలో

శ్రేష్ఠమగుదానా, వితలములు=వేసలములు, పాలములు=సస్యములు, ఉపవన కులములు=ఉద్యానసమూహములును, కనఁబోయితి=చూడఁబోతివి, చెపు ము=చెప్పుము

క. పెంచినచిలుకవు నీవిటు।
పంచషదివసంబులేగి-పరతెంచుటకున్।
గొంచక కారణము నువిన।
రించుమనంగను శుకంబు-ప్రేమం బలికెన్॥

టీ. పెంచినచిలుకవు=పెంపుడుచిలుకవు, నీవిటు=నీవీ ప్రకారము, పంచషదివసంబులు=అయిదారుదినములు, ఏగి=వెళ్ళి. పరతెంచుటకున్=వచ్చుటకు. కొంచక=సంశయించక, కారణమును=హేతువున, వినరించుమనంగన=చెప్పుమనఁగా, శుకంబు=చిలుక, ప్రేమన్=ప్రేమ చేత, బలికెన్=చెప్పెను

చ. సరసరసాలసాలఫల-సంగ్రహణవ్యసనంబునన్ విస్ఫు।
త్వరమలయాద్రిమారుతవి-వర్తితనర్తనమంజుమంజరీ।
పరిమళసంగభృంగకుల-పక్షఝుణంఝుణనాదభేదమే।
దురవనపాళికేళిపరి-తోషవిశేషము మీరఁబోయితిన్।

టీ సరస...వ్యసనంబునన్—సరస=రుచిగలిగిన, రసాలసాల=తియ్యమామిడిచెట్లయొక్క, ఫల=పండ్లయొక్క, సంగ్రహణ=సంపాదించుటయందలి, వ్యసనంబునన్=ఆసక్తిచే, విస్ఫు...విశేషము—విస్ఫుత్వర=వ్యాపించునట్టి, మలయాద్రి=మలయపర్వతమందలి, మారుత=గాలిచేత, వివర్తిత=ప్రవర్తింపఁజేయఁబడిన, నర్తన=నాట్యముచేత, మంజు=మృదువగు, మంజరీ=పూలగుత్తులయొక్క, పరిమళ=వాసనయొక్క, సంగ=స్నేహముగల, భృంగకుల=తుమ్మెదగుంపులయొక్క, పక్ష=రెక్కలయొక్క, ఝుణంఝుణనాద=ఝుణఝుణధ్వనియొక్క, భేద=విశేషములచేత, మేదుర=దట్టమయిన, వనపాళిన్=వనపఙ్క్తియందు, కేళి=విహారముచేతనైన, పరితోషవి

శేష=సంతోషాతిశయము, మీరఁగ=అతిశయింపఁగా, పోయితిఁ=వెళ్ళితిని.

క. రాజీవలోలలోచన!
రాజీవా యిటులఁ జనుచు - రహి నొక్కవనిన్ ।
రాజిలు రాజశిఖామణిఁ
దేజస్విఁ గంటినతని - తేజము చూడన్ ॥

పా॥ రాజీవా . జీవ.— రాజీవ=మత్స్యవిశేషములవలె, లోల=చంచలించుచున్న, లోచన రాజీవా=నేత్రపద్మములుగలయో చిన్నదానా, ఇటులఁజనుచున్=ఈలాగున వెళ్ళుచు, రహిన్=సంతోషముచేత, ఒక్కవనిన్=ఒకవనమందు, రాజిలు=ప్రకాశించుచున్న, తేజస్విని=మంచితేజస్సుగల, రాజశిఖామణిన్=చంద్రశిరోభూషణుఁడగునీశ్వరుని, కంటిన్=చూచితిని, అతని తేజము చూడన్=అతని తేజస్సు చూడఁగా, పైపద్యముతో నన్వయము.

సీత॥ రాజశిఖామణిన్=రాజశ్రేష్ఠుని, శేషము సమము.

క. కొమ్మా నీరూపంబున
కమ్మానితమహిమశాలి - యర్హుఁ డటంచున్ ।
నెమ్మనమునఁ దోఁచెను బూ
రెమ్మా నాబుద్ధి నేర్ప - రించిన వినుమా ॥

టీ॥ కొమ్మా=ఓచిన్నదానా, నీరూపంబునకున్=నీసౌందర్యమునకు, అమ్మానితమహిమశాలి=పూజింపఁబడు మహిమతోఁ గూడినయాతఁడు, అర్హుఁడటంచున్=తగినవాఁడని, నెమ్మనమునన్=మనస్సునందు, తోఁచెను=తోఁచెను, పూరెమ్మా=పుష్పలతివంటి యోచిన్నదానా, వినుమా=ఆకర్ణించుము, నాబుద్ధి నేర్పరించినన్=నా మనస్సులో విమర్శించఁగా, పయిపద్యముతో నన్వయము.

శా. పాలుంజక్కెరగూర్చు వేడుకదలిర్పన్ - రత్నకాంతుల్ దమిన్ ।
పాలజ్యోత్స్నలు పద్మవాసనలు శ్రీ - పద్మశ్రీలు దండప్రభా ।

మాలిచ్ఛాయలు దీటురాఁగ వయుచు-న్మాధుర్యధుర్యక్రియా।
లీలన్ మీరలుమన్న సర్వశుభము ల్-దీపించుఁగాంతామణీ॥

టీ. పాలన్=క్షీరములును, శర్కర=పంచదారయును, కూడు=కలియునట్టి, వేడుక=సంతోషము, తలిర్పన్=ఒప్పఁగా, రత్నకాంతుల్=రత్నముల కాంతియును, తమీపాలజ్యోత్స్నలు=చంద్రుఁడును వెన్నెలయును, పద్మవాసనలు=పద్మముల పరిమళమును, శ్రీపశ్రీలు=విష్ణువు లక్ష్మియు, చంద్రప్రభామాలిచ్ఛాయలు, చంద్రప్రభామాలి=సూర్యుఁడును, ఛాయలు=ఛాయాదేవియును, దీటురాన్=సామ్యము రాఁగా, కలయుచున్=కూడుచు, మాధుర్యధుర్యక్రియాలీలన్, మాధుర్య=తీపుయొక్క, ధుర్య=భారమును వహించిన క్రియా=వ్యాపారముయొక్క, లీలన్=విలాసముచేత, మీరలు=మీరు, మన్నన్=వృద్ధిపొందినచో, కాంతామణీ=స్త్రీశ్రేష్ఠురాలవగునోచిన్నదానా, సర్వశుభముల్=అన్నిశుభములును, దీపించన్=ప్రకాశించును

క. అనిచిలుకపలుకుపలుకులు।
వినివీనులనమృతధార-వెదజల్లితిమే।
ల్చనువుననని పెనుఱెక్కలు।
కొనగోరులనిమిరికొనుచుఁ-గోమలివేడ్కన్॥

టీ॥ అని=ఈలాగునని, చిలుక=శుకము. పలుక=చెప్పునట్టి, పలుకులు=మాటలు, విని=ఆకర్ణించి, కోమలి=చిన్నది, మేల్చనువునన్=మంచిస్నేహముచేత, వీనులన్=కర్ణములయందు, అమృతధార=అమృతప్రవాహము, వెదజల్లితి=వ్యాపింపఁజేసితివి, అని=అని, పెనుఱెక్కలు=చిలుకయొక్క పెద్దఱెక్కలను, కొనగోరులన్=నఖాగ్రములచేత, ముందుపద్యముతో నన్వయము.

ఉ. ఎచ్చటినుండివచ్చియతఁ-డెచ్చటఁ దావకనేత్రవృత్తికిన్।
ముచ్చటఁగూర్చెఁజక్కదన-మున్ ఘనమున్ గనినావె లేవెనీ।

వచ్చెతురంగము నుండుతల-నచ్చటిముచ్చటలావిలాసముల్ ।
మచ్చికహెచ్చఁ దెల్పు మఖి-లంబు ననంగతురంగమాగ్రణీ॥

టీ॥ అనంగతురంగమాగ్రణీ — అనంగ = మన్మథుని యొక్క, తురంగమ = గుఱ్ఱములగు చిలుకలలో, అగ్రణీ = శ్రేష్ఠమగునో చిలుకా, అరుదు = అరుదు, ఎచ్చటినుండివచ్చి = ఏస్థలమునుండివచ్చి, తావకనేత్రపద్ధతికిన్ = నీసాబాధిముగు దృష్టివ్యాపారమునకు, ముచ్చటఁగూర్చెన్ = ఆనందము గలుగఁజేసెను. చక్కదనమున్ = సౌందర్యమును, ఘనమున్ = గొప్పతనమును, (ఇది భావప్రధాననిర్దేశము) కనినావో = చూచితివో, కనవో = చూడనేలేదో, నీవు, అచ్చతురంగము = ఆకేర్పడి, ఉండుతలము = ఉండుచోటును, అచ్చటిముచ్చటలు = అచ్చటి విశేషములును, ఆవిలాసముల్ = ఆచేష్టా విశేషములును, అఖిలంబున్ = సమస్తమును, మచ్చికహెచ్చన్ = స్నేహము అతిశయించునట్లుగా, తెల్పుము = చెప్పుమా,

క. సకులీపలుకులు వినిన ।
దికమకముగనగు నప్రతీతమునైకాం ।
తికముగఁ దెలుపుము శుకమా ।
సకలంబనిపలికెఁగలికి-సల్లలితోక్తిన్ ॥

టీ. శుకమా = చిలుకా, సకులు = చెలికత్తెలు, ఈపలుకులు = ఈమాటలు, వినన్ = ఆకర్ణించిరేని, దికమకముగన్ = సంద్రదగోళము గా, అగుదుగు = అవుగురు, అప్రతీతము = ప్రకటన కానిదియు, ఐకాంతికముగన్ = రహస్యమునైనదిగా, సకలంబు = అంతయును, తెలుపుము = తెలియఁజేయుమా, అని, కలికి = ఆచిన్నది, సల్లలితోక్తిన్ = మిక్కిలి సుందరమగు వాక్యము చేత పలికెన్ = చెప్పెను.

ఆశ్వాసాంతము.

శా. కాంతాస్వాంతవికారకారణమహా-కామారికామాంగవే ।
ఘృణ్యాంతఃక్లిప్తవిలాసలాసకవినూ-దాసారదాసావరా ।

పాంతస్వస్తరుకందకందళదనూనాకారనాకారసం|
భ్రాంతర్షిప్రమదప్రదప్రచురశో-భామారభామారతా||

టీ. కాంతా...కామార, కాంతా= స్త్రీలయొక్క, స్వాంత=చిత్తములయొక్క, వికార=వికారమునకు, కారణ=హేతువగు, మహత్, గొప్పదియగు, కామార=కామారావస్థగలవాఁడా, కామార...పారదా. కామారదీర్ఘి=కుమారసరస్సుయొక్క, అంతః=లోపలను, క్ఌప్త=రచించఁబడిన, విలాస=విలాసములచేతను, లాసక=ప్రకాశించునట్టి, వినోద=ఆనందముయొక్క, ఆపార=ధారావర్షమును, దా=ఇచ్చువాఁడా, పార.....కార పారవ=సరయూనదీసంబంధియగు, ఉపాంత=ప్రాంతమందలి, స్వస్తరు కల్పవృక్షముయొక్క, కంద=దుంపకు, కందళత్=మొలకలై యాచరించుచున్న, అనూన=గొప్పదియగు, ఆకార=రూపముగలవాఁడా, నాకార...మార, నాకారసంభ్రాంత=రూపముచేత భ్రాంతిపడని, ఋషి=మునులకు, ప్రమదప్రద=సంతోషమునిచ్చునట్టి, ప్రచుర=అతిశయమగు, శోభా=కాంతిచేతను, మార=మన్మథుఁడైనవాఁడా, భామారతా, భా=కాంతియందును, మా=లక్ష్మియందును, రత=ఆసక్తుఁడగువాఁడా.

క. పఙ్క్తిశిరోధివిభంగవి|
రక్తర్షిమనోబ్జభృంగ-రతిరభసవ్యా|
సక్తరమాహృదయపరి|
ష్వక్తకరద్వితయవిధృత-శంఖరథాంగా||

టీ. పఙ్క్తిశిరోధివిభంగ=రావణాసురునిఁ గొట్టినవాఁడా, విరక్తర్షి...భృంగ. విరక్త=విరక్తులగు, ఋషి=మునులయొక్క. మనః=చిత్తమను, అబ్జ=పద్మమునకు, భృంగ=తుమ్మెదయైనవాఁడా, రతి...రథాంగా, రతిరభస=సంభోగవేగమందు, వ్యాసక్త=ఆసక్తిఁ బొందిన, రమా=లక్ష్మీదేవియొక్క, హృదయ=వక్షస్థలమునకు, పరిష్వక్త = ఆలింగనజేసికొనునట్టి, కరద్వితయ=హస్తద్వంద్వముచేత, విధృత=ధరించఁబడిన, శంఖరథాం

గూఢశంఖశక్రములు కలవాఁడు. [ఇచటవిరజ్య, వ్యాసజ్య, పరిష్వజ్య అనుచోట్ల, ఉపసర్గపూర్వకములగు రఞ్జ, సఞ్జ, ష్వఞ్జ ధాతువుల హైత్యజంతరూపములు]

గద్య

ఇది సర్వతంత్రస్వతంత్ర సకలభాషావిశేష కవితాధురంధర ప్రతి
దినప్రబంధ పరమేశ్వర శ్లేషయమక చక్రవర్తి బిరుదాంకితుఁడు
మాల ముక్త్రపట్టణ శ్రీనివాసతాతాచార్య తనయ శ్రీమ
న్నారాయణాచార్య దీక్షితసుతపితృవ్య శ్రీనివాసా
చార్య కృపాకటాక్షలబ్ధ సకలపాండిత్య
తర్కాలంకార వాగీశ్వర బిరు
దాంక వేంకటాచార్యప్రణీతం
బైన యచలాత్మజా పరిణ
యంబను శ్లేషప్రబం
ధంబునందు
ద్వితీయాశ్వాసము.

---

శుభమస్తు.

# అచలాత్మజా పరిణయము.

## తృతీయాశ్వాసము.



శ్రీ రమణీచారుమణీ।
హారఘృణీజాలజాల-కాంతరలగ్నో।
దారమనోమిషమీనవి।
హారసముల్లాసవేంకటాచలవాసా॥

టీ. శ్రీరమణీ .....ల్లాస=శ్రీరమణీ=లక్ష్మీదేవియొక్క, చారు=సుందరములగు, మణీహార=మాణిక్యహారములయొక్క, ఘృణీ=కిరణములయొక్క, జాల=సమూహమనెడు, జాలక=వలయొక్క, అంతర=మధ్యమందు, లగ్న=తగులుకొన్న, ఉదార=విస్తారమగు, మనః=చిత్తమను, మిష=మిషముగల, మీన=చేపలయొక్క, విహార=విహరించుటచేతనైన, సముల్లాస=ఉల్లాసముగలవాఁడా, వేంకటాచలవాసా=వేంకటాద్రియందు నివాసముగలవాఁడా.

గీ. అవధరింపవయ్య-యఖిలకథాభిధా।
నాతతనయుఁడైన-సూతతనయుఁ।
డనియె శౌనకునకు-నారీతి నారీతి।
లకముతోడ ననియె-శుకవరంబు॥.

టీ. అవధరింపవయ్య=చిత్తగింపుమయ్య, అఖిల...నయుఁడైన అఖిల=సమస్తములైన, కథా=కథలయొక్క, అభిధాన=చెప్పుటయందు, ఆతత=విస్తారమైన, నయుఁడైన=నీతిగల, సూతతనయుఁడు=సూతపుత్రుఁడగు నుగ్రశ్రవుఁడు, శౌనకునకున్=శౌనకమహర్షికి, అనియెన్=చెప్పెను, ఆరీతిన్=అప్రకారము, నారీతిలకముతోడన్=స్త్రీశ్రేష్ఠురాలగు నాచిన్నదానితోడ. శుకవరంబు=చిలుకలలోఁగొప్పదియగు నాచిలుక, అనియెన్=చెప్పెను

కైలాసము యొక్క, గుణగణాగణంబు=గుణసముదాయము యొక్క లెక్కను, అమరు=ఒప్పునట్టి, లతలపైఁ=తీగలమీఁద, విలసిల=ప్రకాశించునట్టి, సుమనోరాజుల=పుష్పసమూహములయొక్క, మహాళిసూక్తుల- మహత్=గొప్పవగు, అళి=తుమ్మెదలయొక్క, సూక్తుల=మంచివాక్యములు, (ఝంకారములనుట) తెలుపుఁ=ప్రకటించును.

సీత, కనకధనుకాంతిఁ=కిన్నువవలె, విలసిల=ప్రకాశించునట్టి, కోమలాంగులఁ=పుత్త్రికలను గూర్చి, తగు=తగియున్న, ఆధరేంద్ర=ఆ రాజ యొక్క, గుణగణాగణంబు=గుణసముదాయము యొక్క లెక్కను, అమరులతలపైఁ=దేవతలశిరములపై, విలసిల=ప్రకాశించునట్టి, (దేవతలకంటెఁ బైవారని యర్థము) సుమనోరాజుల=విద్వచ్ఛ్రేష్ఠులయొక్క, మహాళి, మహత్=గొప్పదియగు, ఆళి=పఙ్క్తియొక్క, సూక్తుల=మంచిమాటలు, తెలుపున్=తెలియఁజేయును.

క. అందొప్పె రాజకళ మీ-
రందివ్యమహాయశోభి-రాముఁడనంగా
సుందరభుజగమితగుణా-
స్పందధనుర్ధృతిఁ బరవ-శంకరుఁ డొప్పెన్॥

తా॥ అంగుఁ=ఆకైలాసమందు, రాజకళ=చంద్రకళ, మీరఁ=అతిశయించఁగా, దివ్య..రాముఁడౌంగాఁ. దివ్య=ప్రశస్తమైన, మహత్=గొప్పదియగు, యశః=కీర్తిచేత, అభిరాముఁడౌంగాఁ=మనోహరుఁడనునట్లుగా. (శివుఁతలపైఁగల చంద్రకాంతి ఆయనయొక్క కీర్తివలెఁ బ్రకాశించుచున్నదని తాత్పర్యము) సుందర..ధరిత సుందర=సొగసైన, భుజగ=పాముచేత, (అనఁగా శేషునిచేత) మిత=కొలవఁబడిన, [అనఁగాఁగదూ్రిపమైన] గుణ=నారిత్రాటిచేత, అస్పంద=చలించని, ధనుః=వింటికి, ధరతి=పూనుట, పరవఁ=వ్యాపించఁగా, శంకరుఁడు=శివుఁడు, ఒప్పఁ=ప్రకాశించెను.

సీ॥ అంశునన్=ఆదశరథుని కొడుకులయందు, రాజశ్రీ=రాజలక్ష్మణము, మీరన్=అతిశయింపఁగా, సుందర రథగతిన్—సుందర=సొగసయిన, భుజా=హస్తములచేత, గమిత=పొందింపఁబడిన, గుణ=వారిగల, అస్త్రదిశ=విశిష్టలముగు, ధనుః=విల్లు, ధనతన్=దానిగుణముచేత, పర=శత్రువులను, వశంకరుఁడు=స్వాధీనముఁ జేసికొనువాఁడు. ఎలమిన్=శోభచేత,దివ్య...శోభి—దివ్య=ప్రశస్తమయిన, మహత్=గొప్పదియగు, అయ=శుభావహవిధిచేత, శోభి=ప్రకాశించువాఁడు, రాముఁడెవంగాన్=రాముఁడవఁగా, ఒప్పన్=ప్రకాశించును.

వ. ఇట్టులుండ నొక్కచక్కి నక్కజంబై పెక్కుతెరంగులఁ బరిఢవిల్లునవసరంబున నందొప్పురాజకళ.

తా॥ ఇట్టులుండఁగా=ఈప్రకారముగానుండఁగా, అందొప్పురాజకళ=ఆశివునియందున్న చంద్రకళ, ఒక్కచక్కిన్=ఒకవయిపున, అక్కజంబై=ఆశ్చర్యమై, పెక్కుతెరంగులన్=బహురీతుల, పరిఢవిల్లు వసరంబునన్=అతిశయించుసమయమందు.

సీ॥ అందొప్పురాజకళ=ఆరామునియందున్న విష్ణుకళ, (ఇచట రాజశబ్దమునకు విష్ణ్వర్థకత్వము యుక్తిగానున్నను శ్లేషవలయును) విష్ణుకళ యొకటియయ్యును రామలక్ష్మణభరతశత్రుఘ్నరూపముగా నున్నదియనిభావము.

సి పుంభావనవకేళి-సంభావితసుతను,
సంభారలలితోప-లంభకలిత॥
జాంభారికృతపరీ-రంభాదిహృదయప్రి,
యంభావుకక్రియా-రంభపులక।
గుంభావళితకుంభి-కుంభాయితోరోజ,
కుంభాధికాభోగ-జృంభమాణ।

రంభాదికాప్సర-స్సంభాసికచసవి,
స్రంభాకలితకల్ప-కుంభినీజ।

గీ. సంజనితమంజుమంజరీ-పుంజగుంజ
దళికులస్వర్గృహితరు-త్యాగరాగ॥
బుద్ధికృత్పుష్పసౌగంధ్య-భూషితంబు।
భాసురంబయ్యె న్వసంత-వాసరంబు॥

టీ॥ పుంభావ...భూషితంబు- పుంభావన కేళి=పురుషాయితమందు, సంభావిత=ఆదరింపఁబడిన, సువస్తుసంభార=మంచి వస్తుసామగ్రి యొక్కయు, (అనఁగాఁ బుష్పశయ్యాదుల యొక్క] లలిత=విలాసముల యొక్కయు, ఉపలంభ=పొందుటచేత, కలిత=ఒప్పుచున్న, జంభారి=ఇంద్రునిచేత, కృత=చేయఁబడిన, పరిరంభాది=ఆలింగనము మొదలు గాఁగల, హృదయ=మనస్సునకు, ప్రియంభావుక=ఇష్టమయిన, క్రియా=పనుల యొక్క, ఆరంభ=ఆరంభమందలి, పులక=గగుర్పాటుయొక్క, గుంభ=కూర్పుచేత, ఆవలిత=క్రమ్మబడిన, కుంభికుంభాయిత=ఏనుఁగుకుంభస్థలముల వలె నాచరించుచున్న, ఉరోజకుంభ=స్తనకుంభములచేత, అధిక=విస్తారమగు, ఆభోగ=పరిపూర్ణతచేత, జృంభమాణ=అతిశయించుచున్న, రంభాదిక=రంభ మొదలుగాఁగల, అప్సరః=అప్సరస్త్రీల యొక్క, సంభాసి=ప్రకాశించుచున్న, కచ=వెండ్రుకలయందు, సవిస్రంభ=విశ్వాసముతోఁగూడినట్టియు, ఆకలిత=ప్రకాశించుచున్న, కల్పకుంభినీజ=కల్పవృక్షములయందు, సంజనిత=పుట్టిన, మంజు=మనోజ్ఞమైన, మంజరీపుంజ=పువ్వులగుత్తుల సమూహమందు, గుంజత్=రొదచేయుచున్న, అళికుల=తుమ్మెదగుంపులుగల, స్వర్గృహి=స్వర్గభూమియందలి, తరు=వృక్షముల యొక్క, త్యాగ=విడచిపెట్టుటయందు, బుద్ధికృత్=మనసుపుట్టించునట్టి, పుష్ప=పువ్వుల యొక్క, సౌగంధ్య=పరిమళముచేత, భూషితంబు=అలంకరింపఁబడిన, వసంతవాసరంబు=వసంతదినము, భాసురంబయ్యెన్=ప్రకాశించెను.

శా. చైత్రుండిచ్చటఁ బంచమస్వరము గూ-ర్చం బూనినాఁ డింక నా|
చిత్రం బొప్పదటంచు గద్గదిక జొ-చ్చెం బాంధకాంతాగళ|
క్షేత్రంబుం గలకంఠకంఠకుహర-క్షేత్రంబు వర్జించి నా|
ధాత్రిన్ మించెను బంచమంబు వినఁ గాద్గద్యంబు కాంతాళికిన్.

టీ॥ చైత్రుండు=వసంతుఁడు. ఇచ్చటన్=ఈకోవెలకంఠములయందు, పంచమస్వరమున్=పంచమమనుధ్వని, కూర్చన్=సంధానముఁ జేయుటకు, పూనినాఁడు=ఉద్దేశించినాఁడు. ఇకన్=ఇటుపయిని, నాచిత్రంబు=నాసొగసు, ఒప్పదు=ఎనికిరాదు. అటంచున్=అట్లని, గద్గదిక-డగ్గుత్తిక-కల...క్షేత్రంబున్-కలకంఠ=కోవెలలయొక్క, కంఠకుహర=కంఠరంధ్రములనెడు, క్షేత్రంబున్=స్థానమును, వర్జించి=విడచి, పాంధ...క్షేత్రంబున్-పాంధ=మార్గస్థులయొక్క, కాంత=స్త్రీలయొక్క, గళక్షేత్రంబున్=కంఠస్థలమును, చొచ్చెన్=ప్రవేశించెను, నన్=అనునట్లు, ధాత్రిన్=భూమియందు, పంచమంబున్=కోవెలపంచమస్వరమును, వినన్=వినఁగా, కాంతాళికిన్=స్త్రీసమూహమునకు. గాద్గద్యంబు=డగ్గుత్తిక, మించెను=అతిశయించెను.

సీ. కాసారమత్తల్లి-కాసారసమధూళి,
కాసారములగంధ-గరిమ సలర|
కాంతారహితకాము-కాంతారతికరామ్రము,
కాంతారములఁ గొంత-కలసి మెలసి|
సాధారణవధూక-సాధారనవసాహా,
సాధారకథనాయ-మవలఁ దోలి|
వాసీరబహుళరే-వ సీరశైత్యసే,
వాసీరసతనన్ను-వలతుఁ గడపి|

గీ. నవనవమధుద్రవార్ద్రిత-పల్లవాగ్ర।
కలితకలకంఠకులకంఠ-గానతాన।
కలనకృతపారవశ్యవై-ఖరిఁ జరించె।
మలయగిరిమేఖలాచారు-మారుతముగ॥

టీ. కాసార.. సారములు. కాసారమతల్లికా = సరశ్శ్రేష్ఠములయందలి, సారస = పద్మములకుం జెందిన, మధూళికా = మకరందములయొక్క, ఆసారముల = ధారావర్షములయొక్క, గంధ = పరిమళముయొక్క, గరిమన్ = అతిశయముచేత, అలరి = సంతోషించి, కాంతారహిత.. కాంతారములన్, కాంతా = స్త్రీలతోడ, రహిత = శూన్యులగు, కాముక = కాముకులయొక్క, అంతః = అంతఃకరణములకు, రతికర = సంతోషమును జేయునట్టి. ఆమ్రకాంతారములన్ = మామిడితోటలయందు, కొంత = కొంచెము, కలసి మెలసి = కలసిసంచరించి. సాధా..కథ సాధారణ = సామాన్యులగు, (అనఁగా ధైర్యరహితులుగాని) వధూరస = స్త్రీశ్రేష్ఠులయొక్క, అధార = అవిచ్ఛిన్నముగా, నవ = క్రొత్తదియగు, సాహస = ప్రణయకలహసాహసము, ఆధార = ఆధారముగల, కథ = ప్రశంసయొక్క, న్యాయము = న్యాయమును, అవలఁ దోలి = అవ్వలికిఁ బోఁగొట్టి, (అనఁగా మలయమారుతము విసరఁగా ధైర్యము తక్కువగల స్త్రీలు ప్రణయకలహ సాహసముయొక్క మాటనుగూడ విడచుచున్నారని తాత్పర్యము.) వానీర...... నీరసతన్. వానీర = ప్రబ్బలిచెట్లచేత, బహుళ = విస్తారమయిన, రేవా = నర్మదానదియొక్క. నీర = ఉదకముయొక్క, శైత్య = చలువయొక్క, సేవా = సేవించుటయందు, నీరసతన్ = ఆసక్తిలేకపోవుటను అన్నవలకున్ = స్త్రీలకు, కడపి = పోఁగొట్టి, నవ...వైఖరిన్ — నవనవ = నూతనప్రకారమయిన, మధుద్రవ = మకరందపుతడిచేత, ఆర్ద్రిత = తడిసిన, పల్లవాగ్ర = శ్రేష్ఠములగు చిగుళ్ళచేత, కలిత = సంతసింపఁజేయఁబడిన, కలకంఠ = కోవెలలయొక్క, కుల = సమూహముయొక్క, కంఠ = కంఠములయందలి, గాన = సంగీతముయొక్క, తాన = తానములయొక్క, కలన = వినుటచేత, కృత = చేయఁబడిన, పారవశ్య = పరవశత్వముయొక్క, వైఖరిన్ = రీతిచేత, (అనఁగా జగు

యందలి, మరంద బిందు = మకరంద బిందువుల యొక్క, లిప్సా = పొందనిచ్చచేత, పరిత = ప్రసరించుచున్న. అళి = తుమ్మెదలయొక్క, పాళి = పఙ్క్తిచేత, ఘన = దట్టమైన, సార = శ్రేష్ఠమైన వని = వనములయందు, రచిత = చేయఁబడిన. ప్రచార = సంచారముగల, వేలా = సముద్రతీరమందలి, పవమాన సమాగమ = పిల్లగాలులయొక్క, విలాస = విహారములచేత, విలీన = అణఁగిన, నితాంతతాంతిస్సై = అత్యంతతాపముగలవాఁడయి.

సీ॥ తారకలన్ = నక్షత్రములను, ఆత్మహితంబుగన్ = తనయిష్టముచొప్పున, నిల్పుమేటి = ఉంచినగొప్పవాఁడగు, (విశ్వామిత్రుఁడు ద్వితీయస్వర్గనిర్మాణముఁ జేయుటకై నక్షత్రమండలములోని నక్షత్రములను దూరముగా నిల్పెనని ప్రసిద్ధి) ఆ = ప్రసిద్ధుఁడగు, పరమ = శ్రేష్ఠుఁడగు, ఋషి = విశ్వామిత్రముని, ఘన = గొప్పదియగు, సారవ = సరయూనదియందలి. నీర = నీటిచేత, చిర = వ్యాప్తమగు, ప్రచార = మార్గముగల, వేలా = ఒడ్డునందలి. తక్కినదిసమము

చ ఘనతమసాధునీరచిత-కౌతుకబాలమరాళమాలికా|

తనుతరచంచుసంచలిత-తామరసప్రసరత్పరాగవా|

సనలమెలంగుభృంగముల-ఝుంకరణంబుల వీనులందువిం|

దొనరగనయోధ్యశాత్రవుల-దుర్గపుఁగ్గనిరోధమదంబునన్

టీ॥ ఘన ..వాసనలన్, ఘనతమ = మిక్కిలిగొప్పదియగు, సాధు = యోగ్యమయిన, నీర = నీటియందు, రచిత = వ్యాప్తమయిన, కౌతుక = సంతోషము తోఁగూడినట్టియు, బాలమరాళ = పిల్లహంసలయొక్క, మాలికా = పఙ్క్తుల యొక్క, తనుతర = మిక్కిలివాడియయిన. చంచు = ముక్కులచేత, సంచలిత = కదలింపఁబడిన. తామరస పద్మములయందు. ప్రసరత్ = ప్రసరించుచున్న, పరాగ = పుప్పొడులయొక్క, వాసనల్ = పరిమళములయందు, మెలంగు = సంచరించునట్టి భృంగముల = తుమ్మెదలయొక్క, ఝుంకరణంబులన్ = ధ్వనులచేత, వీనులందున్ = చెవులయందు. విందు = ఆనందము, ఒనరన్ = ఒప్పఁగా, శాత్రవులన్ = శత్రువులను, అయోధ్యన్ = యుద్ధముఁజేయు శక్య

ముగానట్టి, ఉగ్రపురిన్=ఈశ్వరునిపట్టణమును. మోదంబునన్=సంతోషముచేత, కనిరెన్=చూచెను

టీక॥ ఘన=గొప్పదియును, తమసాధునీ=తమసానదియందు, రచిత=రచింపఁబడిన, కౌతుక=సంతోషముగల. శాత్రవులన్=శత్రువులను, ఉగ్ర=భయంకరమగు. అయోధ్యన్=అయోధ్యయనునట్టి. పురిన్=పట్టణమును, శ్లేషయమకము

క॥ వరహితుఁడానందియునల
సరసుఁడుమదిముదముదనర-సమరహితవిభా
కరకులజరాజమణిభా
సురమగునజతనయపురము-సొచ్చెనురక్తిన్॥

పా॥ వరహితుఁడు=శ్రేష్ఠులకిష్టుఁడగునట్టియు. అలసరసుఁడు=మంగళయందుదయారసముగల, ఆనందియు=ఆనందేశ్వరుఁడును, మదిన్=మనస్సునందు, ముదము=సంతోషము, తనరన్=ఒప్పఁగా, సమ..భాసురము. సమరహిత=ఉపమానశూన్యమగు, విభా=కాంతికి, ఆకర=స్థానమగు, కులజ=మంచిజాతియందుఁబుట్టిన, రాజమణి=చంద్రకాంతమణులచేత, భాసురము=ప్రకాశించుచున్న, అజతనయపురము=బ్రహ్మపుత్రుఁడగు ఈశ్వరునిపట్టణమును, (త్రిమూర్తులనొకరికొకరుపుట్టించినవారినిగాఁ జెప్పుట ప్రసిద్ధము) లేక=పులస్త్యబ్రహ్మపుత్రుఁడగు కుబేరునిపట్టణము, [అలకాపట్టణము కైలాసమందున్నదిగావున నట్లు చెప్పవచ్చును] రక్తిన్=అనురాగముచేత, చొచ్చెన్=ప్రవేశించెను.

టీక॥ వరహితుఁడు=శ్రేష్ఠులకిష్టుఁడైనట్టియు, ఆనందియు=ఆనందముగలిగినట్టియు, అల=అట్టి, సరసుఁడు=బ్రహ్మానందరసముతోఁ గూడినవిశ్వామిత్రుఁడు, మదిముదముదనరన్=మనస్సునసంతోషమొప్పఁగా, సమర...భాసురము. సమర=యుద్ధములయందు, హిత=ఇష్టులగు, విభాకరకులజ=సూర్యవంశమందుఁబుట్టిన, రాజమణి=రాజశ్రేష్ఠులచేత, భాసురము=ప్ర

కాశించుచున్న, అజతనయపురము=అజమహారాజు కొమారుండగు దశరథుని పట్టణమగు నయోధ్యను, అనురక్తిన్=ప్రీతిచేత, చొచ్చెన్=ప్రవేశించెను.

చ. మహితరసాలసాలకృత- మాలతమాలసుమాలతీలతా।
సహితనికుంజపుంజవన-సంజవనోచితభోగిభోగినీ।
బహుళతరగానతానముల-భాసిలునప్పురినొప్పురాజధూ।
ర్వహుతలవాకిటన్ మన-సు-పట్టియతండువసింపనంతలోన్॥

టీ॥ మహి... తానములన్. మహిత=శ్రేష్ఠము లయిన, రసాలసాల=మామిడిచెట్లచేత, కృత=చేయంబడిన, మాల=పఙ్క్తిగల, తమాల=తాపింఛ వృక్షములతోడను, సుమాలతీలతా=మంచి మాలతీలతలతోడను, సహిత=కూడిన, నికుంజ=పొదలయొక్క, పుంజ=సమూహములుగల, వన=వనమునందలి, సంజవన=గృహవిశేషములకు, ఉచిత=తగినట్టి, భోగ=భోగములుగల, భోగినీ=నాగకన్యకలయొక్క, బహుళతర=మిక్కిలి విస్తారములగు, గాన=సంగీతములయొక్క, తానములన్=తానములచేత, భాసిలు=ప్రకాశించునట్టి అప్పురిన్=అపట్టణమునందు, ఒప్పు=ఒప్పునట్టి, రాజధూర్వహు=చంద్రశేఖరుండగు శివునియొక్క, తలవాకిటన్=ప్రాంగణమునందు, అతండు=ఆనందీశ్వరుండు, మనసుపట్టి, మనస్సునిబ్బరముం జేసికొని, వసింపన్=ఉండగా, అంతలోన్=అంతటిలో.

సీత॥ భోగినీ=భోగినీస్త్రీలయొక్క, రాజశ్రేష్ఠుండగుదశరధునియొక్క శేషము సమము.

క. రాజశిరోమణియానతి।
రాజనియుల వామదేవు-రసికువశిష్ఠున్।
బూజార్హు నిందగువిధమున।
బూజించియునమ్మహాప్ర-భునియానతిచేన్॥

టీ॥ రాజశేఖరుని = చంద్రశేఖరుఁడగు శివునియొక్క, అనతి = సెలవు, గాన్ = గాన, దాఁజెల్లి గనిన్ = ప్రసన్న దరము గలిగినట్టియు, వశిష్ఠున్ = ఇంద్రియములను గెలిచి గలిగినట్టియు. పూజార్హున్ = పూజకుఁ దగిన ట్టియు, అలవామదేవున్ = ఆశివుని, తగువిధమునన్ = అనుకూలరీతిచేత, పూజించియున్ = పూజఁజేసినవాఁడను, అమ్మహాప్రభుని = ఆగొప్ప తేజస్సు గల శివునియొక్క, అనతిచేన్ = సెలవుచేత.

క. ప్రమదారావాహిత వి।
భ్రమవృత్తిఁ దలిర్ప నొక్క-భర్మాసనమం।
దమరి యతండు వివక్షో।
ద్యమ మొప్పఁగ సన్నుతించె-నయ్యీశ్వరునిన్॥

టీ॥ అతండు = ఆనందీశ్వరుఁడు, ఒక్క భర్మాసనమందున్ = ఒక బంగారుపీఠమందు, అమరి = కూర్చుండి. ప్రమ...వృత్తి—ప్రమద = సంతోషకరమగు. ఆరావ = ధ్వనిచేత, ఆహిత = తీసికొని రాఁబడిన, విభ్రమవృత్తి = విలాసవ్యాపారము, తలిర్పన్ = ఒప్పునట్లుగా, వివక్షోద్యమము. వివక్షా = చెప్పనిచ్ఛయందలి, ఉద్యమము = ప్రయత్నము, ఒప్పఁగన్ = ఒప్పునట్లు. అయ్యీశ్వరునిన్ = ఆశివుని, సన్నుతించెన్ = స్తోత్రము చేసెను,

సీత॥ అతండు = ఆవిశ్వామిత్రుఁడు, అయీశ్వరునిన్ = ఆదశరథరాజును శేషము సమము.

చ. సతతము రంగపుంగవుని-సద్గుణమూర్తిఁ భజించి కాంచన।
క్షితిధరపాటవంబు విల-సిల్లె శిథిల్లొవినీవనీప్రకరో।
ద్ధతిలముదట్టపై రిపురి-సద్వనితాజనతాప్రకోష్ఠసం।
గతవలయంబులుం బగులు-గా సమరస్థలి రాజశేఖరా॥

టీ. రాజశేఖరా = చంద్రుఁడు శిరోభూషణముగలయో శివుఁడా, సమరస్థలిన్ = యుద్ధభూమియందు, నీవ = నీవే, సతతము = ఎల్లప్పుడును. ఉరం

యొక్క, ప్రక్షోభ = చెడగొట్టుటయందలి, దీక్షా = పట్టుదలయొక్క సముద్గతిన్ = అతిశయముచేత, అద్భుత ..గరిమన్- అద్భుత = ఆశ్చర్యమగు, యుధపదగతి = యుద్ధరీతిచేత, సముద్యత్ = పుట్టుచున్న, కోప = కోపముగలవ, కాషాయక = ఎఱ్ఱనయిన, గుణతి = కాంతిని, భృత్ = భరించుచున్న, లోచన = నేత్రములయొక్క, దారుణత్వ = తీవ్రతయొక్క, గరిమన్ = అతిశయముచేత తోఁటిల్లన్ = తోఁచుచుండఁగా రౌద్ర...వ్యాప్తిన్-రౌద్ర = రౌద్రరసము వలనను, అద్భుత=అద్భుతరసము వలనను, ఉద్గత = పుట్టిన, వ్యాప్తిన్ = వ్యాపారముచేత, తవ = ఒప్పునట్టి, వీరభద్ర మహిమాన్ = వీరభద్రునిమహత్త్వములు, తర్కింపన్ = ఊహించుటకు, శక్యంబులే = శక్యములగునా?

టీ॥ ప్రతికూల ..సముద్గతిన్- ప్రతికూలవ్రత = విరోధమందును, భీ = భయమందును, (అనఁగా భయమును బుట్టించుటయని తాత్పర్యము) మదక్షయ = మదమును నశింపఁజేయుటయందును, జనప్రక్షోభ = మనుష్యులను జీకాకు చేయుటయందును, దీక్షా=పట్టుదలయొక్క, సముద్గతిన్=అతిశయము వలన = వీరభద్రమహిమన్- వీర = వీరరసముయొక్క, భద్ర = శుభకరములగు, మహిమాన్ = మహత్త్వములు. శేషముసమము.

క. సురధునినిసుఁజెందిగదా।
పరగును బవమానభక్తి-పరిణతిదగనా।
సురరాజులునిన్నునుతిం।
తురుసంగరహితమహావి-నోదమహేశా॥

టీ॥ సురధుని=గంగానది, నినుఁజెంది=నిన్నుఁబొంది పవమాన ..దగన్ = పవమాన - పవిత్రమైన, భక్తి = రచనయొక్క, పరిణతి = పరిపాకము, తగన్ = తగునట్లు, పరగునుగదా = ఒప్పునుగదా, సంగ ..నోద, సంగ = సంసారసంగముతోడ = రహిత = శూన్యములయినవారియందు, మహావినోద గొప్పవేడుకగల, మహేశా = ఓశివా, అసురరాజులు = ప్రసిద్ధులగు దేవతాశ్రేష్ఠులు, నిన్నునుతింతురు = నిన్నే పొగడుదురు,

నో వ్యాపారముగల నీ వెటువంటిని యర్థంబు లేదనుటయుఁ = నీవెటువంటిని కార్యము లేదనఁగా, అయ్యాశుండు = ఆశివుఁడు, అంగీ...రంగుండై — అంగీకార = ఒప్పుదలచేత, తరంగిత = అలలుగల, అంతరంగుండై = చిత్తము గలవాఁడయి, అనుమతించెఁ = ఒప్పుకొనెను. అంత = అంతట.

సీత॥ రాజచూడామణీ = రాజశ్రేష్ఠుఁడవగు నోగశరథుఁడా. మా = మా యొక్క. యాజ్ఞ = యజ్ఞసంబంధియగు, ఆధారణాది = నిర్వహించుట మొదలగు. నీపెన్గొమరు = నీపెద్దకొమారునియొక్క, అయ్యాశుండు = ఆ రాజు. శేషము సమము.

గీ. రాజశిశుమౌళియాగమా-రాధనైక।
యోగమార్యానుగతిలేక-యొంటినిర్వి।
వాదముగసాగవలసెనం-చాదిఁగొంత।
తలఁచిసత్యాప్తియుండెచి-త్తంబునిలపి॥

పా॥ రాజశిశుమౌళి = పిల్లచంద్రుఁడు శిరోభూషణముగల యీశ్వరుఁడు, ఆగమారాధనైకయోగము ఆగము = శాస్త్రవిహితమైన, ఆరాధన = పూజలయొక్క. ఏకయోగము = ముఖ్యసంబంధము, ఆర్యానుగతి- ఆర్యా = పార్వతీదేవియొక్క, అనుగతి = అనుసరణము, లేక = లేకుండ, ఒంటి = ఒక్కఁడుగా, నిర్వివాదముగఁ = విరోధము లేకుండఁగా, సాగవలసెనంచుఁ = జరుగవలసినదని, ఆదిఁ = మొదటియందు, కొంత దలఁచి = కొంచె మాలోచించి, సత్యాప్తియుండె = సతీదేవియొక్క, లేక స్త్రీయొక్క పొందుటయుండే, చిత్తంబునిలపి = మనసుంచి

సీత॥ రాజశిశుమౌళి = రాజకుమారులలో శ్రేష్ఠుఁడగు శ్రీరామమూర్తి- యాగ...యోగము- యాగ = యజ్ఞముయొక్క, మా = సంపదయొక్క, ఆరాధన = ఆరాధించుటయొక్క, ఏకయోగము = ముఖ్యోపాయము, ఆర్యానుగతి = పూజ్యుఁడగుదశరథునియొక్కయనుసరణము, సత్యాప్తియుండె = సత్యముయొక్క పొందుటయుండే, శేషము సమయము.

క. ఆనందిచేతనాత్తా।
నూనసపర్యుండువగుచు-నొక్కమనస్సం।
ధానమునసత్యసంగా।
ధీనతదాశరథిపరమ-ధృతిదగఁజనియెన్॥

టీ॥ ఆనందిచేతన్ = ఆనందీశ్వరునిచేత, ఆత్తానూనసపర్యుండున్ = ఆత్త = పొందఁబడిన, అనూన = విస్తారమగు, సపర్యుండున్ = పూజగలవాఁడును, అగుచున్ = ఔచు, ఒక్కమనస్సంధానమునన్ = ఒకానొక మనోనైశ్చల్యముచేత, సత్యసంగాధీనతన్ = సతీ = సతీదేవియొక్క, అసంగ = విరహమునకు, అధీనతన్ = ఆయత్తత్వముచేత, తాన్ = తాను, శరధిపరమధృతి = శరధి = సముద్రమువలె, పరమ = ఉత్కృష్టమగు, ధృతి = ధైర్యము, తగన్ = ఒప్పునట్లు, చనియెన్ = వెళ్ళెను.

సీత. ఆనంది = సంతోషముగలవాఁడును, చేత...పర్యుండును, చేతనా = చిత్తమందు, ఆత్త = పొందఁబడిన, సపర్యుండును = (తండ్రియందుగాని లేక విశ్వామిత్రునియందుఁగాని) గౌరవముగలవాఁడును, అగుచున్ = ఔచు, సత్యసంగాధీనతన్ = సత్యముయొక్క సాంగత్యమునకధీనత్వముచేత, దాశరథి = శ్రీరామమూర్తి, శేషముసమము. (ఇచట మొదటియర్థమున శరధియను నదివర్గపదము రెండవయర్థమున దాశరథియను నదివర్గద్వితీయముసు అయియున్నది, ఇందుకుఁగవియే ప్రమాణము.

ఉ. రాజకుమారశేఖరుఁడు-రమ్యతనందిపయిన్వినోదముల్।
రాజిలనార్యసంగతియ-నంతసుఖాశ్రయమంచునెంచుచుం।
దాఁజనుదెంచెఁదాపసహి-తస్థితినవ్వలనివ్వలన్వనీ।
రాజులనుల్లసిల్లుమృగ-రాజులఁతగ్గనివిస్తయంపడన్॥

టీ॥ రాజకుమారశేఖరుఁడు = బాలచంద్రశిరోభూషణుఁడగునీశ్వరుడు. రమ్యతన్ = సొగసుచేత, వినోదముల్ = కాలయాపనలు, రాజిలన్ = జెల్లఁగా, ఆర్యసంగతి = పార్వతియొక్క కలయిక, (తెనుఁగుషష్ఠి సమా

సము) అనంతసుఖాశ్రయమునంచున్ = అపరిమితసౌఖ్యాధారమనుచు. ఎంచుచున్ = తలంచుచు, తాపసహితస్థితిన్ = తాపసహిత = తాపములోఁ, గూడిన, స్థితిన్ = ఉనికిచేత, అవ్వలవ్వలన్ = అటునిటు, వనీరాజుల్ = వనపఙ్క్తులయందు, ఉల్లసిల్లు = ప్రకాశించునట్టి, మృగరాజులు = మృగశ్రేష్ఠములు, తన్గని = తన్నుఁజూచి, విస్మయంపడన్ = ఆశ్చర్యపడగా, నందిపయిన్ = నందినెక్కి, తాన్ = తాను, చనుదెంచెన్ = వెళ్ళెను.

సీత॥ రాజకుమారశేఖరుఁడు = రాజశిశుశ్రేష్ఠుఁడగు శ్రీరామమూర్తి, రమ్యతన్ = మనోహరత్వమును, అంది = పొంది, పయిన్ = అనంతరమందు, ఆర్యసంగతి = పూజ్యుఁడగు విశ్వామిత్రునితోఁ గలసియుండుట. తాపసహితస్థితిన్ = తాపస = విశ్వామిత్రునికి, హిత = ఇష్టమగు, స్థితిన్ = ఉనికిచేత, శేషము సమము.

సీ. శైలాగ్రవిచలద్రుమ-సాలామితఫలచ్ఛ్వి,
డాలాలసత్కీర-ధర్షణములు।
మాలాయితమిళత్త-మాలాత్తజలదస్ఫు,
హాలాలసమయూర-హర్షణములు।
నేలాలతావ్యాజ-డోలాఢ్యవనదేవ,
బాలారచితదివ్య-భాషణములు।
హాలావివశభృంగ-బాలాకలితరమ్య,
కోలాహలజయైక-ఘోషణములు।

గీ. కలితకలకంఠకులకంఠ-లలితగాన।
తానములువీనులకువింత-గా నెలర్పఁ।
జనుచుశీతలనగకూట-మునఁదనర్చు।
సుందరమణీప్రపంచంబు-సూచెనంత॥

పా॥ శైలా.....ధర్షణములు=శైలాగ్ర=పర్వతాగ్రములయందు, విచలత్=చలించుచున్న, రసాల=తియ్యమామిడిచెట్లయొక్క, అమిత=మితిలేని, ఫల=పండ్లయొక్క, భిదా=భేదించుటయందు, లాలసత్=ఆసక్తములగుచున్న, కీర=చిలుకలయొక్క, ధర్షణములు=ప్రగల్భతలు, మాలా...హర్షణములు- మాలాయుత=వరుసఁగట్టిన, మిళత్=ధ్వనిచేయుచున్న, తమాల=తాపింఛవృక్షములయందు- ఆత్త=పొందఁబడిన, జలద=మేఘములనునట్టి, స్పృహా=ఇచ్ఛచేత, లాలస=ఆసక్తములగు- మయూర=నెమళ్లయొక్క, హర్షణములు=సంతోషములును, ఏలా..భాషణములు- ఏలాలతా=ఏలకితీగలనెడు, వ్యాజ=మిషముగల, డోలా=ఉయ్యెలలయందు- ఆఢ్య=కూడిన, వనదేవ=వనదేవతలయొక్క. బాలా=కన్యకలచేత, రచిత=చేయఁబడిన, దివ్యభాషణములు=ప్రశస్తవాక్యములును, హాలా...ఘోషణములు- హాలా=మద్యముచేత (అనఁగా మకరందపానముచేత నని లాక్షణికార్థము) వివశ=పరవశములైన, భృంగబాలా=తుమ్మెదకన్నెలచేత, కలిత=చేయఁబడిన, రమ్య=సుందరములైన. కోలాహల=పెద్దధ్వనులనెడి, జయ=జయమందు- ఏక=ముఖ్యములగు, ఘోషణములు=ధ్వనులును, కలిత..తానములు- కలిత=వ్యాప్తమైన, కలకంఠ=కోవెలలయొక్క. కుల=సమూహముయొక్క కంఠ=కంఠములయొక్క, లలిత=సుందరములైన, గానతానములు=పాటలయందలితానములు, వీనులకున్=చెవులకు, విందుగాన్=ఆనందముగా, ఒనర్పన్=చేయఁగా, చనుచున్=వెళ్ళుచు, శీత.....కూటమునన్=శీతలనగ హిమవత్పర్వతము యొక్క, కూటమునన్=శిఖరమందు, తనర్చు=ఒప్పునట్టి, సుందరమణీప్రపంచంబు- సుందర=సొగసైన, రమణీ=మాణిక్యములయొక్క, ప్రపంచంబు=విస్తారము, చూచెన్=వీక్షించెను, అంత=అంతట.

సీత॥ శీత...కూటమునన్. శీతల=చల్లనైన. నగ=వృక్షముల యొక్క, కూటమునన్=పోగుచేత. తనర్చు=ఒప్పునట్టి. సుంద=సుందుని యొక్క, రమణీ=భార్యయగు తాటక యొక్క, ప్రపంచంబు=నివాసమును,

క. లలితాత్ముఁడతఁడు నుద!
త్స్థలి దాటక గని సమగ్ర-శరముల ఖండిం!
చి లతాశతావృతవన!
స్థలి నిలచె మహాతపంబు-దగఁ దనరింపన్॥

టీ॥ లలితాత్ముఁడు = సుందరరూపుఁడగు, అతఁడును = ఆశివుఁడును, తత్స్థలి = అచోటును, దాటక = అతిక్రమించక, కని = చూచి, లతావృత వనస్థలిన్ - లతా = తీగలచేత, ఆవృత = క్రమ్మఁబడిన, వనస్థలిన్ = వనప్రదేశమునందు, సమగ్రశరములన్ = పొడవైనరెల్లుపుట్టలను, ఖండించి = నఱికివేసి, మహాతపంబు = గొప్పతపస్సును, తగన్ = ఒప్పునట్లు, తనరింపన్ = చేయుటకు, నిలచెన్ = ఉండెను

సీత॥ అతఁడును = అశ్రీరామమూర్తియు, తత్స్థలిన్ = అచోట, తాటకన్ = తాటకయను రాక్షసస్త్రీని, కని = చూచి, సమగ్రశరములన్ = గొప్పబాణములచేత, ఖండించి = దానిని, దెగవేసి, లతాశతావృత వనస్థలియందు, మహాతపంబు = మహత్ = గొప్పదియగు, ఆతపంబు = ఎండ, దగఁదనరింపన్ = దప్పిగలుఁజేయఁగా, నిలచెన్.

క. విశ్వామిత్రసమర్థిత!
శాశ్వతికాస్త్రప్రచార-చాతుర్యుఁడతం!
డాశ్వితశీతనగాంత!
ర్విశ్వంభరుఁడగుచు సత్య-వీక్షార్థమతిన్॥

టీ॥ విశ్వా......చాతుర్యుఁడు, విశ్వ = ప్రపంచమునకు, అమిత్ర = శత్రువులగు రాక్షసులయందు, సమర్థిత = నిర్వహింపఁబడిన, శాశ్వతిక = నిరంతరములగు, అస్త్ర = ఆయుధములయొక్క, ప్రచార = సంచారమందు, చాతుర్యుఁడు = నేర్పుగల, అతండు = ఆశివుఁడు, ఆశ్విత...భరుఁడు = ఆశు = శీఘ్రముగా, ఇత = పొందఁబడిన, శీతనగ, హిమవత్పర్వతముయొక్క, అంతః = మధ్యమందలి, విశ్వంభరుఁడగుచున్ = భూమిగలవాఁడౌచు, సత్య...

మతిన్ = సతీ = సతీదేవియొక్క, అవీక్షా = చూడకపోవుటచేత, ఆర్త = బాధఁజెందుచున్న, మతిన్ = బుద్ధిచేత.

సీత॥ విశ్వా... చాతుర్యుఁడు = విశ్వామిత్ర = విశ్వామిత్ర మహర్షిచేత, సమర్థిత = సమర్థించఁబడిన (అనఁగానియ్యబడిన) శాశ్వతికాస్త్రప్రచారచాతుర్యుఁడు' అతండు = ఆ శ్రీరామమూర్తి, ఆశ్వత...భరుఁడు, ఆశు = శీఘ్రముగా, ఇత = పొందఁబడిన, శీత = చల్లనైన, నగ = వృక్షములయొక్క, అంతర్విశ్వంభరుఁడగుచు, సత్యవీక్షార్తమతిన్ = సత్య = సత్యముయొక్క, వీక్షా = దృష్టియందు, ఆర్త తొందరపడుచున్న, మతిన్ = బుద్ధిచేత.

వ. సమయప్రబుద్ధముకుళంబు లగువకుళంబులు నసమరసఫలప్రదానగరిమ విజితసురసాలంబులగు రసాలంబులును, వనాంచలసంచరణ చంచుపుళింద మిళిందసుందరాల కాబృందచరణారవింద సందర్భసద్యస్సముద్యదసమకుసుమమంజులమ్ములగు వంజులమ్ములును వన్యా కన్యా కేశ పాశసమాన శీలమ్ములగు తమాలమ్ములును కిన్నరబృందకుచ కలశ ముద్రికా ముద్రణోద్రిక్త కోరకమ్ములగు కురవకమ్ములును వనితాజనతా ఘన కటాక్షవీక్షణోన్నిద్ర ప్రసవ కపట పులకమ్ములగు తిలకమ్ములు నుప్లవమానపవమాన మాణవచలిత కర్పూరపూర వాసనాసమాసాదిత హాళహాళికలగు కనకకదళికలును చంచరీక సంచయ ప్రపంచా నుపాదేయమ్ములగు చాంపేయమ్ములును మొదలగు వసంతసమయ సముజ్జృంభిత కుసుమోపలంభంబులగు నఖిలకుంభినీజ సంరంభంబుల విలసిల్లు నతిపావనంబగు తపోవనంబుఁ బ్రవేశించెనంత.

టీ॥ సమ.....ముకుళంబులగు=సమయ=కాలమందు, ప్రబుద్ధ=వికసించిన, ముకుళంబులగు=మొగ్గలుగల, వకుళంబులును=పొగడచెట్లును, అసమ...పాలంబులగు- అసమ=తుల్యములేని, రస=రుచిగల, ఫల=పండ్లయొక్క ప్రదాన=యిచ్చుటయందలి, గరిమ=గౌరవముచేత, విజిత=జయింపఁబడిన, సురసాలంబులగు=కల్పవృక్షములుగల, రసాలంబులును=తియ్యమామిడిచెట్లును, వనాం...మంజులమ్ములగు, వనాంచల=వనప్రాంతమందు, సంచరణచంచు= సంచారముతోఁగూడిన, పులింగమిళిందసుందరాలకా = చెంచుపోలంతులయొక్క, బృంద=సమూహముయొక్క, చరణారవింద=పాదపద్మములయొక్క, సందర్భ=కూడికచేత, సద్యస్సముద్యత్ =తత్‌క్షణమందుదయించుచున్న, అసమ =సమానములేని, కుసుమ = పుష్పములచేత, మంజులమ్ములగు = మృదువైన, వంజులమ్ములను = అశోకవృక్షములను, వన్యా...శీలమ్ములగు = వన్యా = వనసమూహమనెడి, కన్యా = స్త్రీలయొక్క కేశపాశ = కొప్పుతోడ, సమానశీలమ్ములగు = తుల్యస్వభావముగల, తమాలమ్ములను = తాపింఛవృక్షములను, కిన్నరీ...కోరకమ్ములగు, కిన్నరీ = కిన్నరస్త్రీలయొక్క, బృంద = సమూహముయొక్క, కుచకలశ = కలశములవంటికుచములనెడు, ముద్రికా = సీళ్ళచేత, ముద్రణ = ముద్రించుటచేత, ఉద్రిక్త = అతిశయించిన, కోరకమ్ములగు = మొగ్గలుగల, కురవకమ్ములను = గోరంటచెట్లును, వనితా...పులకమ్ములగు = వనితాజనతా = స్త్రీజనసమూహముయొక్క, ఘన = గొప్పదియగు, కటాక్షవీక్షణ=క్రేఁగంటిచూపుచేత ఉన్నిద్ర = వికసించిన, ప్రసవ = పువ్వులనెడి, కపట = మిషముగల, పులకమ్ములగు = గగుర్పాటుగల, తిలకమ్ములును = బొట్టుగుచెట్లును. ప్లవ...హాళికలగు = ప్లవమాన = తూలుచున్న, పవమానరూణవ = పిల్లగాలిచేత, చలిత కదలించఁబడిన, కర్పూరపూర=కర్పూరసమూహముయొక్క, వాసనా = పరిమళముచేత, సమాసాదిత = పొందఁబడిన, హాళిహాళికలగు = త్వరగల కనకకదళికలును = బంగారపుటనటిచెట్లును, చంచ...దేయమ్ములగు, చంచరీకసంచయ = తుమ్మెదగుంపులయొక్క, ప్రపంచ = విస్తారమువలన, అనుపాదేయమ్ములగు = స్వీకరించఁదగని, చాంపేయమ్ములును = సంపంగిచెట్లును, పొ

దములగు = మొదలుగాఁగల, వసంత...లంభంబులగు, వసంతసమయము = వసంతకాలమందు, సముజ్జృంభిత = అతిశయించుచున్న, కుసుమ = పువ్వుల యొక్క, ఉపలంభంబులగు = లాభముగల, నిఖిల...రంభంబులన్, నిఖిల = సమస్తములైన, కుంభినీజ = వృక్షములయొక్క, సంరంభంబులన్ = ఆటోపములచేత, విలసిల్లు = ప్రకాశించునట్టి, అతిపావనంబగు = మిక్కిలిపవిత్రమైన, తపోవనంబున్ = తపోవనమును, ప్రవేశించెన్ = సొచ్చెను, అంత = అంతట,

క. అల్లనగాధేయుఁడువృష।
వల్లభుఁడునుదీక్షితుఁడయి-వ్రతవిధ్యుచితా।
త్యుల్లసితవస్తువిరచన।
సల్లలితవిచారసరణి-చక్కఁగఁజేసెన్॥

టీ॥ అల్లనగాధేయుఁడు- అల్ల=ప్రసిద్ధుఁడగు, నగ=పర్వతమునకు, ఆధేయుఁడు=పైనుండునీశ్వరుఁడును, వృషవల్లభుఁడును=నందీశ్వరుఁడును, దీక్షితుఁడయి=దీక్షగలవాఁడై, వ్రత...సరణి- వ్రతవిధి=నియమవిధికి, ఉచిత=తగిన, అత్యుల్లసిత=మిక్కిలిప్రకాశించుచున్న. వస్తు=వస్తువులయొక్క విరచన = రచించుటయందు, సల్లలిత = మిక్కిలిబాగైన- విచారసరణి _ ఆలోచనమార్గము, చక్కఁగఁజేసెన్ = బాగుగాఁజేసెన్.

సీత॥ అల్లనన్ = మెల్లగా, వృషవల్లభుఁడు- వృష = పుణ్యము, వల్లభుడు = ఇష్టముగాఁగల, గాధేయుఁడు = విశ్వామిత్రుఁడు, శేషముసమము.

శా. ఖ్యాతుండాతఁడుదారసంగరసభా-వాప్తింనురంతరంబుగాఁ।
జేతోవృత్తిఁదలంచిలక్ష్యపదసం-సిద్ధింబ్రసిద్ధాశుగా।
ఘాతోద్ఘాతనిరోధసాధనవిధిం-గల్పించియుద్యోగసం।
ప్రీతింజేయుచునుండునాశ్రమమునన్-మిన్నాతపంబేర్పడన్॥

టీ॥ ఖ్యాతుండు = ప్రసిద్ధుడగు, అతఁడు = ఆశివుఁడు, దార...వాప్తిన్- దార = భార్యయొక్క, సంగ = కలయికచేతనైన, రస = రుచియొ

క్కయుం. భాస = సాత్వికాదులయొక్కయు, ఆప్తిన్ = పొందుటను, దురం తంబుగాన్ = కష్టమైనదానిఁగా, చేతోవృత్తిన్ = మనోవ్యాపారముచేత, తలంచి = ఎంచి, లక్ష్యపదసంసిద్ధిన్ - లక్ష్య - చూపఁదగిన, పద = వస్తువు యొక్క, (పరమాత్మయొక్క) సంసిద్ధిన్ = సిద్ధిని, ప్రసి...విధిన్ - ప్రసిద్ధ = లోకప్రసిద్ధములైన, ఆశుగ = ప్రాణవాయువులయొక్క, ఆఘాతోద్ఘాత = ప్రవేశనిర్గమములయొక్క, నిరోధ = అడ్డుటకు. సాధన = సాధమైన, విధిన్ వ్యాపారమును, కల్పించి = సంధానపరచి, ఉద్యోగసంప్రీతిన్ ఉత్ = ఉన్నతమైన, యోగ = యోగమందు. సంప్రీతిన్ = సంతోషమును, ఆశ్రమమునన్ ఆశ్రమమందు, మిన్నాతపంబు = శ్రేష్ఠతపస్సు. ఏర్పడన్ = ఏర్పడునట్లుగా ఉండున్ = నివసించును

సీ॥ ఖ్యాతుఁడాతఁడు = ప్రసిద్ధుఁడగు వాశ్రిగామమూర్తిన్, ఉదా... వాప్తిన్ - ఉదార = గొప్పదియగు, సంగరసభా = యుద్ధవాటికయొక్క, అవాప్తిన్ = పొందుటను, దురలతంబుగాన్ = కష్టమయినదానిగా, చేతోవృత్తిన్ = మనోవ్యాపారమున, తలంచి = ఎంచి, లక్ష్యపదసంసిద్ధిన్ - లక్ష్య = గురియొక్క, పద = స్థానముయొక్క. సంసిద్ధిన్ = సిద్ధియందు, ప్రసి ..విధిన్ - ప్రసిద్ధ = అతిశయముచేసిద్ధించియున్న, ఆశుగ = బాణములయొక్క. ఆఘాతోద్ఘాత = ప్రయోగసంహారములయందును, నిరోధ = అడ్డగించుటయందును సాధన = సాధనక్రియను, కల్పించి = చేసి, ఉద్యోగసంప్రీతిన్ = ప్రయత్నమందుసంతోషమును, చేయుచున్ = రచించుచు. ఆశ్రమమునన్ = విశ్వామిత్రాశ్రమమందు, మిన్న = ఆకాశము, అతపంబేర్పడన్ = (తనపరాక్రమముచేత) యెండగాయఁగా, ఉండున్ = ఉండును.

శా. ఆచారార్పితలాజరాజిచరణా-ధ్యాయాస్యదేశంబులన్ ।
ప్రాచీనప్రవణప్రదేశములసో-పప్రస్తరాస్తారముల్ ।
సాచిప్రస్తుతసామగానమునిరా-ట్స్వరవ్యస్తచ్ఛాత్రారావముల్ ।
వాచాతీతగతింబొసంగెడునన-ర్వాచీనవీచిన్వనిన్ ॥

టీ. ఆచా... దేశంబులన్ - ఆచార=ఆచారములచేత, ఆశ్రిత=పొందఁబడిన, లాజరాజి=పేలాలప్రోవులయొక్క, చరణార్థ=తినుటకై, ఆయాస్యత్=రాఁగల, ఏణంబులన్=లేళ్ళుగల, ప్రాచీ... దేశములన్ - ప్రాచీన ప్రవణ=ప్రాక్ప్రవణస్థితిగల, ప్రదేశములన్ = వేదికాస్థలములయందు, సోపస్తారముల్ - సోపప్రస్తర=పైఁబరచఁబడిన దర్భలతోఁగూడిన, ఆస్తార=పరచినదర్భలును, ప్రాచి...తముల్ - ప్రాచి=తిరస్సన్ముఖముగా, ప్రస్తుత=ఆరంభింపఁబడిన సామ=సామవేదముయొక్క, గాన=పాటగల, మునిరాట్=మునిశ్రేష్ఠులయొక్క, సర్వ=సమస్తములయిన, స్వర=స్వరములయొక్క, ఆలాపముల్=ధ్వనులును, వాచాతీతగతిన్=చెప్పశక్యముగానిరీతిచేత, ప్రసంగెడు=ఒప్పుచున్నట్టి, అనర్వాచీనవీచిన్ - అనర్వాచీన=తక్కువగాని, వీచిన్=అవకాశముగల, వనిన్=అరణ్యమందు.

శా. సారంగోత్తమచర్మమంగమునఁ నాచ్ఛాదించి సత్యైకర
స్యారూఢస్థితి నాశ్రమంబలర నార్యాధీశుఁ డాదీక్షతోఁ।
ఘోరంబౌ తపమాచరింపఁగ ననసంఖ్యుల్ కర్మఠనిష్ఠాతిర
స్కారార్థంబు తపోవనంబును యదృచ్ఛం జూచి రత్యుద్ధతిన్॥

టీ॥ సారంగోత్తమచర్మము=గజశ్రేష్ఠునియొక్క తోలును, అంగమునన్=దేహమందు, ఆచ్ఛాదించి=కప్పి. సత్యైక...స్థితిన్ - సతీ=సతీదేవియొక్కని, ఏకరస్య = ముఖ్యానురాగముగలుగుటను, ఆరూఢ = పొందినట్టి, స్థితిన్ = ఉనికిచేత, ఆర్యాధీశుఁడు - ఆర్యా = సతీదేవియొక్క, అధీశుఁడు = పెనిమిటియగునీశ్వరుఁడు, ఆదీక్షతోన్ = చెప్పియున్న దీక్షతోన్ [illegible] తపము = తపస్సు, ఆచరింపఁగన్ = చేయఁగా, అనసంఖ్యుల్ = లెక్కలేనివారు, (అనఁగాఁబలుమంది) కర్మ... స్కారార్థంబు - కమఠ = తపఃకర్మఠయొక్క, నిష్ఠా = నిశ్చలత్వముయొక్క, తిరస్కారార్థంబు = తిరస్కరించుటకొఱకు, తపోవనంబును - శివునితపోవనమును, యదృచ్ఛన్ = స్వేచ్ఛచేత, అత్యుద్ధతిన్ = మిక్కిలిగురుసుతనముచేత, చూచిరి = వీక్షించిరి.

చక్రములును- సహిత=సమానములగు, (ఇదిసంహితశబ్దమునకు రూపాంతరము) సత్=యోగ్యములగు, జఘనాఢ్యచక్రములును, ప్రశస్తచక్రములవంటి కటిప్రదేశభాగములును, విమల ..లములును- విమల=నిర్మలములగు, అర్ధచంద్ర=సగముచంద్రునివంటి- ఫాలములును=లలాటములును, ఉల్లసిత ...స్ఫురణ- ఉల్లసిత=ప్రకాశించుచున్నట్టియు, సుందర=సొగసైనట్టియు, మణీజాత=రత్నసమూహములయొక్క, విస్ఫురణ=ప్రకాశము, తనరన్=ఒప్పునట్లుగా, తరులన్=చెట్లలోను, విరులపందిరులలోపలన్=పువ్వుల పందిరులలోపలను, చొచ్చి=ప్రవేశించి, యతులన్=నియమముగలవారిని, మహర్షులన్=గొప్పమునులను, అరచన్=అరచునట్లుగా, చెరచి=నియమభంగముఁజేసి, మానవతులు=స్త్రీలు, ఆపగలన్=అట్టియకారణవిరోధములచేత, సద్విధానములన్=యోగ్యక్రియలను, తామసులు=తమోగుణముతోఁగూడినవారును, కామరతులు=కామమందాసక్తిగలవారును, ఆరామ......భూమలు- ఆరామ=ఉద్యానముయొక్క, నికట=సమీపమందు, భీమ=శివునియొక్క, వ్రత=నియమముయొక్క, విభంగ=భంగపెట్టుటయందు, భూమలు=బాహుళ్యముగలవారును, అగుచు=పొందుచు, మత్తులము=మత్తతగలవారము, దుష్టవర్తనములన్=దుర్వ్యాపారములచేత, ప్రవర్తిలిరి=ప్రవర్తించిరి

సీ॥ ఘనకుంతలతలు=గొప్పవియగుతీగలవంటియాటలు, అమ్ములును=బాణములును=విశాలతదగు=వైశాల్యముచేతినొప్పు, బిరుదులు=బిరుదాంకములును, సుర...... శస్తములగు, సుర=దేవతలకు, భీకృతి=భయమునుజేయుటయందు, ప్రశస్తములగు=గొప్పవియైన- చాపహస్తములును- ధనుస్సులతోఁగూడినచేతులును, పట్టిస...... చక్రములును- పట్టిస=ఆయుధవిశేషములును, హిత=ఇష్టములై. సజ్జ=సిద్ధములై, ఘన=గొప్పవియు, ఆఢ్య=సమర్థములైన, చక్రములును=చక్రాయుధములును, విమలా...ఫాలములును, విమల=నిర్మలములైన, అర్ధచంద్ర=అర్ధచంద్రబాణములను, ఫాలములును-కత్తివంటిఆయుధములును, ఉల్లసిత...స్ఫురణ- ఉల్లసిత=ప్రకాశించుచున్న, సుంధ=సుందునియొక్క, రమణీ=భార్యయగుతాటకవలన, జాత=పుట్టిన

సుబాహురాక్షసునియొక్క, విస్ఫురణ=అతిశయము, తనరన్ = ఒప్పునట్లు తరులలోవిరుల పందిరులలోపలఁజొచ్చి, అతులమహార్షలన్ = సామ్యము లేని గొప్పవనములను, అరచన్ = అరచుచుండఁగా, చెరచి=చెడఁగొట్టి, మాన వ...ధానమునకున్ - మానవ=మనుష్యులయొక్క, తులా, సామ్యమును, అప గ=పాటిపోయిన, లసత్ =ప్రకాశించుచున్న, విధానమునకున్ = క్రియకు, తామసులు గామరతులు, ఆరామ...సీమన్ - ఆ=అట్టి, రామనికటసీమన్ శ్రీ రామమూర్తియొక్క సమీపప్రదేశమందు, భీమప్రతివిభంగ భూములు = భయంకరములగు నియమములను భంగపెట్టుటయందు బాహుళ్యముగలవారు, శేషము సమానము

సీ. వనలుప్పతిలనుప్పు-నునుగొప్పలనువిప్పు,
మురుదాళిదగరంభ-బరఁగెనొకట।
గనవళ్కుచును బెళ్కు-చునుకళ్కుకడకంటి,
గరిమమించఁగనిల్చె-హరిణిరొకట।
ననమానలసమాన-మగుగొనముల తాన,
ములమించిభ్రమరిక-బాలిచెనొకట।
బలునీటులుచొకాట-ములు తేటపడుపాట,
లనువించివాసంతి-దనరెనొకట॥

ఆ. నిటులమరునియతుల-వృత్తివర్తులతపో।
వనమునందునాస-వమ్ములల్కఁ।
బట్టిచెరచికొనుచు-బాధించిరపుడుడు।
రాశరమణులెల్ల-వైశసమున॥

టీ. వనలుప్పతిలన్ = పువ్వులువిజృంభించఁగా, ఒప్పు=తగునట్టి, నును గొప్పలను=నున్నని కేశబంధములను, విప్పు=విడఁదీయునట్టి, మరుత్ = వా యువులయొక్క, ఆళి=పఙ్క్తి, తగన్ = ఒప్పునట్లు, రంభ=రంభయనునప్స

సీత॥ అపరి...పపన్నము-అపరిమిత = మితములేని, పావన = వాయు సంబంధియగు, అర్చిః = తేజస్సుతోడ, ఉపపన్నము = కూడిన, తదంబకంబు = ఆశ్రీరామమూర్తియొక్క బాణము, పైన = సుబాహునిజంపినతరువాత, సుమారీ...విలాసములు-సుమారీ = అప్సరస్త్రీలయొక్క చపల = చంచలములగు, ఆదేశ = ఆజ్ఞలును, విలాసములు = శృంగారచేష్టలు, శీమము తుల్యము.

క. కలయంగనలిసమతికిం
పులు వెలయమినదరి పారి-పోవుచునలుది
క్కులఁగొందరుగుహలనువన
ములఁగొందరుడాగిరపుడు-మోహితమతులై ॥

టీ॥ కలయన్ = అంతటవ్యాపించునట్టుల, కనలినమతికిన్ = కోపించినమనస్సునకు, ఇంపులు = ఇష్టములు, వెలయమిన్ = పుట్టకుండుటచేత, అదరి = జడిసి, పారిపోవుచున్ = పరుగుపెట్టుచు, నలుదిక్కులన్ = నాల్గుదిక్కులయందును, కొందరు = కొంతమంది, గుహలను = పర్వతరంధ్రములయందును, కొందరు = కొంతమంది, వనములన్ = అడవులయందును, మోహితమతులై = మోహపెట్టబడినవారై, అపుడు = ఆసమయమందు, డాగిరి = డాగియుండిరి.

క. ఈగతినుదుటునమించుమ
హాగరిమాంబకసముజ్జ్వ-లానలసత్వ
శ్రీగగనమంటగను జే
జేగరితలుభోరటంచుఁ-జెప్పిరివేగన్ ॥

పా॥ ఈగతిన్ = ఈరీతిచేత, ఉదుటునన్ = ఔద్ధత్యముచేత, మించు - అతిశయించునట్టి మహా...శ్రీ = మహత్ = గొప్పదియగు, గరిమ = గురుత్వముగల, అంబక = నేత్రమందు, సముజ్జ్వల = ప్రజ్వలించుచున్న అనల = అగ్నియొక్క, సత్వ = బలముయొక్క, శ్రీ = శోభ, గగనమంట

గను = ఆకాశమంటగా, జేజేకత్తెలు = దేవతాస్త్రీలు, భోరంటమ్ - భోరనుచును, వేగన్ = త్వరచేత, చెప్పిరి - చెప్పుకొనిరి॥

సీత॥ మహా..శ్రీ మహాకరము = మిక్కిలిగొప్పవైన యుగంల అంబక = బాణములయొక్క, సముజ్జ్వల = ప్రకాశించుచున్న, అనలసత్వ - చురుకుదనముయొక్క, శ్రీ = సంపద, శేముషసయు,

క. గడగడవడకెం దెసలు।
ప్పడు పుడమియు జడిసి యడరె-బుడిబుడినడకన్।
గదలుకొనె మొకము లెదనెద।
నడుగడుగున భయముపడుచు-నడవులనడుమన్॥

టీ॥ అప్పుడు = ఆసమయమందు, దెసలు = దిక్కులును, గడగడ వడకెను = గడగడ జంచలించెను, పుడమియున్ = భూమియును, జడిసి = భ్రాన్పుటచేత అడరెన్ = ఒప్పెను, అడవులనడుమన్ = వనమధ్యమందు. మొకములు = వృక్షములు, ఎదనెదన్ = అన్నిచోట్లను, అడుగడుగునన్ = ప్రతిపాదమందు, భయపడుచున్ = వెరచుచు, బుడిబుడినడకన్ = తొట్రుపడునట్టినడకను, కదలుకొనెన్ = ఆరంభించెను.

వ అట్టిమహోన్నతఘోర విరామంబగు నారామంబున న య్యవసరంబున.

టీ॥ అట్టి = అప్రకారమయిన, మహా..రామంబగు మహోన్నత = మిక్కిలి గొప్పవియగు, ఘోర = భయంకరవ్యాపారములే- విరామంబు = పర్యవసానముగలది, అగు నారామంబునన్ - ఆయుపవనమునందు, అయ్యవసరంబునన్ = ఆసమయమందు.

సీ. కంచుమించుగమించు-నంచనెంచగసంచ,
రించుపల్కులకల్కి - కేసతపము,

జన్నమన్నముగాఁగ-మన్నమన్నెలవాక,
వెన్నంటెరాఁగ జన్న-విభుతపంబు।
గట్టుపట్టినిఁజెట్టఁ-బట్టిచట్టుపవేలి,
నట్టెజెట్టినిఁగ్రోలు-దిట్టతపము।
దిక్కుదిక్కున నగ్గి-పెక్కుఁగ్రిక్కు నజాస్త్రి,
మక్కజంబుగ మెక్కు-యమితపంబు।

గీ. తనతపంబున కెనయంచు-మునులుఁబొగడ।
కలయనల్లన గాధేయ-ఘనతపస్వి।
మించునారామసవిధభూ-మికినివచ్చె।
సుమహితమతి ప్రేమపధిన-చ్యుతుఁడునగుచు॥

పా॥ కంటుమింటుమగఁగ = నిరాతంకముగా, మించు = శోభించునట్టి. అంచఁ = హంసచేతను, ఎంచగఁ = స్తోత్రముఁజేయునట్లుగా, సంచరించు = తిరుగునట్టి, పలుకులకలికి = సరస్వతియొక్క, రేని = పెనిమిటియగుబ్రహ్మయొక్క, తపము = తపస్సును, జన్నము = యజ్ఞము, అన్నముగాఁగ = ఆహారముగా, మన్న = జీవించిన, మన్నెలప్రభువులనఁగా దేవతలయొక్క, వాక = నది. (అనఁగా గంగ) వెన్నంటెరాఁగ = వెనుకరాఁగా, జన్న = నడచిన. విభు = రాజుయొక్క (అనఁగా భగీరథునియొక్క) తపంబు = తపస్సు. గట్టుపట్టిని = హిమవత్పర్వతపుత్రికయగుమైనాకుని. చెట్టబట్టి = స్వీకరించి. చట్టుపలు = రెక్కలు. ఏలినట్టిజెట్టిని = ఆపినసముద్రుని. క్రోలినట్టిదిట్ట = త్రాగిన అగస్త్యునియొక్క. తపము = తపస్సును. దిక్కుదిక్కునఁ = ప్రతిదిక్కునందును. అగ్గి = అగ్నిని. పెక్కు = విస్తారముగా. క్రిక్కు = వ్యాపింపజేయునట్టి. అజాస్త్రి = బ్రహ్మాస్త్రమును. అక్కజంబు = ఆశ్చర్యముగా. మెక్కు = మ్రింగిన. యమి = వసిష్ఠమునియొక్క. తపంబు = తపస్సును. తనతపంబునకుఁ = తనతపస్సునకు. ఎనయంచుఁ = స

మానమని మునులు బొగడఁగ. మును లుపన్యసించఁగా. కలయన్ = వ్యాప్తమగునట్లు. అల్ల = ప్రసిద్ధుఁడయిన. నగాధేయ = పర్వతముపైనుండు నీశ్వరుఁడనెడు ఘనతపస్వి = గొప్పతాపసి. మించు. ఒప్పునట్టి. ఆరామసవిధభూమికిని = వనమందలిసమీపభూమికి. సుమహితమతి = మిక్కిలి పూజ్యమగుబుద్ధిగల. అచ్యుతుండు = విష్ణుమూర్తి. నగుచున్ = నవ్వుచు. ప్రేమవిధిన్ = ప్రేమయొక్క చేయూఁతచేత ఎచ్చెన్ = ఏతెంచెను.

సీత॥ ప్రేమవిధిన్ = ప్రేమవిధిచేత. అచ్యుతుండు — జారనట్టి. గాధేయఘనతపస్వి = విశ్వామిత్రుఁడను గొప్పతాపసి. అల్లనన్ = మెల్లగా. మించు = అతిశయించునట్టి. ఆ = అట్టి. రామసవిధభూమికిని = శ్రీరాముని సమీపభూమికి. శేషము సమము

చ. అరుదుదలిర్పనప్పుడస-మాంబకుఁ డాకలితాపవారణున్।
దురితవిభేదిస్వామిని నె-దుర్కొ-నియంఘ్రిసరోరుహమ్ములం।
నురుతరభక్తి వ్రాలిముద-మొప్పఁగముంగలనిల్చె నంజలి।
స్ఫురదురుపాణిపంకజవి-భూషణశాలివినమ్రమౌళియై॥

పా॥ అరుదుదలిర్పన్ = ఆశ్చర్యమొప్పునట్లు, అప్పుడు = ఆసమయమునందు, అసమాంబకుఁడు = శివుఁడు. ఆ = అట్టి, కలితాపవారణున్ కలి = దోషముచేతనైన, తాప = బాధలను, వారణున్ = నివారించునట్టి. దురితవిభేదిస్వామిన్ దురితవిభేది = పాపములనుబోఁగొట్టునట్టి, స్వామినిన్ = పేరుగలవిష్ణువును, ఎదుర్కొని = ఎదురుగా వెళ్ళి, అంఘ్రిసరోరుహమ్ములందున్ = పాదపద్మములయందు, ఉరుతరభక్తిన్ = మిక్కిలిగొప్ప భక్తిచేత, వ్రాలి = నమస్కరించినవాఁడయి, ముదమొప్పఁగన్ = సంతోషమొప్పునట్లు, అంజలి . . . . శాలియై. అంజలి = దోసిలిచేత, స్ఫురత్ = ప్రకాశించుచున్న, ఉరు = గొప్పదియగు, పాణిపంకజ = హస్తపద్మమునందు, విభూషణ = అలంకారముచేత, శాలి = ఒప్పుచున్న, వినమ్ర = వంగిన, మౌళియై = శిఖగలవాఁడయి, నిల్చెన్ = నిలువఁబడెను.

సీత॥ అసమాంబకుఁడు = సమానరహితములగు బాణములుగల రాముఁడు, అకలితాపవారణున్. అకలిత = తెలియఁబడిన. అపవారణుడ్ = అంతర్ధానముగలిగినట్టియు, దురితవిఘాతిన్ = పాపములను పోఁగొట్టునట్టి దును, అముని = అనిశ్వామిత్రుని, శేష ॥ సులభము.

ఉ. భక్తినినిల్చునాతనిన-పారకృపారసలోచనాంచలా।
సక్తినసుగ్రహించియల-సత్త్వమునందు నెనీను సేవకుం।
జిత్తమువిస్మయంపడియె-జెప్పెగనీకొక కామితంబునే।
ర్వృత్తముగాఁదలంపుము-సమీహితసిద్ధి నినొక శాధరా॥

తా॥ భక్తిం = భక్తిచేత. నిల్చు = నిల్చిన అతనిన్ = అతనిని. అపారకృపారస = దయారసముగల. లోచనాంచల = కడగంటిచూపులయొక్క. అసక్తిన్ = సామీప్యముచేత అనుగ్రహించి = దయచేసి, అల = అట్టి. సత్త్వమునందు = సత్త్వగుణముయొక్క యువతారము వాఁడైన అనెన్ = ఇట్లుచెప్పెను. ఓకశాధరా = చంద్రకళాధారివగు ఓ శివుఁడా నీదుసేవకున్ = నీవుజేసెడు పరిచర్యకు. చిత్తము = మనస్సు, విస్మయంపడియెన్ = ఆశ్చర్యపడెను. నీకు. ఒక కామితంబు = ఒకకోరికను చెప్పెగన్ = చెప్పఁగలను. సమీహితసిద్ధిని = కోరికయొక్క సిద్ధిని. నిర్వృత్తముగాన్ = జరిగినదిగా, తలంపుము = ఆలోచింపుము.

సీత॥ అతనిన్ = అశ్రీరామమూర్తిని. సత్త్వమునందు = సత్త్వగుణప్రధానుఁడగు విశ్వామిత్రుఁడు. ఓకశాధరా = శాస్త్రములను ధరించిన (అనఁగా శ్రుతిశాస్త్రాది) ఓ శ్రీరామమూర్తి.

సీ. కడుఁబ్రౌఢిమహిమపం-తుఁడసిలోకములెల్లఁ,
బొగడఁగమించుధశే-ద్రసఁడగణనీయ।
సంపత్తిజనకుంను-నింపానునాతని,
కన్యయనన్యసా-మాన్యయగుచు।

ప్రమాణమహిమదనరన్ = యాథార్థ్యమునాత్రయమొప్పునట్లు ఆనెన్ = చెప్పెను.

సీత॥ కడుఁబ్రౌఢిన్ = మిక్కిలి ప్రౌఢత్వముచేత. మహిమవంతుఁడని = మహత్త్వముగలవాఁడని లోకములెల్లఁ బొగడమించు ధరేంద్రుఁడు = రాజైనట్టి. అగణనీయసంపత్ = వర్ణింపశక్యముగానియైశ్వర్యముగల. జనకుఁడు = జనకుఁడను రాజు. అతి..వసం = అతికోమల = మిక్కిలికోమలమైనదియగు. ప్రభా = కాంతికి. వసతి = స్థానమైనది యనమెల్లన్ - మనమందరము. భూతిదివ్యశాలియగు. విశ్వాంగదివ్యములచే నొప్పుచున్నవాఁడయిన. రాజమౌళిన్ = రాజశ్రేష్ఠుఁడగు శ్రీరామమూర్తిని సర్వమాననీయుఁడు = అందరుమునులకైనను గౌరవించఁదగు విశ్వామిత్రుఁడు. శేషముసమము.

క. వన్యాతతిననన్యాదృశ।
సన్యాసపవిత్రులైన-సన్మునివచో।
విన్యాసమునను తింపఁగ।
మున్యావళిసేవ్యుఁడతఁడు-ముదమునఁజనియెన్॥

తా॥ వన్యాతతిన్ = వన్యా = వనసమూహముయొక్క. తతిన్ = విస్తారమందు. అనన్యా...పవిత్రులైన. అనన్యాదృశ = అపూర్వమగు సన్యాస = సంసారత్యాగముచే. పవిత్రులైన = పుణ్యులైనట్టి సన్మునులు = మంచివిబుధులు. వచోవిన్యాసమునన్ = వాక్యప్రయాసముచేత. నుతింపఁగన్ = స్తోత్రముచేయుఁగా. మున్యావళిసేవ్యుండు = మునిపఙ్క్తిక సేవించఁదగిన. అతఁడు = ఆవిశ్వామిత్రుఁడు ముదమునఁ జనియెన్ = సంతోషముచేత వెడలెను.

సీత॥ అతఁడు = ఆశ్రీరామమూర్తి.

క. రాజశిశుమౌళిసన్ముని।
రాజాన్వితుఁడగుచునంత-రమణీయకృపా।

తను=శరీరమువలన నిర్యత్=బయలుదేఱుచున్న - రక్తశైవాలినీ=రక్త నదుల యొక్క - సంభారంబనఁ=ప్రోవనునట్లు- సంజకెంజిగివికాసంబు=సంధ్యారాగవికసనము- ప్రత్యగ్దిశఁ=పడమరదిక్కున- ఒప్పెఁ=ప్రకాశించెను.

వ. అనినవిని హర్షోత్కర్ష తరంగితాంతరంగుఁడగుచుఁ దదనంతరవృత్తాంతం బెఱింగింపుమనుట.

టీ॥ స్పష్టము.

క. శరణాగతజనభరణా । భరణాయితలసదపాంగ-పలితంకరణా।
కరణాతిగసంచరణా । చరణాంభఃకలితగర్భ-జడిమవిశరణా॥

టీ॥ శరణా...కరణా-శరణ=రక్షణమునుగూర్చి-ఆగత=వచ్చిన- జన=మనుష్యులయొక్క--భరణ=భరించుటయనెడు- ఆభరణ=అలంకారముచేత-లసత్=ప్రకాశించుచున్న- అపాంగ=నేత్రప్రాంతమందు-పలితంకరణా=వరప్రదేయువాఁడా-కరణాతిగసంచరణా- కరణాతిగ=ఇంద్రియగోచరము గాని-సంచరణా=సంచారము గలవాఁడా- చరణాం...విశరణా- చరణ=పాదమందలి-అంభః=ఉదకముచేత-కలిత=చేయఁబడిన- గర్భ=కుక్షియందలి- జడిమ=మాంద్యముయొక్క- విశరణా=సంహారముగలవాఁడా.

గద్య.

ఇది సర్వతంత్రస్వతంత్ర సకలభాషావిశేషకవితా ధురంధర ప్రతిదిన ప్రబంధ పరమేశ్వర శ్లేషయమకచక్రవర్తిబిరుదాంక తిరుమల బుక్కపట్టణ శ్రీనివాస తాతాచార్యతనయ శ్రీమదణ్ణయాచార్య దీక్షితసుత పితృవ్య శ్రీనివాసాచార్యకృపాకటాక్షలబ్ధ సకల పాండిత్య తర్కాలంకార వాగీశ్వరబిరుదాంక వేంకటాచార్య ప్రణీతంబైనయచలాత్మజా పరిణయంబను శ్లేష ప్రబంధంబు నందుఁ దృతీయాశ్వాసము సర్వంబును సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ.

---